| శుభకార్యము | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | శుద్ధి - విశేషములు |
|---|---|---|---|---|---|
| విద్యారంభం | 2,3,5,7,10 11,13 | సోమ, బుధ గురు, శుక్ర | అశ్వి, మృ, ఆర్ద్ర, పున, పుష్య, ఆశ్రేష, పూర్వా త్రయం, హ,చి,స్వా, మూ, శ్ర, ధని, శత, అనూ | మే, మి, కటక, కన్య, తుల ధను,మకరం | దివాభాగము శుభము |
| ఉపనయనం | 2,3,5,7,10 11, (6-12) | సోమ, బుధ గురు, శుక్ర | రోహి, మృ, ఉత్తరాత్రయం, చిత్త అనూ, ధని, శత, రేవతి (పుష్యమి) | వృష,మి, సిం,కన్య, వృశ్చి ధను, కుంభ, మీనం | అష్టమ శుద్ధి - కలశచక్ర శుద్ధి (చతుర్థ శుద్ధి) |
| వివాహం | 2,3,5,7,10 11,12,13,15 | బుధ గురు, శుక్ర | రో, మృ, మఘ, ఉత్తరాత్రయం హ, స్వా,అనూ,మూ,శత,రేవ (అశ్వి,శ్ర,చి,ధ) | శుభ లగ్నములు | జామిత్ర శుద్ధి, మీన చైత్రం, 6 లో శుక్ర నింద్యం |
| వాపీ కూపాదికం | 2,3,5,7, 10,11,13,15 | సోమ, బుధ గురు, శుక్ర | అశ్వి, రో,మృ, పుష్య,మ, ఉత్తరాత్రయం,హ, అనూ,(జ్యే) మూ,శ్ర,ధని,శత, రేవతి | కర్కాటకం, మకరం కుంభం, మీనం | ఆగ్నే, దక్షిణ నైఋతి, వాయవ్య దిశలు, గృహం మధ్య కూడదు. |
| బీజావాపనం | 2,3,5,7,9 10,11,13,15 | సోమ, బుధ గురు, శుక్ర | (అశ్వి) రో, పుష్య,మఖ, ఉత్తరాత్రయం,హస్త,స్వా అనూ, మూల, శ్రవ, శత, రే (మృ,పున,ధని) | వృష, కర్కాట,సింహ (తుల) మక, (కుంభ, మీనం) | అష్టమ శుద్ధి 3,6 లలో శుభలు కూడదు |
| దేవతా ప్రతిష్ఠ | 2,3,5,7,8 10,11,12,13 | ఆది,సోమ బు,గు,శు | అశ్వి, రో,మృగ,పున,పుష్య, మఖ,ఉత్తరాత్రయం, హ,చి,స్వా,వి, అనూ,మూల,శ్ర,ధ,శత, రేవతి | మే,వృష, మిధు, కన్య,వృశ్చి ధను, మీనం, తుల, మ | శుభులకు ఉత్తరాయణం పాపులకు దక్షిణాయనం |
| యాత్ర | 2,3,5,7 10, 11,13 | బుధ, గురు, శుక్ర | అశ్వి,రో,మృ,పున, పుష్య,ఉత్తరాత్రయం హ,చి,స్వా,అనూ,శ్ర,ధ,శత, రేవతి | మేష, మీన, వృశ్చి, కన్య | పంచమశుద్ధి సుశకునం |
| క్రయ, విక్రయ వాణిజ్యారంభం | 2,3,5,7 10,11,13,15 | ఆది, సోమ,బుధ గురు,శుక్ర,శని | అశ్వి,భర, కృత్తి, రో,మృ(ఆర్ద్ర) పుష్య,ఆశ్లే, పూర్వాత్రయం, ఉత్తరాత్రయం, హ,చి,స్వా (విశా) అనూ, శ్రవ, శత, రేవతి | కుంభం, వినా | శు.చ. శుభయుతం, అష్టమశుద్ధి 12, 2, 11 శుద్ధి |

**శుభకర్మలయందు మహాదోషములు :** దుష్టతిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు (విష్కంభ, అతిగండశూల, గండ, వ్యాఘా, పరి, వ్యతి, పరిఘ, వైధృతి, దుష్టయోగము, విష్టి, శకుని, చతు, నాగ (కింస్తుఘ్నము) సంక్రాంతి ఆయన దినములు, పాపాక్రాంత, పాపదృష్టి లగ్నములు, అష్టమ కుజుడు, షష్ఠ శుక్రుడు, పాపగ్రహకర్తరి. జన్మలగ్న చంద్ర లగ్నములకు అష్టమలగ్నము, షష్ఠాష్టమ ద్వాదశములలో చంద్రుడు, సగ్రహ చంద్రుడు, వేధ క్రాంతలు, గ్రహణ నక్షత్రము, వర్జ్య, దుర్ముహూర్తములు, తిథి నక్షత్ర సంధులు, మహాపాతలు ఇవి విడువదగినవి. శుభముహూర్తములకు మహాదోషములను విడువవలెను. ఆయా శుభకర్మకై ఇందు చెప్పబడిన తత్తత్కాలమున్నవి యగు తిథి పక్షాదినుండి లెక్కింపవలెను. వారనక్షత్రలగ్నము తిథులను కలిపి 9చే భాగింపగానగు శేషము 1,2,4,6,8 యగుచో నవి క్రమముగ మృత్యు, అగ్ని, రాజ, చోర, రోగ భయములను చేయును. 3,5,7,9 ఇవి శేషమగుట శుభము. 1,2 మిక్కిలి దోషం. గత తిథి లగ్న సంఖ్యలను కలిపి 9 చే భాగించుట మతాంతరము, ధృవకము కలుపుట శాస్త్రీయము కాదు.

# వివాహ విషయంలో వధూవరుల నక్షత్రాల, గణాల పరిశీలనకు పట్టిక

| నక్షత్రం | పాదం | రాశి | రాశ్యాధిపతి | గణం | నామాక్షరము | యోని | నాడీ | రజ్జు | వేధానక్షత్రం | స్త్రీ/పు/నపుం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | 1,2,3,4 | మేషం | కుజ | దేవ | చూ,చే,చో,లా | గుర్రం | ఆది | పాద | జ్యేష్ఠ | పుం |
| భరణి | 1,2,3,4 | మేషం | కుజ | మనుష్య | లీ,లూ,లే,లో | ఏనుగు | మధ్య | కటి | అనురాధ | స్త్రీ |
| కృత్తిక | 1 | మేషం | కుజ | రాక్షస | ఆ | మేక | అంత్య | ఉదర | విశాఖ | పుం |
| కృత్తిక | 2,3,4 | వృషభం | శుక్ర | రాక్షస | ఈ, ఊ, ఏ | మేక | అంత్య | ఉదర | విశాఖ | పుం |
| రోహిణి | 1,2,3,4 | వృషభం | శుక్ర | మనుష్య | ఓ, వా, వీ, వూ | సర్పం | అంత్య | కంఠ | స్వాతి | పుం |
| మృగశిర | 1,2 | వృషభం | శుక్ర | దేవ | వే, వో | సర్పం | మధ్య | శిరో | ధని, చిత్త | నపుం |
| మృగశిర | 3,4 | మిథునం | బుధుడు | దేవ | కా, కి | సర్పం | మధ్య | శిరో | చిత్త, ధని | నపుం |
| ఆర్ద్ర | 1,2,3,4 | మిథునం | బుధ | మనుష్య | కూ,ఖం,జ్గ,ఛ్ఛా | కుక్క | ఆది | కంఠ | శ్రవణం | స్త్రీ |
| పునర్వసు | 1,2,3 | మిథునం | బుధ | దేవ | కే,కొ,హా | పిల్లి | ఆది | ఉదర | ఉ.షాఢ | పుం |
| పునర్వసు | 4 | కర్కాటకం | చంద్ర | దేవ | హి | పిల్లి | ఆది | ఉదర | ఉ.షాఢ | పుం |
| పుష్యమి | 1,2,3,4 | కర్కాటకం | చంద్ర | దేవ | హూ,హే,హో,డా | మేక | మధ్య | కటి | పూ.షాఢ | పుం |
| ఆశ్లేష | 1,2,3,4 | కర్కాటకం | చంద్ర | రాక్షస | డీ, డూ, డే, డో | పిల్లి | అంత్య | పాద | మూల | స్త్రీ |
| మఖ | 1,2,3,4 | సింహం | రవి | రాక్షస | మా,మీ,మూ,మే | ఎలుక | అంత్య | పాద | రేవతి | స్త్రీ |
| పుబ్బ | 1,2,3,4 | సింహం | రవి | మనుష్య | మో,టా,టీ,టూ | ఎలుక | మధ్య | కటి | ఉ.భాద్ర | స్త్రీ |
| ఉత్తర | 1 | సింహం | రవి | మనుష్య | టే | వృషభం | ఆది | ఉదర | పూ.భాద్ర | స్త్రీ |
| ఉత్తర | 2,3,4 | కన్య | బుధ | మనుష్య | టో,పా,పీ | వృషభం | ఆది | ఉదర | పూ.భాద్ర | స్త్రీ |
| హస్త | 1,2,3,4 | కన్య | బుధ | దేవ | పూ,ష,ణ,ఠ | మహిషం | ఆది | కంఠ | శతభిషం | స్త్రీ |
| చిత్త | 1,2 | కన్య | బుధ | రాక్షస | పే,పో | పులి | మధ్య | శిరో | మృగ, ధని | స్త్రీ |

| నక్షత్రం | పాదం | రాశి | రాశ్యాధిపతి | గణం | నామాక్షరము | యోని | నాడీ | రజ్జు | వేధానక్షత్రం | స్త్రీ/పు/నపుం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చిత్త | 3,4 | తుల | శుక్రుడు | రాక్షస | రా, రి | పులి | మధ్య | శిరో | ధని, మృగ | స్త్రీ |
| స్వాతి | 1,2,3,4 | తుల | శుక్ర | దేవ | రూ, రే, రో, తా | మహిషం | అంత్య | కంఠ | రోహిణి | స్త్రీ |
| విశాఖ | 1,2,3 | తుల | శుక్ర | రాక్షస | తీ, తీ, తే | పులి | అంత్య | ఉదర | కృత్తిక | స్త్రీ |
| విశాఖ | 4 | వృశ్చికం | కుజ | రాక్షస | తో | పులి | అంత్య | ఉదర | కృత్తిక | స్త్రీ |
| అనూరాధ | 1,2,3,4 | వృశ్చికం | కుజ | దేవ | నా,నీ, నూ, నే | లేడి | మధ్య | కటి | భరణి | పుం |
| జ్యేష్ఠ | 1,2,3,4, | వృశ్చికం | కుజ | రాక్షస | నో,యా,యి,యూ | లేడి | ఆది | పాద | అశ్విని | స్త్రీ |
| మూల | 1,2,3,4 | ధనుః | గురువు | రాక్షస | యే,యో,బా,బి | కుక్క | ఆది | పాద | ఆశ్లేష | నపుం |
| పూ.షా. | 1,2,3,4 | ధనుః | గురువు | మనుష్య | బూ,ధా,భా,ఢా | కోతి | మధ్య | కట | పుష్యమి | స్త్రీ |
| ఉ.షా. | 1, | ధనుః | గురువు | మనుష్య | బే | ముంగిస | అంత్య | ఉదర | పునర్వసు | స్త్రీ |
| ఉ.షా. | 2,3,4 | మకరం | శని | మనుష్య | బో, జా, జి | ముంగిస | అంత్య | ఉదర | పునర్వసు | స్త్రీ |
| శ్రవణం | 1,2,3,4 | మకరం | శని | దేవ | జూ,జే, జో, ఖా | కోతి | అంత్య | కంఠ | ఆర్ద్ర | స్త్రీ |
| ధనిష్ఠ | 1,2 | మకరం | శని | రాక్షస | గా,గీ | సింహం | మధ్య | శిరో | చిత్త, మృగ | స్త్రీ |
| ధనిష్ఠ | 3,4 | కుంభం | శని | రాక్షస | గూ, గే | సింహం | మధ్య | శిరో | చిత్త, మృగ | స్త్రీ |
| శతభిషం | 1,2,3,4 | కుంభం | శని | రాక్షస | గో, సా, సీ, సు | గుర్రం | ఆది | కంఠ | హస్త | పుం |
| పూ.భా. | 1,2,3 | కుంభం | శని | మనుష్య | సే, సో, దా | సింహం | ఆది | ఉదర | ఉత్తర | స్త్రీ |
| పూ.భా. | 4 | మీనం | గురువు | మనుష్య | ది | సింహం | ఆది | ఉదర | ఉత్తర | స్త్రీ |
| ఉ.భా. | 1,2,3,4 | మీనం | గురువు | మనుష్య | దు,శ,ఝా,థా | గోవు | మధ్య | కటి | పుబ్బ | పుం |
| రేవతి | 1,2,3,4 | మీనం | గురువు | దేవ | దే,దో,చా,చి | ఏనుగు | అంత్య | పాద | మఘ | పుం |

**కృష్ణ - మృగశిర 3వ పాదం, హృష్ణ - స్వాతి 3వ పాదం, శ్రీధర-చిత్త 4, క్షేత్రపాల - హస్త 2, జ్ఞాన - ఆర్ద్ర 3,**
**భీమ, భైరవ - పూ.షా.3, ఫణి - ఉత్తర 3 ,ద్రౌపది, ద్రోణి - స్వాతి 3వ పాదం**

శ్రీరస్తు    శుభమస్తు    అవిఘ్నమస్తు

# స్వస్తి శ్రీ దుర్ముఖినామ సంవత్సర ఫలితాంశములు

## శ్రీమహాగణపతయే నమః

అస్యశ్రీ సమస్త కళ్యాణ భాజనస్య శ్రౌతస్మార్త నిత్యనైమిత్తిక కామ్యకర్మానుష్ఠాన నిదాన భూతస్య. స్వస్తిశ్రీ దుర్ముఖినామ సంవత్సరస్య సృష్ట్యాది గత సౌరాబ్దాః 195,58,85,117. కల్యాది గతాబ్దాః 5117, విక్రమార్కాబాః 2073, శాలివాహన శకాబ్దాః 1938, ఫసలీ 1423-24 హిజరీస్ కాబ్దాః 1936-37, శంకరాచార్యాబ్దాః 900 ఆంగ్ల క్రీస్తు శకాబ్దాః 2016-17, భారతదేశ స్వాతంత్ర్యాబ్దాః 69, జూలియన్ దిన సంఖ్య 2457487.

## అబ్దత్రయ ఫలం నిరూప్యతే

### చాంద్ర సౌరమానాభ్యాం "దుర్ముఖి" నామ సంవత్సర ఫలమ్

**శ్లో.** దుర్ముఖాబ్దేతు రోగాస్స్యుః ప్రచురానంత భీతయః।
రాజానస్స్యుః ప్రజాతుష్టా నిత్యంస్యుర్ద్విజ సత్తమాః॥

**టీక :** దుర్ముఖాబ్దేః = దుర్ముఖినామ సంవత్సరమునందు, రోగాః = రోగములు, స్స్యుః = కలుగుచున్నవి. అనంత భీతయః = అనేక భయములు, ప్రచారాః = విస్తారముగా నుండును, రాజానః = రాజులు, ప్రజాః = ప్రజలు, తుష్టాః = సంతోషముగా ఉన్నవారు, స్స్యుః = అగుచున్నారు, ద్విజసత్తమాః = బ్రాహ్మణ శ్రేష్ఠులు, యోగ్యాః = యోగ్యులు, స్స్యుః = అగుచున్నారు.

**తా॥** దుర్ముఖినామ సంవత్సర ప్రభవాదిగా 30 సం॥లు. దుర్ముఖి వత్సరమున మిక్కిలి భయము, రోగములు కలుగుతాయి. రాజులు సంతోషవంతులగుదురు. బ్రాహ్మణులు యోగ్యులుగా ఉంటారు.

చాంద్రమానాబ్దం ప్రభవాది దుర్ముఖి సంవత్సరమునకు బార్హస్పత్య మానాబ్దమగు సౌమ్య సం॥ (43) సంవత్సరమని తెలియవలెను.

### బార్హస్పత్యమానే "సౌమ్య" నామ సంవత్సర ఫలమ్

**శ్లో.** సౌమ్యాబ్దే సుఖినో లోకా బహుసస్యార్ఘ వృష్టిభిః।
వివైరిణోధరాధీశా విప్రాశ్చాధ్వర తత్పరాః ॥

బార్హస్పత్యమాన రీత్యా 15వ సంవత్సరమైన ప్రమాది నామ సంవత్సరంతో షష్ఠి వత్సర చక్రం ప్రారంభమగును. ఈ క్రమంలో ఇది 31వ సం॥. (ప్రభవాదిగా 43వ సం॥ అగును). బార్హస్పత్యమాన రీత్యా సౌమ్యాబ్దం అయినందున ప్రజలు సుఖము, అధికముగా సస్యార్ఘములు కలిగి ఉంటారు. పాలకులు వైరము లేనివారై ఉంటారు. బ్రాహ్మణులు యజ్ఞములు చేయుచుందురు.

### సర్వత్ర గురూదయ వశాత్

గురువు అస్తమించిన తరువాత తిరిగి ఉదయించినప్పుడు ఏ నక్షత్రంలో ఉదయిస్తున్నాడో ఆ నక్షత్రాన్ని అనుసరించి అబ్దము వ్రాయవలెను.

గురువు 10 అక్టోబర్ 2016 సా. 07.42 లకు హస్తా నక్షత్రం 1వ పాదంలో ఉదయిస్తున్నారు. హస్తా నక్షత్రంలో ఉదయించుటచే ఫాల్గుణాబ్దము.

## సర్వత్రా గురూదయవశాత్ ఫాల్గుణాబ్ద ఫలము :

**శ్లో.** చోశ్చ ప్రబలాస్త్రీణాం దౌర్భాగ్యం సుజనాః ఖలాః ।
క్వచిద్వృష్టిః క్వచిద్ధాన్యం క్వచిద్వృద్ధిస్తుఫాల్గునే ॥

ఫాల్గుణాబ్దమున చోరభయము, స్త్రీలకు తక్కువగా భాగ్యము ఉంటుంది. సుజనులు దుర్జనులగుదురు. ఒకానొకచోట వర్షము, ఒకానొకచోట ధాన్యాధిక్యము, ఒకానొకచోట వృద్ధి కలుగుతాయి.

## దుర్ముఖినామ సంవత్సరంలో రాజాధి నవనాయక నిర్ణయం :

1. చైత్రశుద్ధ పాడ్యమి నాటి వారాధిపతి రాజగును.
2. రవి మేష సంక్రమణం నాటి వారాధిపతి మంత్రి యగును.
3. రవి సింహ సంక్రమణం నాటి వారాధిపతి సేనాధిపతి యగును.
4. రవి కర్కాటక సంక్రమణం నాటి వారాధిపతి సస్యాధిపతి యగును.
5. రవి ధనుస్సు సంక్రమణం నాటి వారాధిపతి ధన్యాధిపతి యగును.
6. రవి మిథున సంక్రమణంనాటి వారాధిపతి అర్ఘాధిపతి యగును.
7. రవి ఆర్ద్రా నక్షత్ర ప్రవేశం చేయునాటి వారాధిపతి మేఘాధిపతి యగును.
8. రవి తులా సంక్రమణం నాటి వారాధిపతి రసాధిపతి యగును.
9. రవి మకర సంక్రమణ నాటి వారాధిపతి నీరసాధిపతి యగును.

**రాజు :** చైత్రశుద్ధ పాడ్యమి నాటి వారాధిపతి రాజగును. 8 ఏప్రిల్ 2016, శుక్రవారం దుర్ముఖినామ సంవత్సరమ్ చైత్ర శుద్ధ పాడ్యమి మ. 01:06 శుక్రవారం అగుటచే రాజు శుక్రుడయినాడు.

## రాజా శుక్రఫలం

**శ్లో॥** సమృద్ధ సస్యా వసుధా సువృష్టిః గావోహి
సంపూర్ణ పయోధరాశ్చ ।
ప్రియాః ప్రియాణాం జనయంతి తోషం
కామోపచారైర్భృగుజేబ్దనాథే ॥

**తా॥** శుక్రుడు రాజగుటచే భూమి సస్యయుతంబగును. మంచి వర్షము కలుగును. గోవులు పాలు అధికముగానిచ్చును. (సుఖ సంతోషముగా ఉండును) భార్యాభర్తలు అనురాగంతో జీవిస్తారు.

**మంత్రి :** రవి మేష సంక్రమణం నాటి వారాధిపతి మంత్రి యగును. 13.4.2016, బుధవారము సా. 7.47 ని॥లకు రవి మేష సంక్రమణం చేయును.

## మంత్రి బుధ ఫలం

**శ్లో :** వాయునా పీడితా మేఘా స్సర్వే పాపరతా నరాః
సోమపుత్రస్యమంత్రిత్వే జాయాతేమధ్యమంఫలమ్ ॥

**తా॥** బుధుడు మంత్రి అయినచో మేఘములు వాయువులతో గూడి ఉండును. ప్రజలు పాప కర్మలయందు ఆసక్తి కలవారగుదురు. ఫలితములు అన్నియు మధ్యమముగా ఉండును.

**సేనాధిపతి :** రవి సింహ సంక్రమణం నాటి వారాధిపతి సేనాధిపతి యగును. 16.8.2016, మంగళవారం, సా. 6.40 ని॥లకు సింహ సంక్రమణం చేయును.

(సేనా, ధాన్య, అర్ఘ, మేఘ, రసాధిపతులు ఈ ఐదుగురి విషయంలో రవి సంక్రమణ రాత్రి అయితే, రాత్రి భాగాన్ని మూడు భాగాలు చేసి మొదటి 2 భాగాలు పూర్వ దినంగాను మూడవ భాగం పరదినంగా నిర్ణయించి అప్పుడు వారాధిపతిని నిర్ణయించవలెను.)

## సేనాధిపతి కుజఫలం

**శ్లో :** ఆంతక పీడా భువి సన్యనాశః లోకాస్సమస్తా జ్వరితా భవంతి ।
అత్యంత యుద్ధం క్షితిపాల కానాం కుజేచ సేనాధి పతౌధరిత్ర్యామ్

కుజుడు సేనాధిపతియైన ప్రజలు జ్వరపీడలతోపాటు అనేక రోగములు వచ్చును. పంటలు తక్కువగా పండును. రాజులకు పరస్పరం యుద్ధ భయములు కలుగుచుండును.

**4. సస్యాధిపతి :** రవి కర్కాటక సంక్రమణం నాటి వారాధిపతి సస్యాధిపతి యగును. 16.7.2016 శనివారము ఉ. 10:14 ని॥లకు రవి కర్కాటక సంక్రమణం చేయును.

## సస్యాధిపతి శని ఫలం :

**శ్లో :** తిలమాషకులుత్థాది కృష్ణధాన్యానియానిచ ।
కృష్ణ భూమిస్సు ఫలినీ శనౌసస్యాధిపేసతి ॥

**తా॥** శని సస్యాధిపతి యైన యెడల నువ్వులు, మినుములు, ఉలవలు, మొదలగు నల్లని ధాన్యములు బాగా పండును. నల్లని నేల ఫలవంతమగును.

**5. ధాన్యాధిపతి :** రవి ధనుస్సంక్రమణం నాటి వారాధిపతి ధాన్యాధిపతి. 15.12.2016 గురువారం రా. 08:54 ని॥లకు రవి ధనుస్సంక్రమణం చేయును.

15.12.2016 = సూర్యాస్తమయం : 17:41.

16.12.2016 = సూర్యోదయం : 6:43

రాత్రికాలం : (17:41 – 6:43) – 24 = 13:02 ని॥

రాత్రిభాగాన్ని 3 భాగాలు చేయాలి.

13:02/3 = 4:20:40

మొదటి రెండు భాగాలు = (4 : 20 : 40) × 2 = 8:41:20

17:41+8:41:20=26:22 :20 అంటే తె॥ 2:22:20

రవి సంక్రమణం = 20:54 మొదటి 2 భాగాలలోనే ఉన్నది కాబట్టి ఆ వారాధిపతియే ధాన్యాధిపతి అగును.

## ధాన్యాధిపతి గురుఫలం

**శ్లో.** సువృష్టిస్సర్వ దేశానాం సర్వ సస్యసమృద్ధయః ।
భవంతిగావస్సుదుఘా గురౌధాన్యాదిపేసతి ॥

**తా॥** గురువు ధాన్యాధిపతియైన అన్ని దేశముల యందు పంటలు సమృద్ధిగా పండును. బాగా వర్షములు కురియును. గోవులు పాలిచ్చును.

**6. అర్ఘాధిపతి :** రవి మిథున సంక్రమణం నాటి వారాధిపతి అర్ఘాధిపతి అగును. 14.6.2016 మంగళవారం, 23:20 ని॥లకు రవి మిథున సంక్రమణం చేయును.

| | | |
|---|---|---|
| 14.06.2016 | = | సూర్యాస్తమయం : సా. 6:48. |
| 15.06.2016 | = | సూర్యోదయం : ఉ. 5:46 |
| | = | (18:48 – 5:46) – 24 |
| | = | 10 గం॥ల 58 నిమిషాలు |
| = 10 గం॥ 58 ని॥/3 | = | 3గం॥ 39ని॥ 20 సె॥లు |
| 2 భాగాలు | = | 3గం॥ 39ని॥ 20సె॥లు |
| | | × 2 = 7 గం॥18ని॥40సె॥లు |
| | = | 18:48 + 7:18:40 |
| | = | తె. 2:6:40 = 26:6:40 |
| రవి సంక్రమణ | = | 23:20, 2 భాగాలలోపే ఉంది. కనుక అర్ఘాధిపతి కుజుడు అయినారు. |

## అర్ఘాధిపతి కుజఫలం

**శ్లో॥** భౌమే చార్ఘపతౌ స్వల్ప వృష్టిర్వాయు సమన్వితా ।
క్వచిద్వృష్టిః క్వచిద్ధాన్యం ప్రజారోగ్యం క్వచిత్క్వచిత్ ॥

కుజుడు అర్ఘాధిపతియైన వాయువులతో కూడిన వర్షములు అక్కడక్కడ కురియును. ధాన్యము జనక్షేమంబు నచ్చటచ్చట నగును.

**7. మేఘాధిపతి :** రవి ఆర్ద్ర నక్షత్ర ప్రవేశం చేయు వారాధిపతి మేఘాధిపతి అగును.

21.6.2016 మంగళవారం రా. 11.00 లకు రవి ఆర్ద్ర నక్షత్ర ప్రవేశం చేయును.

21.6.2016 న సూర్యాస్తమయం సా. 6:49

22.6.2016న సూర్యోదయం : ఉ. 5:47

(18:49 – 5:47) –24 = 10 గం॥ 58 ని॥ల /3 = 3 గం॥ల 39 ని॥ల 20 సె॥లు

3 గం॥ 39 ని॥ల × 2 = 7 గం॥ల 18 ని॥ల 40 సె॥లు.

18:49+ 7:18:40 = 26:7:40 = తె॥ 2:7:40.

2 భాగాల లోపే ఉంది కనుక మేఘాధిపతి కుజుడు అయ్యారు.

## మేఘాధిపతి కుజఫలం

**శ్లో.** మహావాయు రనర్ఘంచ స్వల్పవర్షం తథాభువి ।
రక్తసస్యా నిజాయంతే భౌమే మేఘాధిపేసతి ॥

**తా॥** కుజుడు మేఘాధిపతియైన గాలులు అధికముగా వీస్తాయి. ధరలు తగ్గుతాయి. వర్షములు తక్కువగా కురుస్తాయి. ఎర్రని ధాన్యములు బాగా పండుతాయి.

**8. రసాధిపతి :** రవి తులా సంక్రమణం చేయు వారాధిపతి రసాధిపతి యగును.

17.10.2016 సోమవారం ఉ. 6:31 ని॥లకు రవి తులా సంక్రమణ చేయును.

## రసాధిపతి చంద్రఫలం

**శ్లో.** తిలతైల గుడ క్షౌద్రవయాంసి దధి శర్కరాః ।
అర్ఘవృద్ధిస్సదారోగ్యం చంద్రేయది రసాధిపే ॥

**తా॥** చంద్రుడు రసాధిపతియైన యెడల నువ్వులు, నూనె, బెల్లము, తేనె, పాలు, పెరుగు, చక్కెర మొదలగు రస వస్తువులకు ధరలు పెరుగును. ప్రజలు ఆరోగ్యవంతులుగా ఉందురు.

**9. నీరసాధిపతి :** రవి మకర సంక్రమణం. నాటి వారాధిపతి నీరసాధిపతి యగును.

14.1.2017 : శనివారం ఉ. 7:38 ని॥లకు రవి మకర సంక్రమణం చేయును.

## నీరసాధిపతి శని ఫలమ్

**శ్లో.** శృంగాశ్వవలలం దారు లోహసాత్రాణియాచిచ ।
అనఘన్ంయాంతి సర్వత్ర శనౌనీరస నాయకే ॥

**తా॥** శని నీరసాధిపతి అయినచో కొమ్ము, రాయి, మాంసము, కర్రపాత్రలు, లోహ పాత్రలు, అంతట ధరలు తగ్గియుండును.

**ఉపనాయక నిర్ణయం :**

**1. పురోహితుడు :** వృషభ సంక్రమణ వారాధిపతి.

14.05.2016 శనివారం సా. 4:41 : శని

2. **పరీక్షకుడు :** కన్యా సంక్రమణ వారాధిపతి
16.9.2016 శుక్రవారం సా. 6:35 : శుక్రుడు

3. **గణకుడు :** కుంభ సంక్రమణ వారాధిపతి
12.2.2017 ఆదివారం రా. 8:38 : రవి

4. **గ్రామ పాలకుడు :** వృశ్చిక సంక్రమణ వారాధిపతి
16.1.2016 బుధవారం ఉ. 6:17 : బుధుడు.

5. **దైవజ్ఞుడు :** మీన సంక్రమణ వారాధిపతి.
14.3.2017 మంగళవారం సా. 5:32 : కుజుడు

6. **రాష్ట్రాధిపతి :** పాడ్యమి ప్రవేశించు వారాధిపతి
8.4.2016, శుక్రవారం, పాడ్యమి మ. 1:06 : శుక్రుడు

7. **సర్వదేవ్యోగపతి :** మేష సంక్రమణ వారాధిపతి
13.4.2016 బుధవారం సా. 7:47 : బుధుడు

8. **గజపతి, అటవీపతి :** వృషభ సంక్రమణ వారాధిపతి
14.5.2016 శనివారం సా. 4:41 : శని

9. **పశువులకధిపతి :** మిథున సంక్రమణ వారాధిపతి
14.6.2016 మంగళవారం రా. 11:20 : కుజుడు

10. **దేవాధిపతి :** కర్కాటక సంక్రమణ వారాధిపతి.
16.7.2016 శనివారం ఉ. 10:14 : శని

11. **పురుషాధిపతి :** సింహ సంక్రమణ వారాధిపతి
16.8.2016 మంగళవారం సా. 6:40 : కుజుడు

12. **గ్రామాధిపతి :** కన్యా సంక్రమణ వారాధిపతి.
16.9.2016 మంగళవారం సా. 6:35 : కుజుడు

13. **వస్త్రాధిపతి :** తులా సంక్రమణ వారాధిపతి
17.10.2016 బుధవారం ఉ. 6 :17 : బుధుడు

14. **రత్నాధిపతి :** వృశ్చిక సంక్రమణ వారాధిపతి
16.1.2016 బుధవారం ఉ. 6:17 : బుధుడు

15. **వృక్షాధిపతి :** ధనుస్సు సంక్రమణ, వారాధిపతి
15.12.2016 గురువారం రా. 8:54 : గురువు

16. **జంగమాధిపతి :** మకర సంక్రమణ వారాధిపతి
14.1.2017 శనివారం ఉ. 7:38 : శని

17. **సర్వాధిపతి :** కుంభ సంక్రమణ వారాధిపతి
12.2.2017 ఆదివారం రా. 8:38 : రవి

18. **మృగాధిపతి :** మీన సంక్రమణ వారాధిపతి
14.3.2017 మంగళవారం సా. 5:32 : కుజుడు

19. **శుభాధిపతి :** పాడ్యమి ప్రవేశించు వారాధిపతి.
8.4.2016 పాడ్యమి, శుక్రవారం మ. 1:06 : శుక్రుడు

20. **స్త్రీల కధిపతి :** ఆర్ద్ర నక్షత్ర ప్రదేశ వారాధిపతి
21.6.2016 మంగళవారం, రా. 11:00 : కుజుడు

21. **అశ్వాధిపతి :** మేష సంక్రమణ వారాధిపతి
13.4.2016 బుధవారం సా. 7:47 : బుధుడు.

**ఉపనాయకులు :**

| రవి | చంద్ర | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| 2 | 1 | 6 | 4 | 1 | 3 | 4 |

## మేఘాది నిర్ణయం

(శాలి (1938) × 8) 9 = (శేషం) 6 = నీల నామకో మేఘ.

**శ్లో: నీల మేఘం నిరాలంబ మాల్పవృష్టిరనర్థతా ।**
**అశోనంచ జీవానాం నీలమేఘస్య లక్షణమ్ ॥**
**మేరోః ఆగ్నేయ దిగ్భాగే మేఘోత్పత్తిః ।**

ఈ సంవత్సరం "నీల" పేరుగల మేఘం వర్షించును.

## ఆఢకాది నిర్ణయం

9 నాయకులలో రాజును బట్టి నిర్ణయించాలి. రాజు శుక్రుడు కనుక ఆఢక : 4.

**శ్లో: అశీతి యోజనందివ్యం విస్తీర్ణంచోన్నతంశతం ।**
**ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే ॥**

**ప్రమాణం :** 9 భాగములు సముద్రంలో, 9 భాగములు పర్వతములపైన, 2 భాగములు భూమిపైన (నవభాగాస్సముద్రేషు పర్వతేషు ధానవ । ద్వౌభాగే భువిపర్జన్యస్త్యేవం వర్షతి చత్రిధా॥)

## పశునాయక నిర్ణయం : శ్రీకృష్ణుడు

**శ్లో : భాను భౌమౌ యమౌ రాజా బలభద్రో బుధేశనౌ**
**గురు భార్గవసోమశ్చ గోపాలః పశునాయకః**

**తా॥** సూర్య, కుజులు రాజులైనచో యముడు పశుపాలకుడవుతాడు. బుధ, శనులు రాజులైనచో బలరాముడు; చంద్ర, గురు, శుక్రులు రాజులైతే శ్రీకృష్ణుడు పశుపాలకులవుతారు. యముడు పశుపాలకుడైతే పశునాశనం జరుగుతుంది. బలరాముడు పశుపాలకుడైతే వానలు బావుంటాయి. గోపాలుడు పశుపాలకుడైతే గోవులు పాలిస్తాయి.

ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధ పాడ్యమి వారాధిపతి బట్టి పశునాయకుడి నిర్ణయం జరుగుతుంది.

చైత్ర శుద్ధపాడ్యమి వారాధిపతి = శుక్రుడు = పశునాయకో గోపాలః

**శ్లో: పశు వృద్ధిస్సు భిక్షంచ బహూ సస్యాఘుర్ సంపదః**
**సంపూర్ణ తృణ వృద్ధిస్స్యాద్గోపాలే పశునాయకే.**

శుక్రరూపండగు గోపాలుడు పశునాయకుండైనచో పశువృద్ధి, సుభిక్షం, సస్యాఘన్ సంపత్తు, తృణవృద్ధి కలుగును.

## పుష్కర నిర్ణయం

**పుష్కరాలు :** 11.8.2016 రా. 9:27:37 సె॥ల నుండి 12.9.2017 ఉ. 6:51:07 సె॥ల వరకు 11.8.2016, రా. 9:27:37 లకు గురువు కన్యా సంక్రమణం.

గురువారం కన్యారాశి యందు ప్రవేశించుటచే కృష్ణా పుష్కరాలు ప్రారంభమవుతాయి.

## శ్రీ దుర్ముఖినామ సంవత్సరంలో మౌఢ్యమి, కర్తరి వివరాలు

| | |
|---|---|
| **శుక్ర మౌఢ్యమి :** | 30/4/2016 మ. 3 :44 ని॥ల నుండి 13/7/2016 మ. 1:39 వరకు. |
| **గురు మౌఢ్యమి :** | 12/9/2016 తె. 1:38 నుండి 10/10/2016 సా. 7:43 వరకు. |
| **శుక్ర మౌఢ్యమి :** | 20/3/2017 సా. 4:58 ల నుండి 30/3/2017 మ. 3:50 వరకు. |

**కర్తరి :** రవి భరణి 3వ పాదం ప్రవేశ సమయం, వాస్తు కర్తరి ప్రారంభం.

రవి రోహిణి - 2వ పాదం ప్రవేశ సమయం. వాస్తు కర్తరి పరిసమాప్తమగును.

**వాస్తు కర్తరి ప్రారంభం.**

రవి భరణి 3వ పాద ప్రవేశం : 04/05/2016 ఉ. 8:31 ని॥లకు

**వాస్తు కర్తరి పరి సమాప్త సమయం :** రవి రోహిణి 2వ పాదం ప్రవేశం: 28/05/2016 మ. 1:28:07 ని॥ లకు.

### రవి ఆరుద్ర నక్షత్ర ప్రవేశము

మంగళవారము 21/6/2016 రా 11:00:29 సె॥లకు రవి ఆరుద్ర నక్షత్ర ప్రవేశము చేయును.

**తిథి :** బహుళ విదియ : పంటలు వృద్ధి

**వారం :** మంగళవారము : వర్షముండదు (అనావృష్టి)

**నక్షత్రం :** పూర్వాషాఢ : వర్షము (సువృష్టి)

**యోగం :** బ్రహ్మ, వినాశనము (వర్షము లేమి)

**కరణం :** తైతుల : శుభము (సువృష్టి)

**లగ్నం :** కుంభం : వృష్టి స్వల్పము.

**పగలు, రాత్రి ఫలం :** రాత్రి : సస్యాభివృద్ధి

**పగటి కాల భేద ఫలం :** సస్య సంపద.

## అంతరిక్షంలో ఏర్పడు గ్రహణములు

**మొత్తం గ్రహణాలు : 3 చంద్ర, 2 సూర్య.**

**అందులో 2, చంద్ర గ్రహణాలు కనబడతాయి.**

**మనప్రాంతంలో కనపడే గ్రహణాలు:**

1. **ప్రచ్ఛాయ చంద్రగ్రహణం :** శనివారం 16/17-9-2016 నాడు రా. 12:25 లకు గ్రహణ మధ్యకాలం అగును. ఈ గ్రహణం చాలా తక్కువగా కనబడుతుంది.
2. **ప్రచ్ఛాయ చంద్రగ్రహణం :** శనివారం 11.2.2017 నాడు ఉ. 6:14 నిమిషములకు గ్రహణ మధ్యకాలం అగును. ఈ గ్రహణం చాలా తక్కువగా కనబడుతుంది.

**మనప్రాంతంలో కనపడని గ్రహణాలు:**

1. **ప్రచ్ఛాయ చంద్రగ్రహణం :** గురువారం 18.8.2016 నాడు మ. 3:13లకు గ్రహణ మధ్యకాలం అగును. ఈ గ్రహణం మన ప్రాంతంలో కనపడదు.
2. **కంకణాకార సూర్యగ్రహణం :** గురువారం 1.9.2016 నాడు మ. 2:38: 55 లకు గ్రహణ మధ్యకాలం అగును. దక్షిణార్ధ గోళంలో ఈ గ్రహణం ఏర్పడటం వల్ల ఇది మన ప్రాంతానికి కనపడదు.
3. **కంకణాకార సూర్యగ్రహణం :** ఆదివారం 26.2.2017 నాడు రా. 8:24:46 లకు గ్రహణ మధ్యకాలం అగును. ఈ గ్రహణం మన ప్రాంతానికి కనపడదు.

## గ్రహణ సాధన

1. 17/Sep/2016 న చంద్ర గ్రహణ గణిత సాధన:

**Opposition in R.A**

**Sep $17^d$ $00^h$ $32^m$ $46^s$**

| | Sun | Moon |
|---|---|---|
| Right Ascension (α) | $11^h39^m$ $12\text{-}69^S$ | $23^h$ $40^m$ $43.96^s$ |
| Hourly Motion | $8.96^s$ | $139.52^s$ |
| Declination (δ) | 2°14'54.6" | - 3° 14' 12.63" |
| Hourly Motion | 57.94" | 687 : 09" |
| Equitorial Horizontal Parallax | 8".75 | 1.001 905 60'6.86" |
| True Semi Diameter | 16'1" | 16' 22.51" |

H.M. of Moon's R.A = $00^h$ $32^m$ $46^s$

= $23^h$ $40^m43.96^s$

$1^h32^m46^s$ = $23^h43^m3.48^s$

= $2^m19.52" = 139.52^s$

**H.M. of Moon's Dec.**

$00^h$ $32^m46^s$ = – 3°14'12.63

$01^h$ $32^m46^s$ = – (–3°2' 45.54)

= 11'270.9[11] = $687.09^s$

**H.M. of SUN R.A**

$00^h$ $32^m46^s$ = $11^h39^m12.6.9^s$

$01^h32^m46^s$ = $11^h39^m$ $21.65^s$

$8.96^s$

**H.M. of SUN Dec.**

$00^h$ $32^m46^s$ = 2°14'54.6"

$01^h$ $32^m46^s$ = 2°13'5.6.66"

– 0°1'57.94"

$T_{opp}$ = Sep 17 $00^h32^m46^s$

$T_o$ = Sep 17 $00^h32^m$

$\Delta t = T_0 - T_0$

$= 00^h\ 32^m - 00^h\ 32^m\ 46^s$

$= -46^s = -0^h.0127777778$

**Position of Moon at $T_o$ :**

$\alpha = \alpha_{opp} + \Delta\alpha . \Delta t$

$= 23^h40^m43.96^s + (139.52^s \times - 0.0127777778)$

$= 23^h40^m42.18^s$

$\delta = \delta_{opp} + \Delta\delta . \Delta t$

$= - 3°14'12.63'' + (687.09^s \times - 46^s)$

$= - 3° 14'21.41''$

**Position of Sun at $T_o$:**

(R . A) $\alpha_{sum} = \alpha_{opp} + \Delta\alpha . \Delta T$

$= 11^h39^m12.69^s + (8.96^s \times - 46^s)$

$= 11^h 39^m 12.58^s$

(Dec) $\delta = \delta_{opp} + \Delta\alpha . \Delta T$

$= 2°14' 54.6'' + (- 57.94^s \times - 46^s)$

$= 2° 14' 55.34''$

**Position of shadow at $T_o$**

$\alpha'' = \alpha_{sun} + 12^h = 11^h 39^m 12.58^s + 12^h$

$= 23^h 39^m 12.58^s$

$\delta' = S_{sun} = - 2°4'55.34''$

| **Moon** | **Sun** |
|---|---|
| $\pi$ (Ehp) = 3606''.86 | $\pi' = 8''.75$ |
| S (S.D.) = 982''.51 | $S' = 961''$ |

$\pi_1 = 0.998333 \times \pi = 0.998333 \times 3606''.86$

$= 1°0' 0.85''$

$= 3600.85''$

**Radius of shadow cone, at Moon's distance**

For Umbra $= 1.02 (\pi_1 + \pi' - S')$

$= 1.02 (3600 - 85'' + 8.75'' - 961'')$

$= 2701''. 572$

For Penumbra $= 1.02 (\pi_1 + \pi' - S')$

$= 4662''.012$

**Angle L between center of Moon and the axis of shadow cone.**

**i) For umbral eclipse :**

$L_1 = 1.02 (\pi_1 + \pi' - S')$ (for 1st contact)

$= 2701''.572 + 982''.51$

$= 3684''.082$

$L_2 = 1.02 (\pi_1 + \pi' - S') - S$ (for 2nd contact)

$= 2701''.572 - 982''.51$

$= 1719''.062$

**ii) For penumbral eclipse :**

$L' = 1.02 (\pi_1 + \pi' + S') + S$

$= 4662''.012 + 982''.51$

$= 5644''.522$

**Besselian Elements :**

X = $(\alpha - \alpha')$ Cos $\delta$

= $(23^h\ 40^m\ 42.18^s - 23^h 39^m\ 12.58^s) \times$ cos $(-3°14'21.41'')$

= $1^m\ 9.46^s$

= 22' 21.85"

Y = $(\delta - \delta')$

= $-3°14'\ 21.41'' - (-2°14'\ .\ 55.34'')$

= $-0°59'\ 26.07''$

= –3566".07

X' = Hourly Motion of $(\alpha - \delta')$ cos $\delta$

= (2092".8 – 134".4 ) × Cos (–3°14'21.41")

= 19.55" 270985/h

Y' = Hourly Motion of $(\delta - \delta')$

= 687.09 – (+ 57.94)

– 629".15

$m^2$ = $x^2 + y^2$

= $1341''.85^2 + (-3566''.07)^2$

m = 3810".172787

$n^2$ = $x^{12} + y^{12}$

= $1955.270985^2 + 629.15''$

n = 2053.999598

M = $\tan^{-1}$ (x/y)

**Time of Middle of eclipse :**

$$-\left(\left(xx'+yy'\right)/n^2\right)$$

$T_O$ = 2623680.371 – 2243592.941

$$T_O = \frac{380087.43}{(2053.999598)^2}$$

= 0°5'24.33"

= To – 0°5'24.33"

= $00^4 32^m 46^s - 5'24.33''$

Middle of Eclipse = $0^h 27^m 21.67^s$

sin $\psi$ = $(xy' - x'y)/nL'$

$$= \frac{(1341.85 \times 629.15) + (1955.270995 \times -3566.07)}{2053.999598 \times 5644.521}$$

$$= \frac{844224.9295 + 6972633.201}{11593843.86}$$

= 0.6742248925

$\psi$ = 42° 23'38.36"

For begining 180 – 42° 23' 38.36"

$$\left(\frac{L^1}{n}\right) \text{Cos}\psi = \frac{56445.22}{2053.009598} \times \cos(1370 \times 36'21.64'')$$

= – $2^h 1^m 46.26''$

= $00^h\ 27^m 21.67^s$ – $2^h\ 1^m 46.26^s$

Begining of Penumbra = $22^h 25^m 35.41^s$

End of Penumbra= $00^h 27^m 21.67^s + 2^h 1^m\ 46.26^s$

= $26^h\ 29^m\ +.93^h$

M = $\tan^{-1}(x/y)$

$$= \tan^{-1}\left[\frac{0°21'21.85''}{-0°59'26.07''}\right]$$

= 159.3795558

N = $\tan^{-1}(x^1/y^1)$ = 72°.1633171

M – N = 87.216 2387

$\Delta$ = M sin (M – N)

= 3810''.172787 × 0.9988199422

= 3805. 676563

$$= (L_1 - \Delta)/2S = \frac{3684.082 - 3805.676563}{2 \times 982.51}$$

Umbra Magnitude = 0.061879

= 3810''.172787 × sin (87.2162387)

<u>Results:</u>

Penumbral Magnitude = 0.935789

Penumbra Eclipse start = Sep 16, $22^h 25^m 35.41^s$

Middle = Sep 17, $00^h 27^m 21.67^s$

Penumbra Eclipse End = Sep. 17, $02^h\ 29^m\ 7.93^s$

2. 11/Feb/2017 న చంద్ర గ్రహణ గణిత సాధన:

**Opposition in RA**

Feb 11 $06^h\ 03^m\ 17^s$

| | Sun | | Moon |
|---|---|---|---|
| RA | $21^h 39^m 19.42^s$ | = | $9^h 37^m 55.63^s$ |
| HM | $9.35^s$ | = | 2'16.66'' = $136.66^s$ |
| Dec | – 14° 1' 6.24'' | = | 13°4'48.65'' |
| HM | $49.33^s$ | = | – 8'10.28'' |
| E.H.P. | 8''.90 | = | 0.968308 |
| | | = | 58'5.91'' |
| T.S.D. | 16''10'' | = | 15'49.86'' |
| H.M of Moon's RA | | = | $06^h 03^m 17^s$ |
| | | = | $9^h 37^m 55.63^s$ |
| $7^h 3^m 17^s$ | = | = | $9^h 40^m 12.29^s$ |
| H.M of Moon's Dec | | = | 13°4'48.65'' |
| | | = | 12°56' 38.37'' |

H.M. of Sun's RA = $21^h 39^m\ 19.42^s$

$7^h 3^m 17^s$ = $21^h 39^m 29.27^s$

H.M. of Sun's Dec = $-\ 14°\ 1'\ 6.24''$

$7^h 3^m 17^s$ = $-\ 14° 0' 16.91''$

$T_{opp}$ = Feb $11^d\ 6^h 4^m 17^s$

$T_o$ = Feb $11^d 6^h 4^m$

$\Delta t = \Delta T_0 - T_{opp} = 6^h 4^m - 6^h 3^m 17^s = 43^s$

$= 0^h.01194444444$

**Position of Moon at $T_o$ :**

$\alpha = \alpha_{opp} + \Delta\alpha + \Delta t$

$= 9^h 37^m 55.63^s + (136.66^{s/h} \times 0''.01194444444)$

$= 9^h 37^m 57.26^s$

$\delta = 13°\ 4'\ 48.65'' + (-\ 8'\ 10.28'' \times 0^h.01194444444)$

$13° 4'\ 42.79''$

**Position of Sun at $T_o$ :**

$\alpha_{sun} = \alpha_{opp} + \Delta\alpha.\ \Delta t$

$= 21^h\ 39^m 19.42^s + (9.85^s \times 0^h.01194444444)$

$= 21^h 39^m 19.54^s$

$\delta_{sun} = -\ 14°\ 1'\ 6.24'' + (49.33^s \times 0^h.\ 01194444444)$

$= -\ 14° 1'\ 5.65''$

**Position of Shadow at $T_o$:**

$\alpha' = \alpha_{sun} + 12^h$

$= 21^h\ 39^m 19.42^s + 12^h$

$= (33^h\ 39^m\ 19.42^s) - 24$

$= 9^h 39^m\ 19.42^s$

$\delta' = -\ \delta$ sun $= 14° 1' 6.24''$

| **Moon** | **Sun** |
|---|---|
| $\pi = 3485''.91$ | $\pi' = 8''.9$ |
| $s = 949''.86$ | $s' = 970''$ |

$\pi_1 = 0.998333\pi = 0.998333 \times 3485.91$

$= 3480.\ 098988$

**Radius of shadow cone at Moon's distance :**

For umbra $-\ 1.02\ (\pi_1 + \pi' - s')$

$= 1.02\ (3480.098988 + 8.9 - 970)$

$= 2569.378968$

For Penumbra $= 1.02\ (\pi_1 + \pi' + s')$

Angle 'L' between the center of Moon and the axis of shadow cone.

i) For umbral eclipse

$L_1 = 1.02\ (\pi_1 + \pi' - s') + s$

$= 2569.\ 378968 + 949.86$

$= 3519.\ 238968$

$L_2 = 1.02\ (\pi_1 + \pi' - s') - s$

$= 1619.518968$

ii) For Penumbral eclipse

$L' = 1.02\,(\pi_1 + \pi' + s') + s$

$= 4548.178968 + 949.86$

$= 5498.038968$

Besselian Elements :

$x = (\alpha - \alpha')\ \text{Cos}\ \delta$

$= (9^h\,37^m\,57.26^s - 9^h 39^m\,19.42^s) \times (13°4'42.79'')$

$y = \delta - \delta'$

$= 13°4'\,42.79'' - 14°1'6.24'' = -\,0°56'23.45''$

$= -\,3383''45$

$x'$ = hourly motion of $(\alpha - \alpha')\cos\delta$

$= (2049.9 - 147.75)\cos(13°4'48.65'')$

$= 1852.797408$

$y'$ = hourly motion of $(\delta - \delta')$

$= (\delta' - \delta)$

$= 490''.28 + 49''.33 \quad = -\,4.40''.\,95$

$m^2 = x^2 + y^2 \quad = (1200.45)^2 + (3383.45)^2$

$m = 3590''.\,099456$

$n^2 = x^{12} + y^{12}$

$= (1852.797408)^2 + (440.95)^2$

**Middle of Eclipse :**

$T_0 \quad -((xx' + yy')/n^2)$

$$\frac{(-2191\ \ 778.498 + 1491932.278)}{n^2}$$

$= -\,0°\,11'\,34.58''$

$= 6^h04^m + 11^m34.58^s$

$= 6^h15^m\,34.58^s$

$M = \tan^{-1}\left[\frac{x}{y}\right]$

$\left[\frac{0°20'0.45''}{0°56'23.45''}\right]$ $\frac{\cos(M - N)}{n}$

$= \tan^{-1}$

$= 19°.53471422$

$N = \tan^{-1}[x'/y'] \quad = -\,76.613\,1283$

$T_0 -$ in

$= 6^h\,4^m + 12'\,6.75''$

$= 6^h\,16^m\,6.75''$

For first & last Panumbral contact

$$\sin\psi = (xy' - x'y) / nL'$$

=

$$= \frac{529338.4275 + 6268847.39}{10471267.65}$$

$$= \sin^{-1} (0^h\, 38^m 57.2^s)$$

$$\psi = 40.48303075$$

$$\text{Time of begining} = 6^h\, 15^m 34.58^s - \left(\frac{L'}{n}\right) \cos\psi$$

$$= 6^h 15^m\, 34.53^s =$$

$$\times \cos(40.48303075)$$

$$= 6^h 15^m 34.58^s - 2^h 11^m 44.5^s$$

$$= 4^h\, 3^m\, 50.08^s$$

$$\text{Time of ending} = 6^h 15^m 34.58^s + 2^h 11^m 44.8^s$$

$$= 8^h 27^m 19.08^s$$

$$\Delta = m \sin(M - N)$$

$$= 3569.452313$$

Magnitude : $(L_1 - \Delta)/2s$ $\quad L_1 - \Delta / 2s$

$$= \frac{-50.21334491}{2 \times 949.86}$$

<u>Results:</u>

Umbra Magnitude = – 0.02643197151

Penumbral Magnitude = 1.015195216

Start = $4^h 3^m 50.08^s$

Middle = $6^h 15^m 34.58^s$

End = $8^h 27^m 19.08^s$

$$\frac{(1200.45 \times 440.95) - (1852.7974 \times 3383.45)}{1904.545914}$$

$$\frac{5498.038968}{1904.545914 \times 5498.038968}$$

<u>Note:</u> All Calculations are calculated manually by Sankaramanchi Shiva Sai Srinivas M.tech(Embedded Systems),M.A.Astrology.

The Lunar Eclipse Calculated from Above method is in good agreement(i.e. within + or - 1 minute accuracy) with the Start,Middle and End times of Eclipse given by NASA. we can also get the exact NASA values by generating loops for the time of opposition (To) calculation in computer programming.

## చంద్రగ్రహణము : గ్రహణ గోచారము

ప్రచ్ఛాయ(Penumbral) చంద్రగ్రహణము . 16/17 సెప్టెంబర్ 2016 శ్రీ దుర్ముఖినామ సంవత్సరం భాద్రపద శుద్ధ పౌర్ణమి శనివారము. పూర్వాభాద్ర నక్షత్రయుక్త కుంభరాశి యందు కేతుగ్రస్త చంద్రగ్రహణం.

| | | |
|---|---|---|
| గ్రహణారంభ కాలం | = | రా. 10.24 (16/9/2016) |
| గ్రహణ మధ్యకాలం | = | తె. 12.25 (17/9/2016) |
| గ్రహణ అంత్యకాలం | = | తె. 02.25 (17/9/2016) |

ఈ రోజున చంద్రుడు భూమి యొక్క కీనీడ (Penumbra) మీదుగా వెళతాడు. కాబట్టి చంద్రుడు స్వల్పంగా మసకబారినట్లు కనబడతాడు. అంబ్రామాగ్నిట్యూడ్= – 0.067 పెనంబ్రామాగ్నిట్యూడ్ = 0.925. చంద్రోదయం : సా. 6.46, చంద్రాస్తమయం : ఉ. 6.22 సూర్యోదయం : ఉ. 6.08. సూర్యాస్తమయం : సా. 6.13. ఇది హైదరాబాద్ ప్రాంత వాసులకి వర్తిస్తుంది. అర్ధరాత్రి గ్రహణం పట్టుతున్నందున ఎలాంటి నియమాలు అవసరం లేదు. ఆబ్దీకాదులు యథామామూలే. గ్రహణ స్నానం, పట్టుస్నానం, గ్రహణ సమయంలో జపం, విడుపు స్నానం చెయ్యాలి. రాత్రి 10.22 గంటలకు గ్రహణం ప్రారంభం అగును. అప్పటి కల్లా అరిగిపోయేటట్టుగా ఆహారం స్వీకరించాలి. గ్రహణ సమయంలో ఆహారం స్వీకరించరాదు.

## గ్రహణ గోచారం

ప్రచ్ఛాయ చంద్రగ్రహణం ప్రారంభం 16 రాత్రి గం. 10.24 ని॥ 17.9.2016 అర్ధరాత్రి గం. 12.25 ని. మధ్యకాలం. జన్మరాశి నుండి 3, 6, 10, 11 మధ్యకాలం సూర్యచంద్ర గ్రహణాలు పడితే శుభప్రదము. జన్మరాశి నుండి 2, 5, 7, 9 రాశులలో గ్రహణం సంభవిస్తే మధ్యమ ఫలితము.

జన్మరాశి నుండి 1,4,8,12 రాశులలో గ్రహణం సంభవిస్తే అధమ ఫలం (దోషం)

17.9.2016 రాత్రి పూర్వాభాద్ర నక్షత్రంలో చంద్రగ్రహణం ఏర్పడుతున్నది. గ్రహణ మధ్యకాలం మీనరాశిలో పూర్వాభాద్ర నక్షత్రం 4వ పాదంలో పడుతున్నది. మీనరాశిలో గ్రహణం ఉన్నందున పూర్వాభాద్ర 4వ పాదం వారికి దోషప్రదం.

మీనం, ధనుస్సు, సింహం, మేషరాశుల వారికి దోషం. కుంభం, వృశ్చికం, కర్కాటకం, కన్యారాశుల వారికి మధ్యమఫలం. మకరం, తుల, మిథునం. వృషభ రాశుల వారికి శుభఫలం.

2) ప్రచ్ఛాయ (Penumbral) చంద్రగ్రహణం 11.2.2017 శ్రీ దుర్ముఖి నామ సం॥ మాఘ శుద్ధ పౌర్ణమి శనివారము. ఆశ్రేషా నక్షత్ర యుక్త కర్కాటకరాశి యందు రాహుగ్రస్త చంద్రగ్రహణం.



| | | |
|---|---|---|
| ఆరంభకాలం | = | ఉ. 4.03 |
| మధ్యకాలం | = | ఉ. 6.14 |
| అంత్యకాలం | = | ఉ. 8.24 కనబడదు. |
| అంబ్రామ్యాగ్నిట్యూడ్ | = | – 0.036, |
| పెనంబ్రామాగ్నిట్యూడ్ | = | 1.008 |
| చంద్రోదయం | = | సా. 6.41 |
| చంద్రాస్తమయం | = | ఉ. 6.50 |
| సూర్యోదయం | = | ఉ. 6.48 |
| సూర్యాస్తమయం | = | సా. 6.13 |

ఈ రోజున, చంద్రుడు భూమి కీనీడ మీదుగా వెళ్లడంచేత స్వల్పంగా మసకబారినట్లు కనిపిస్తాడు. ఈ గ్రహణాన్ని హైదరాబాద్ ప్రాంత వాసులు అంత్యకాలం ముందు స్థితినే చూడగలరు.

## గ్రహణ గోచారం

ఆశ్రేషా నక్షత్రం వారు ఈ గ్రహణం చూడరాదు.

కర్కాటక, మేష, ధనుస్సు, సింహరాశి వారికి దోషప్రదం. మిథునం, మీనం, వృశ్చికం, మకరరాశుల వారికి మధ్యమ ఫలం. వృషభం, కుంభం, తుల, కన్యారాశుల వారికి శుభప్రదం.

## సంక్రాంతి పురుష లక్షణం

సూర్యుడు మకర రాశిలో ప్రవేశించిన వారం, కరణం, తిథి, పక్షం, నక్షత్రం, కాలం లగ్నాలను బట్టి మకర సంక్రాంతి పురుష లక్షణ ఫలాలు నిర్ణయిస్తారు.

14.01.2017 ఉ. 07.38. 46 సె॥లకు రవి మకర ప్రవేశం చేయును.

**వారం :** శనివారము

**కరణం :** గరజి కరణం

**తిథి :** విదియ – సస్య వృద్ధి

**పక్షం :** బహుళ – సుభిక్షం, క్షేమం, ఆరోగ్యం

**నక్షత్రం :** ఆశ్రేష – రాజ విధ్వంసం

**కాలం :** (ప్రాతః కాలం) ఉదయ కాలం – రాజ్యనాశనం.

**లగ్నం :** మకర లగ్నం – రాజులకు యుద్ధం.

శ్లో : త్రిశరం ద్విముఖం చైవ చతుర్వక్త్రం త్రినేత్రకం
లంబ కర్ణం రక్త దంతం లంబభ్రూ దీర్ఘనిశికమ్॥
అష్ట బాహుం ద్విపాదం చ వికృతం కృష్ణ వర్ణకం।
శత యోజన మౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశస్మృతం।
ఏవం రూపం సవిజ్ఞేయం సంక్రాంత్యేః పురుషన్యతు॥



**వారఫలం :** ఈ సంవత్సరం మకర సంక్రాంతి శనివారంతో ప్రారంభం అవుతుంది. సంక్రాంతి పురుషుని పేరు రాక్షసి నామము (రాక్షసుడు). ఛండాలురకు అరిష్టము, శుద్ధోదక స్నానంచే సువృష్టి.

**కరణ ఫలం :** నల్ల వస్త్రము ధారణ వల్ల మహాభయం, లాక్ష గంధ లేపం వల్ల దుష్ట నాశనం, జపాపుష్ప ధారణ

వల్ల యుద్ధ భయం, గోమేదిక ధారణ వల్ల మహాభయం, సీసపాత్ర భోజనం వల్ల యుద్ధ భయం, పాలు త్రాగడం వల్ల కీర్తి నాశనం, రేగుపండ్లు తినడం వల్ల జంతువులకు సుఖప్రదం, చోరులనణచును. కోదండ శస్త్రధారణం వల్ల హాని, కాంచన ఛత్రధారణ వల్ల రోగనాశనం, ఏనుగు వాహనం వల్ల రాజులకు యుద్ధభయం, విస్మయ ముఖం వల్ల అశుభం, కూర్చుని ఉండటం వల్ల మధ్యార్ఘ్యం, ఆగ్నేయ ఆగమనం వల్ల ఆగ్నేయ దేశాలకు కీడు.

**సంక్రాంతి పురుషుడు :రాక్షసుడు.**

## కందాయ ఫలములు, సంవత్సర ఫలములు

| అశ్వని | భరణి | కృత్తిక | రోహిణి | మృగశిర | ఆరుద్ర | పునర్వసు | పుష్యమి | ఆశ్లేష |
|---|---|---|---|---|---|---|---|---|
| 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 |
| 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 |
| 4 | 1 | 3 | 0 | 2 | 4 | 1 | 3 | 0 |
| మఖ | పుబ్బ | ఉత్తర | హస్త | చిత్త | స్వాతి | విశాఖ | అనూరాధ | జ్యేష్ఠ |
| 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 |
| 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 |
| 2 | 4 | 1 | 3 | 0 | 2 | 4 | 1 | 3 |
| మూల | పూ.షాఢ | ఉ.షాఢ | శ్రవణం | ధనిష్ఠ | శతభిషం | పూ.భాద్ర | ఉ.భాద్ర | రేవతి |
| 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 |
| 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 |
| 0 | 2 | 4 | 1 | 3 | 0 | 2 | 4 | 1 |

బేసి సంఖ్య ధనలాభం, సరిసంఖ్య సమఫలం, సున్నా శూన్యఫలం. మొదటి కందాయం సున్నా అయితే వ్యాధి. రెండవ కందాయం సున్నా అయితే భయం. మూడవ కందాయం సున్నా అయితే కీడు. మూడూ సున్నా అయితే ఫలితం కూడా శూన్యమే.

## శ్రీ దుర్ముఖి నామ సం॥లో మేషాది ద్వాదశ రాశుల వారికి ఆదాయ వ్యయ, రాజపూజ్య అవమానములు

| రాశి | ఆదాయం | వ్యయం | రాజపూజ్యం | అవమానం |
|---|---|---|---|---|
| మేషం | 02 | 08 | 01 | 07 |
| వృషభం | 11 | 14 | 04 | 07 |
| మిథునం | 14 | 11 | 07 | 07 |
| కర్కాటకం | 08 | 11 | 03 | 03 |
| సింహం | 11 | 05 | 06 | 03 |
| కన్య | 14 | 11 | 02 | 06 |
| తుల | 11 | 14 | 05 | 06 |
| వృశ్చికం | 02 | 08 | 01 | 02 |
| ధనుస్సు | 05 | 14 | 04 | 02 |
| మకరం | 08 | 08 | 07 | 02 |
| కుంభం | 08 | 08 | 03 | 05 |
| మీనం | 05 | 14 | 06 | 05 |
| మొత్తం | 59 | 71 | 49 | 55 |

## శ్రీ దుర్ముఖినామ సం॥లో వర్షలగ్నము, జగల్లగ్నము ఫలితం
## దుర్ముఖినామ సంవత్సర వర్షలగ్నఫలిత సారాంశము

| | | | |
|---|---|---|---|
| చంద్ర రవి శు | బు | | |
| కే | వర్షలగ్నం 07.04.2016 సా. 4.54 గురువారము | | |
| | | | గు (వ) రా |
| | కు శ(వ) | | లగ్న |

| | | | |
|---|---|---|---|
| శు | రవి బు | | చంద్ర |
| కే | జగల్లగ్నం 13.04.2016 సా. 7.48 బుధవారము | | |
| | | | గు (వ) రా |
| | కు శ(వ) | లగ్న | |

### వర్షలగ్న ఫలం :

కన్యాలగ్నంలో వర్షారంభమవుతోంది. లగ్నాధిపతి బుధుడు అష్టమక్షేత్ర స్థితి అంత మంచిది కాదు. ప్రతి పనిలో ఆటంకాలు ఏర్పడతాయి. తెలుగు ప్రభుత్వాలు, ప్రజలు శ్రమపడితే తప్ప పనులు కాని పరిస్థితి గోచరిస్తోంది. లగ్నాధిపతి బుధుడు నవాంశలో మిథునం లో స్వక్షేత్రంలో ఉండుట వలన కొంతవరకు లగ్నానికి బలం చేకూరింది. కష్టపడితే ఫలితం వస్తుంది.

**ఆర్థికరంగం :**

ధన, భాగ్యాధిపతి శుక్రుడు మాలవ్య మహాపురుషయోగంలో ఉండి ఉచ్ఛను పొంది లగ్నాన్ని చూస్తున్నాడు. తెలుగు ప్రజలకు, పాలకులకు ఆర్థికంగా శుభ ఫలితాలుంటాయి. దేశం సౌభాగ్యవంతంగా ముందుకుపోతుంది. కళారంగం అభివృద్ధిని సాధిస్తుంది. ప్రజలు, మహిళలు సుఖ, శాంతులతో జీవిస్తారు.

**విద్యారంగం :**

విద్యార్థులు బాగా కష్టపడితే మంచి ఫలితాలు సాధించవచ్చు. విద్యాపరంగా మిశ్రమ ఫలితాలున్నాయి. గురువు లగ్నాత్ 12వ రాశిలో సింహంలో ఉన్నాడు. ద్వాదశ భావస్థితి అంత అనుకూలమైనది కాదు. ఏకాగ్రత, శ్రద్ధ చాలా అవసరం. పట్టుదలతో చదివితే ఉత్తమ ఫలితాలను సాధిస్తారు. ఉచ్ఛ శుక్రయోగం శుభ ఫలితాలను ఇస్తోంది.

**వ్యాపారం :**

బుధుడు లగ్న, దశమాలకు అధిపతియై అష్టమ భాగంలో ఉన్నాడు. బుద్ధిబలంతో వ్యాపారం చెయ్యాలి. ఆర్థికంగా శ్రమ ఉంది. ఆశించిన శుభ ఫలితాలు రావాలంటే నీతినిజాయితీ తప్పనిసరి. ధర్మబద్ధంగా వ్యవహరిస్తే మంచి ఫలితాలు వ్యాపారరీత్యా సాధించవచ్చు. లగ్నాధిపతే బుధుడు అవడం వల్ల వ్యాపారం వృద్ధి చెందుతుంది. అష్టమ స్థితి వల్ల శ్రద్ధ, శ్రమ, చిత్తశుద్ధితో పని చేయడం వల్ల మాత్రమే ధనలాభాలుంటాయి.

**వ్యవసాయం :**

మిశ్రమంగా ఉంటుంది. రవి ద్వాదశాధిపత్యం వహించి సప్తమంలో ఉన్నాడు. చెప్పుకోదగ్గ ఫలితాలు ఉండవు. మధ్యేమార్గంగా ఫలితాలుంటాయి. సప్తమ కేంద్రం అవడం చేత కొంతవరకు అనుకూల ఫలితాలు ఉంటాయి.

**శాంతిభద్రతలు :**

కుజగ్రహం తృతీయంలో స్వక్షేత్రంలో ఉన్నది. సంపూర్ణమైన శాంతి భద్రతలతో దేశం, రాష్ట్రాలు ఉంటాయి. ప్రజలు సమన్వయంతో, అవగాహనతో కలిసి పని చేస్తారు. విద్రోహక శక్తులను సమర్థవంతంగా ఎదుర్కొంటారు.

**ఆరోగ్యం :**

సూర్యచంద్రులిద్దరూ సప్తమ కేంద్రంలో ఉండి లగ్నాన్ని వీక్షిస్తున్నారు. మనశ్శాంతి, సంతృప్తి, సుఖసంతోషాలతో ప్రజలు ఆరోగ్యవంతులై జీవిస్తారు. ఆందోళన తగ్గుతుంది. చంద్రుడు లాభాధిపత్యంతో ప్రశాంత జీవనాన్ని ప్రసాదిస్తున్నాడు.

## దుర్ముఖి నామ సంవత్సర జగల్లగ్నఫలిత సారాంశం.

### జగల్లగ్నం:

తులా లగ్నం జగత్ లగ్నం అయినది. లగ్నాధిపతి షష్ఠంలో ఉండటం వల్ల కొంతవరకు ఇబ్బందికర పరిస్థితులుంటాయి. ఉచ్ఛలో ఉన్నా ఆధిపత్యం వల్ల జగత్ లగ్నాధిపతిగా శుక్రుడు పాలిస్తున్నాడు మరియు అష్టమాధిపతి కూడా అయినాడు. పాలకులు సమర్థవంతంగా పాలించలేని స్థితి గోచరిస్తుంది. ఏదో చేస్తారు. సాధించగలరు అనే విశ్వాసాన్ని మాత్రం పాలకులు ప్రజలకు కలిగిస్తారు. చేసేది మాత్రం శూన్యం. కారణం శుక్రగ్రహ స్థితి షష్ఠంలో ఉండటమే. రవి, బుధులు లగ్నాన్ని చూస్తున్నారు. రవి లాభాధిపతి ఉచ్ఛలో ఉన్నాడు. ప్రభువులకు మంచి గుర్తింపు ఉంటుంది. అధికార యోగం సద్వినియోగం అవుతుంది. శక్తివంచన లేకుండా పరిపాలన చేస్తారు. రక్షణ పరంగా శాంతిభద్రతలు ఉంటాయి. అరాచకాలు తగ్గుతాయి. కుజుడు స్వరాశిలో ధనభావంలో ఉన్నాడు. ఆర్థిక ప్రగతి ఉంటుంది. గురు, రాహువులు లాభంలో ఉన్నారు. విజ్ఞానవంతంగా దేశం అభివృద్ధి పథంలో నడుస్తుంది. బంగారు భవిష్యత్తును సాధించే విధంగా ప్రణాళికలు సిద్ధం చేస్తారు. ఋణబాధలు తీరుతాయి. విపత్తులు తగ్గుతాయి. భాగ్య చంద్రుడి వల్ల సద్భావన, సత్ప్రవర్తన కలిగి న్యాయబద్ధంగా నాయకులు నడుచుకుంటారు.

శని ధనభావంలో వక్రించి ఉన్నందున కొన్ని విషయాల్లో మాటల యుద్ధం జరుగుతుంది. అభిప్రాయభేదాలు వస్తాయి. కుజ యుతి కూడా ఉండుటచే ఆవేశపూరిత సంఘటనలు చోటుచేసుకుంటాయి. రెచ్చగొట్టే విధంగా పాలకుల ప్రవర్తన ఉంటుంది. మొత్తం మీద సమన్వయంతో పనిచేయక తప్పని పరిస్థితి వస్తుంది.

ఆధ్యాత్మికంగా షష్ఠ కేతు ఫలితాలు శుభాన్నిస్తాయి. ప్రజల్లో భక్తి భావన, విశ్వాసాలు పెరుగుతాయి. నమ్మకంతో పనిచేస్తారు. కుటుంబ బంధాలు పెరుగుతాయి. ప్రజలు ప్రేమాభిమానాలతో, ఆత్మీయానురాగాలతో ఉంటారు.

బుధ బలం భాగ్యాధిపత్యం, ద్వాదశాధిపత్యంతో ఉండటం వల్ల విదేశాలతో సత్సంబంధాలు అధికమవుతాయి. సాంకేతికంగా అభివృద్ధి ఉంటుంది. తెలివితేటలు, బుద్ధిబలంతో సమయస్ఫూర్తిని ప్రదర్శిస్తారు. ప్రజలు, పాలకుల మధ్య మంచి అవగాహన ఏర్పడుతుంది. విజ్ఞాన పరంగా ప్రగతిని సాధిస్తారు.

మొత్తం మీద దేశ ప్రజలు శుభయోగాలతో ఆయురారోగ్య ఐశ్వర్యములతో సుఖశాంతులతో వర్ధిల్లాలని శ్రీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామి వారి కరుణా కటాక్షాలు మనందరిపైన ఉండాలని ప్రార్థిస్తూ స్వస్తి.

సిద్ధాంతి

**డా. శంకరమంచి రామకృష్ణ శాస్త్రి, పిహెచ్.డి.**

## కార్తెలు - 2016

| కార్తెలు | తేదీలు | వారం | సమయం | నక్షత్రం | లింగం | సాగరం | వాహనం | ఫలం |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 13.4.2016 | బుధ | సా. 7.47:55 | పునర్వసు | పు + స్త్రీ | శూల | గాడిద (7) | అల్పవృష్టి |
| భరణి | 27.4.2016 | బుధ | ఉ. 11.43 | మూల | స్త్రీ + నపుం | కక్ష | అశ్వం (0) | పర్వత వృష్టి |
| కృత్తిక | 11.5.2016 | బుధ | ఉ. 5.49:16 | పునర్వసు | స్త్రీ + స్త్రీ | శూల | మహిష (5) | సువృష్టి |
| రోహిణి | 25.5.2016 | బుధ | తె. 2.07:01 | పూ. షాఢ | పు+స్త్రీ | క్రోడ | ఏనుగు(8) | పర్వతవృష్టి |
| మృగశిర | 7.6.2016 | మంగళ | రా. 11.56:55 | పునర్వసు | నపుం+స్త్రీ | శూల | మండూకం (3) | సువృష్టి |
| ఆర్ద్ర | 21.6.2016 | మంగళ | రా. 11.00:29 | పూ. షాఢ | స్త్రీ + స్త్రీ | క్రోడ | నెమలి (6) | ఖండవృష్టి |
| పునర్వసు | 5.7.2016 | మంగళ | రా. 10.34:22 | పుష్యమి | స్త్రీ + స్త్రీ | క్రోడ | నక్క (2) | అల్పవృష్టి |
| పుష్యమి | 19.7.2016 | మంగళ | రా. 10.07:31 | ఉ.షాఢ | స్త్రీ + స్త్రీ | శూల | మహిష 5) | సువృష్టి |
| ఆశ్రేష | 02.8.2016 | మంగళ | రా. 9.01:11 | పుష్యమి | స్త్రీ + స్త్రీ | క్రోడ | అశ్వం (0) | పర్వతవృష్టి |
| మఖ | 16.8.2016 | మంగళ | సా. 6.40:10 | ఉ.షాఢ | స్త్రీ + స్త్రీ | శూల | మండూకం (3) | సువృష్టి |
| పుబ్బ | 30.8.2016 | మంగళ | మ. 2.39:39 | ఆశ్రేష | స్త్రీ + స్త్రీ | కక్ష | ఏనుగు (8) | పర్వత వృష్టి |
| ఉత్తర | 13.9.2016 | మంగళ | ఉ. 8.29:51 | ఉ.షాఢ | పు + స్త్రీ | శూల | ఎలుక (1) | అల్పవృష్టి |
| హస్త | 27.9.2016 | మంగళ | రా. 12.00:48 | ఆశ్రేష | పు + స్త్రీ | కక్ష | నెమలి (6) | ఖండవృష్టి |
| చిత్ర | 10.10.2016 | సోమ | మ. 12.55:11 | ఉ.షాఢ | స్త్రీ + స్త్రీ | శూల | ఏనుగు (8) | పర్వతవృష్టి |
| స్వాతి | 23.10.2016 | ఆది | రా. 11.29:27 | ఆశ్రేష | స్త్రీ + స్త్రీ | కక్ష | మేక (4) | అల్పవృష్టి |

| కార్తెలు | తేదీలు | వారం | సమయం | నక్షత్రం | లింగం | సాగరం | వాహనం | ఫలం |
|---|---|---|---|---|---|---|---|---|
| విశాఖ | 6.11.2016 | ఆది | ఉ.7.32:04 | ఉ.షాఢ | స్త్రీ + స్త్రీ | శూల | నెమలి (6) | ఖండవృష్టి |
| అనూరాధ | 19.11.2016 | శని | మ.1.38:32 | పుష్యమి | పు + స్త్రీ | క్రోడ | ఎలుక (1) | అల్పవృష్టి |
| జ్యేష్ఠ | 2.12.2016 | శుక్ర | సా.5.52:19 | పూ.షాఢ | స్త్రీ +స్త్రీ | క్రోడ | మండూకం (3) | సువృష్టి |
| మూల | 15.12.2016 | గురు | రా. 8.54:54 | పునర్వసు | నపు + స్త్రీ | శూల | గాడిద (7) | అల్పవృష్టి |
| పూ.షాఢ | 28.12.2016 | బుధ | రా. 11.07:35 | మూల | స్త్రీ + నపుం | కక్ష | అశ్వం (0) | పర్వతవృష్టి |
| ఉ.షాఢ | 11.1.2017 | బుధ | తె.1.05:28 | మృగశిర | స్త్రీ + నపుం | కక్ష | మండూకం (3) | సువృష్టి |
| శ్రవణం | 24.1.2017 | మంగళ | తె. 3.26:33 | జ్యేష్ఠ | పు + స్త్రీ | పర్వత | నెమలి (6) | ఖండవృష్టి |
| ధనిష్ఠ | 6.2.2017 | సోమ | ఉ. 6.32:02 | రోహిణి | స్త్రీ + పు | పర్వత | అశ్వం (0) | పర్వతవృష్టి |
| శతభిషం | 19.2.2017 | ఆది | ఉ. 11.08:08 | అనురాధ | నపు + పు | సాగర | మండూకం (3) | సువృష్టి |
| పూ.భాద్ర | 4.3.2017 | శని | సా. 5.21:50 | కృత్తిక | పు + స్త్రీ | సాగర | నెమలి (6) | ఖండవృష్టి |
| ఉ.భాద్ర | 18.3.2017 | శని | తె.1.53:59 | విశాఖ | పు + స్త్రీ | కక్ష | అశ్వం (0) | పర్వతవృష్టి |
| రేవతి | 31.3.2017 | శుక్ర | మ. 12.40:25 | కృత్తిక | స్త్రీ + స్త్రీ | శూల | మేక (4) | అల్పవృష్టి |
| అశ్విని | 14.4.2017 | శుక్ర | తె. 2.03:57 | విశాఖ | పు + స్త్రీ | కక్ష | గాడిద (7) | అల్పవృష్టి |
| భరణి | 27.4.2017 | గురు | సా. 5.51:48 | కృత్తిక | స్త్రీ + స్త్రీ | సాగర | నక్క (2) | అల్పవృష్టి |

# శుభ ముహూర్తాలు 2016-2017

**పుష్కరాలు:** 11-8-2016, రా.09:27:37లకు గురువు కన్యాసంక్రమణం. గురువు కన్యారాశి యందు ప్రవేశించుటచే కృష్ణాపుష్కరాలు ప్రారంభమవుతాయి.

12-9-2017, ఉ.06:51:07లకు కృష్ణాపుష్కరాలు పరిసమాప్త మవుతాయి.

**11-8-2016 నుండి 23-8-2016 వరకు, 12 రోజులు వివాహాది శుభకార్యములు చేయరాదు.**

**శుక్ర, గురు మౌఢ్యమి, గ్రహణాలలో వివాహాది శుభకార్యాలు చేయరాదు.**

**మౌఢ్యమి వివరాలు:**

**శుక్ర మౌఢ్యమి:** 30-4-2016 మ.03:44ల నుండి 13-7-2016 మ.01:39 వరకు.

**గురు మౌఢ్యమి:** 12-9-2016 రా.01:38 నుండి 10-10-2016 సా.07:43 వరకు.

**శుక్ర మౌఢ్యమి:** 20-3-2017 సా.04:58ల నుండి 30-3-2017 మ.03:50 వరకు.

**వాస్తు కర్తరిలో గృహారంభ, గృహప్రవేశములు చేయరాదు.**

**వాస్తుకర్తరి ప్రారంభం :** 04-05-2016 ఉ.08:31నిల నుండి 28-5-2016 మ.01:28:07 ల వరకు.

**గ్రహణాలు:** 2016-2017 లలో అంతరిక్షంలో ఏర్పడు గ్రహణాలు:

1. **చంద్ర గ్రహణం :** గురువారం 18-8-2016 నాడు మ.03:13లకు గ్రహణ మధ్యకాలం అగును. ఈ గ్రహణం మన ప్రాంతంలో కనపడదు.
2. **సూర్య గ్రహణం:** గురువారం 01-9-2016 నాడు మ.02:38:55 లకు గ్రహణ మధ్యకాలం అగును. దక్షిణార్ధగోళంలో ఈ గ్రహణం ఏర్పడటం వల్ల ఇది మన ప్రాంతంలో కనపడదు.
3. **చంద్ర గ్రహణం:** శనివారం 17-9-2016 నాడు రా.12:25లకు గ్రహణ మధ్యకాలం అగును. ఈ గ్రహణం చాలా తక్కువగా కనపడుతుంది.
4. **చంద్ర గ్రహణం:** శనివారం 11-2-2017 నాడు ఉ.06:14ని లకు గ్రహణ మధ్యకాలం అగును. ఈ గ్రహణం చాలా తక్కువగా కనపడుతుంది.
5. **సూర్య గ్రహణం:** ఆదివారం 26-2-2017నాడు రా.08:24:46లకు గ్రహణ మధ్యకాలం అగును. ఈ గ్రహణం మన ప్రాంతంలో కనపడదు.

## ఏప్రిల్-2016

**20 బుధవారము :** చైత్ర శుక్ల చతుర్దశి హస్త మకర తె.1.31 వివాహం.

**21 గురువారము :** చైత్ర పౌర్ణమి చిత్ర ధనుస్సు రా.11.58 వివాహం.

**22 శుక్రవారము :** చైత్ర బహుళ పాడ్యమి స్వాతి మిథున ఉ.11.01 వివాహం. ఉపనయనం.వ్యాపారం.గృహారంభం

చైత్ర బహుళ పాడ్యమి స్వాతి మకర తె.1.23 వివాహం.

చైత్ర బహుళ పాడ్యమి స్వాతి మీన తె.4.17 వివాహం.

**24 ఆదివారము :** చైత్ర బహుళ తదియ అనూరాధ ధనుస్సు రా.11.46 వివాహం.

చైత్ర బహుళ తదియ అనూరాధ మకర తె.1.16 వివాహం.

చైత్ర బహుళ తదియ అనూరాధ మీన తె.4.09 వివాహం.

**25 సోమవారము :** చైత్ర బహుళ తదియ అనూరాధ మిథున ఉ.10.49 ఉపనయనం. వ్యాపారం. అన్నప్రాసన. గృహారంభం. గృహ ప్రవేశం.

**27 బుధవారము :** చైత్ర బహుళ పంచమి మూల మిథున ఉ.10.42 ఉపనయనం. వ్యాపారం. అన్నప్రాసన. గృహారంభం. గృహప్రవేశం.

చైత్ర బహుళ పంచమి మూల కర్కాటక ఉ.11.40 వివాహం. గృహారంభం. గృహప్రవేశం.

**28 గురువారము :** చైత్ర బహుళ సప్తమి ఉత్తరాషాఢ ధనుస్సు రా.11.30 వివాహం.

చైత్ర బహుళ సప్తమి ఉత్తరాషాఢ మకర తె.1.00 వివాహం.

చైత్ర బహుళ సప్తమి ఉత్తరాషాఢ మీన తె.3.53 వివాహం.

**29 శుక్రవారము :** చైత్ర బహుళ సప్తమి ఉత్తరాషాఢ మిథున ఉ.10.34 వివాహం. ఉపనయనం. వ్యాపారం. అన్నప్రాసన. గృహారంభం. గృహప్రవేశం.

చైత్ర బహుళ సప్తమి ఉత్తరాషాఢ కర్కాటక ఉ.11.33 గృహారంభం. గృహప్రవేశం.

చైత్ర బహుళ అష్టమి శ్రవణం ధనుస్సు రా.11.26 వివాహం.

చైత్ర బహుళ అష్టమి శ్రవణం మీన తె.3.49 వివాహం.

**శుక్ర మౌఢ్యమి: 30-4-2016 మ.03:44 ల నుండి 13-7-2016 మ.01:39 వరకు.**

**30 శనివారము :** చైత్ర బహుళ అష్టమి శ్రవణం మిథున ఉ.10.30 అన్నప్రాసన.

## మే-2016

**2 సోమవారము :** చైత్ర బహుళ దశమి శతభిషం మిథున ఉ.10.22 అన్నప్రాసన.

**వాస్తు కర్తరిలో గృహారంభ, గృహప్రవేశములు చేయరాదు. వాస్తుకర్తరి ప్రారంభం: 04-05-2016 ఉ.08:31 ని॥ల నుండి 28-5-2016 మ.01:28:07 ల వరకు.**

**11 బుధవారము :** వైశాఖ శుక్ల పంచమి పునర్వసు మిథున ఉ.9.47 అన్నప్రాసన.

**16 సోమవారము :** వైశాఖ శుక్ల దశమి ఉత్తర మిథున ఉ.9.27 అన్నప్రాసన.

**18 బుధవారము :** వైశాఖ శుక్ల ద్వాదశి హస్త మిథున ఉ.9.19 అన్నప్రాసన.

**22 ఆదివారము :** వైశాఖ బహుళ పాడ్యమి అనూరాధ మిథున ఉ.9.03 అన్నప్రాసన.

**26 గురువారము :** వైశాఖ బహుళ పంచమి ఉత్తరాషాఢ మిథున ఉ.8.48 అన్నప్రాసన.

**29 ఆదివారము :** వైశాఖ బహుళ అష్టమి శతభిషం మిథున ఉ.8.36 అన్నప్రాసన.

## జూన్-2016

**2 గురువారము :** వైశాఖ బహుళ ద్వాదశి అశ్విని మిథున ఉ.8.20 అన్నప్రాసన.

**6 సోమవారము :** జ్యేష్ఠ శుక్ల విదియ మృగశిర మిథున ఉ.8.04 అన్నప్రాసన.

**11 శనివారము :** జ్యేష్ఠ శుక్ల సప్తమి మఘ మిథున ఉ.7.45 అన్నప్రాసన.

**13 సోమవారము :** జ్యేష్ఠ శుక్ల నవమి ఉత్తర కర్కాటక ఉ.8.36 అన్నప్రాసన.

**15 బుధవారము :** జ్యేష్ఠ శుక్ల ఏకాదశి చిత్ర కర్కాటక ఉ.8.28 అన్నప్రాసన.

**16 గురువారము :** జ్యేష్ఠ శుక్ల ఏకాదశి స్వాతి కర్కాటక ఉ.8.24 అన్నప్రాసన.

**20 సోమవారము :** జ్యేష్ఠ పౌర్ణమి మూల కర్కాటక ఉ.8.08 అన్నప్రాసన.

## జులై-2016

**18 సోమవారము :** ఆషాఢ శుక్ల చతుర్దశి మూల కన్య ఉ.11.06 వ్యాపారం. అన్నప్రాసన.

**20 బుధవారము :** ఆషాఢ బహుళ పాడ్యమి ఉత్తరాషాఢ కన్య ఉ .10.58 వ్యాపారం. అన్నప్రాసన.

**22 శుక్రవారము :** ఆషాఢ బహుళ తదియ ధనిష్ఠ కన్య ఉ.10.50 వ్యాపారం. అన్నప్రాసన.

**23 శనివారము :** ఆషాఢ బహుళ చవితి శతభిషం కన్య ఉ.10.46 వ్యాపారం. అన్నప్రాసన.

**29 శుక్రవారము :** ఆషాఢ బహుళ దశమి రోహిణి కన్య ఉ.10.22 వ్యాపారం. అన్నప్రాసన.

**30 శనివారము :** ఆషాఢ బహుళ ద్వాదశి మృగశిర కన్య ఉ.10.19 వ్యాపారం. అన్నప్రాసన.

## ఆగస్టు-2016

**4 గురువారము :** శ్రావణ శుక్ల విదియ మఘ కన్య ఉ.9.59 వివాహం. వ్యాపారం. అన్నప్రాసన. గృహప్రవేశం.

**6 శనివారము :** శ్రావణ శుక్ల చవితి ఉత్తర కన్య ఉ.9.51 వివాహం. వ్యాపారం. అన్నప్రాసన. గృహారంభం. గృహప్రవేశం.

**7 ఆదివారము :** శ్రావణ శుక్ల పంచమి హస్త మిథున తె.4.01 వివాహం.

శ్రావణ శుక్ల పంచమి హస్త కన్య ఉ.9.47 వివాహం. వ్యాపారం. అన్నప్రాసన. గృహారంభం.

శ్రావణ శుక్ల పంచమి హస్త మీన రా.9.16 వ్యాపారం.

**8 సోమవారము :** శ్రావణ శుక్ల షష్ఠి చిత్ర మీన రా.9.12 వ్యాపారం. గృహప్రవేశం.

**10 బుధవారము :** శ్రావణ శుక్ల సప్తమి స్వాతి కన్య ఉ.9.35 వివాహం. వ్యాపారం. అన్నప్రాసన. గృహారంభం

**పుష్కరాలు : 11-8-2016, రా.09:27:37లకు గురువు కన్యాసంక్రమణం. గురువు కన్యారాశి యందు ప్రవేశించుటచే కృష్ణాపుష్కరాలు ప్రారంభమవుతాయి.**

**11-8-2016 నుండి 23-8-2016 వరకు, 12 రోజులు వివాహాది శుభకార్యములు చేయరాదు.**

**25 గురువారము :** శ్రావణ బహుళ నవమి రోహిణి మిథున తె.2.50 వివాహం.

శ్రావణ బహుళ అష్టమి రోహిణి మీన రా.8.05 వ్యాపారం.

**26 శుక్రవారము :** శ్రావణ బహుళ దశమి మృగశిర మిథున తె.2.46 వివాహం.

శ్రావణ బహుళ నవమి మృగశిర తుల ఉ.11.24 వివాహం. అన్నప్రాసన.

శ్రావణ బహుళ దశమి మృగశిర మీన రా.8.02 వ్యాపారం.

**27 శనివారము :** శ్రావణ బహుళ దశమి మృగశిర కన్య ఉ.8.29 వివాహం. వ్యాపారం.

**28 ఆదివారము :** శ్రావణ బహుళ ద్వాదశి పునర్వసు మిథున తె.2.38 వివాహం.

శ్రావణ బహుళ ద్వాదశి పునర్వసు కర్కాటక తె.3.37 వివాహం.

శ్రావణ బహుళ ఏకాదశి పునర్వసు తుల ఉ.11.16 వివాహం. అన్నప్రాసన.

శ్రావణ బహుళ ద్వాదశి పునర్వసు మీన రా.7.54 వ్యాపారం.

**29 సోమవారము :** శ్రావణ బహుళ ద్వాదశి పునర్వసు కన్య ఉ.8.21 వ్యాపారం. అన్నప్రాసన.

శ్రావణ బహుళ త్రయోదశి పుష్యమి మీన రా.7.50 వ్యాపారం.

సెప్టెంబరు-2016

**3 శనివారము** : భాద్రపద శుక్ల విదియ ఉత్తర కన్య ఉ.8.01 వ్యాపారం.అన్నప్రాసన.

భాద్రపద శుక్ల తదియ హస్త మీన రా.7.30 వ్యాపారం.

**4 ఆదివారము** : భాద్రపద శుక్ల తదియ హస్త కన్య ఉ.7.57 వ్యాపారం.అన్నప్రాసన.

భాద్రపద శుక్ల తదియ హస్త తుల ఉ.10.49 అన్నప్రాసన.

**5 సోమవారము** : భాద్రపద శుక్ల చవితి చిత్ర కన్య ఉ.7.53 వ్యాపారం.అన్నప్రాసన.

భాద్రపద శుక్ల చవితి చిత్ర తుల ఉ.10.45 అన్నప్రాసన.

భాద్రపద శుక్ల చవితి చిత్ర మీన రా.7.22 వ్యాపారం.

**8 గురువారము** : భాద్రపద శుక్ల సప్తమి అనూరాధ మీన రా.7.10 వ్యాపారం.

**గురు మౌఢ్యమి : 12-9-2016 రా.01:38 నుండి 10-10-2016 సా.07:43 వరకు.**

## అక్టోబరు-2016

**10 సోమవారము** : ఆశ్వీయుజ శుక్ల నవమి ఉత్తరాషాఢ తుల ఉ.8.23 అన్నప్రాసన.

**12 బుధవారము** : ఆశ్వీయుజ శుక్ల ఏకాదశి ధనిష్ఠ మేష రా.7.16 వ్యాపారం.

ఆశ్వీయుజ శుక్ల ఏకాదశి ధనిష్ఠ తుల ఉ.8.15 వివాహం. అన్నప్రాసన.గృహారంభం.గృహప్రవేశం.

**13 గురువారము** : ఆశ్వీయుజ శుక్ల ద్వాదశి శతభిషం తుల ఉ.8.11 వివాహం. అన్నప్రాసన.గృహారంభం.గృహప్రవేశం.

**14 శుక్రవారము** : ఆశ్వీయుజ శుక్ల చతుర్దశి ఉత్తరాభాద్ర మేష రా.7.08 వివాహం. వ్యాపారం.

**15 శనివారము** : ఆశ్వీయుజ పౌర్ణమి రేవతి మేష రా.7.04 వివాహం. వ్యాపారం.

ఆశ్వీయుజ శుక్ల చతుర్దశి ఉత్తరాభాద్ర తుల ఉ.8.03 వివాహం. అన్నప్రాసన.గృహారంభం.గృహప్రవేశం.

**16 ఆదివారము** : ఆశ్వీయుజ బహుళ పాడ్యమి అశ్విని మేష రా.7.00 వివాహం. వ్యాపారం.

ఆశ్వీయుజ పౌర్ణమి రేవతి తుల ఉ.7.59 వివాహం. అన్నప్రాసన. గృహారంభం. గృహప్రవేశం.

**19 బుధవారము** : ఆశ్వీయుజ బహుళ పంచమి రోహిణి కర్కాటక తె.12.08 వివాహం.

**21 శుక్రవారము** : ఆశ్వీయుజ బహుళ సప్తమి పునర్వసు కర్కాటక తె.12.01 వివాహం.

ఆశ్వీయుజ బహుళ సప్తమి పునర్వసు కన్య తె.4.48 వివాహం.

26 బుధవారము : ఆశ్వీయుజ బహుళ ద్వాదశి ఉత్తర కన్య తె.4.29 వివాహం.

**27 గురువారము** : ఆశ్వీయుజ బహుళ త్రయోదశి ఉత్తర కర్కాటక రా.11.37 వివాహం.

ఆశ్వీయుజ బహుళ త్రయోదశి హస్త కన్య తె.4.25 వివాహం.

## నవంబరు-2016

**3 గురువారము** : కార్తీక శుక్ల చవితి మూల కన్య తె.3.57 వివాహం.

**4 శుక్రవారము** : కార్తీక శుక్ల పంచమి మూల ధనుస్సు ఉ.11.00 వివాహం.

**6 ఆదివారము** : కార్తీక శుక్ల సప్తమి శ్రవణం కన్య తె.3.46 వివాహం.

**12 శనివారము** : కార్తీక శుక్ల త్రయోదశి అశ్విని కన్య తె.3.22 వివాహం.

కార్తీక శుక్ల త్రయోదశి రేవతి ధనుస్సు ఉ.10.29 వివాహం. గృహారంభం. గృహప్రవేశం.

**13 ఆదివారము :** కార్తీక శుక్ల చతుర్దశి అశ్విని ధనుస్సు ఉ.10.25 వివాహం.గృహారంభం

**16 బుధవారము :** కార్తీక బహుళ తదియ మృగశిర కన్య తె.3.07 వివాహం.

కార్తీక బహుళ తదియ మృగశిర తుల తె.5.58 వివాహం.

కార్తీక బహుళ విదియ రోహిణి ధనుస్సు ఉ.10.13 వివాహం. గృహారంభం. గృహప్రవేశం.

**18 శుక్రవారము :** కార్తీక బహుళ పంచమి పునర్వసు కన్య తె.2.59 వివాహం.

**20 ఆదివారము :** కార్తీక బహుళ అష్టమి మఘ తుల తె.5.42 వివాహం.

**23 బుధవారము :** కార్తీక బహుళ దశమి ఉత్తర కన్య తె.2.39 వివాహం.

కార్తీక బహుళ ఏకాదశి ఉత్తర తుల తె.5.31 వివాహం.

కార్తీక బహుళ దశమి ఉత్తర ధనుస్సు ఉ.9.46 వివాహం. గృహారంభం. గృహప్రవేశం.

**24 గురువారము :** కార్తీక బహుళ ఏకాదశి హస్త కన్య తె.2.35 వివాహం.

కార్తీక బహుళ ఏకాదశి హస్త తుల తె.5.27 వివాహం.

కార్తీక బహుళ ఏకాదశి హస్త ధనుస్సు ఉ.9.42 వివాహం.గృహారంభం

**25 శుక్రవారము :** కార్తీక బహుళ ద్వాదశి చిత్ర కన్య తె.2.31 వివాహం.

కార్తీక బహుళ ద్వాదశి చిత్ర తుల తె.5.23 వివాహం.

**26 శనివారము :** కార్తీక బహుళ త్రయోదశి స్వాతి కన్య తె.2.27 వివాహం.

కార్తీక బహుళ త్రయోదశి స్వాతి తుల తె.5.19 వివాహం.

కార్తీక బహుళ ద్వాదశి చిత్ర ధనుస్సు ఉ.9.34 వివాహం. గృహారంభం. గృహప్రవేశం.

**27 ఆదివారము :** కార్తీక బహుళ త్రయోదశి స్వాతి ధనుస్సు ఉ.9.30 వివాహం.గృహారంభం

**30 బుధవారము :** మార్గశిర శుక్ల విదియ మూల తుల తె.5.03 వివాహం.

## డిసెంబరు-2016

**3 శనివారము :** మార్గశిర శుక్ల పంచమి ఉత్తరాషాఢ కన్య తె.2.00 వివాహం.

మార్గశిర శుక్ల చవితి ఉత్తరాషాఢ ధనుస్సు ఉ.9.06 వివాహం. గృహారంభం. గృహప్రవేశం.

**4 ఆదివారము :** మార్గశిర శుక్ల పంచమి శ్రవణం కన్య తె.1.56 వివాహం.

మార్గశిర శుక్ల పంచమి ఉత్తరషాఢ ధనుస్సు ఉ.9.02 వివాహం. గృహారంభం.గృహప్రవేశం.

**5 సోమవారము :** మార్గశిర శుక్ల షష్ఠి శ్రవణం ధనుస్సు ఉ.8.58 గృహారంభం.

**7 బుధవారము :** మార్గశిర శుక్ల అష్టమి శతభిషం ధనుస్సు ఉ.8.51 వివాహం.గృహారంభం.గృహప్రవేశం.

**14 బుధవారము :** మార్గశిర బహుళ పాడ్యమి మృగశిర ధనుస్సు ఉ 8.23 వ్యాపారం.గృహారంభం.గృహప్రవేశం.

మార్గశిర బహుళ పాడ్యమి మృగశిర మకర ఉ.9.52 వివాహం. అన్నప్రాసన. గృహారంభం. గృహప్రవేశం.

**15 గురువారము :** మార్గశిర బహుళ విదియ పునర్వసు మిథున రా.7.26 వ్యాపారం.

మార్గశిర బహుళ తదియ పునర్వసు కన్య తె.1.13 వివాహం.

**16 శుక్రవారము :** మార్గశిర బహుళ తదియ పునర్వసు మకర ఉ.9.45 అన్నప్రాసన.

**19 సోమవారము :** మార్గశిర బహుళ షష్ఠి మఘ మకర ఉ.9.33 అన్నప్రాసన.

మార్గశిర బహుళ షష్ఠి మఘ మీన మ.12.26 వ్యాపారం.

**21 బుధవారము :** మార్గశిర బహుళ అష్టమి ఉత్తర మకర ఉ.9.25 వివాహం. అన్నప్రాసన.

**22 గురువారము :** మార్గశిర బహుళ దశమి చిత్ర కన్య తె.12.45 వివాహం.

మార్గశిర బహుళ నవమి హస్త మకర ఉ.9.21 వివాహం. అన్నప్రాసన. గృహారంభం.

మార్గశిర బహుళ నవమి హస్త మీన మ.12.14 వ్యాపారం. గృహారంభం

**23 శుక్రవారము :** మార్గశిర బహుళ దశమి స్వాతి కన్య తె.12.41 వివాహం.

మార్గశిర బహుళ దశమి చిత్ర మీన మ.12.10 వ్యాపారం. గృహారంభం. గృహప్రవేశం.

**24 శనివారము :** మార్గశిర బహుళ ఏకాదశి స్వాతి కన్య తె.12.37 వివాహం.

**26 సోమవారము :** మార్గశిర బహుళ త్రయోదశి అనూరాధ మీన ఉ.11.58 వ్యాపారం. గృహారంభం. గృహప్రవేశం.

## జనవరి-2017

**5 గురువారము :** పుష్య శుక్ల సప్తమి ఉత్తరాభాద్ర మకర ఉ.8.26 అన్నప్రాసన.

**13 శుక్రవారము :** పుష్య బహుళ పాడ్యమి పుష్యమి మకర ఉ.7.54 అన్నప్రాసన.

**29 ఆదివారము :** మాఘ శుక్ల విదియ ధనిష్ఠ మేష మ.12.07 వివాహం. వ్యాపారం. గృహారంభం. గృహప్రవేశం.

మాఘ శుక్ల విదియ శతభిషం వృశ్చిక తె.2.06 వివాహం.

**30 సోమవారము :** మాఘ శుక్ల తదియ శతభిషం మేష మ.12.03 వ్యాపారం. గృహారంభం. గృహప్రవేశం.

## ఫిబ్రవరి-2017

**1 బుధవారము :** మాఘ శుక్ల పంచమి ఉత్తరాభాద్ర మేష ఉ.11.56 వివాహం. వ్యాపారం. గృహారంభం. గృహప్రవేశం.

మాఘ శుక్ల పంచమి రేవతి వృశ్చిక తె.1.54 వివాహం.

**2 గురువారము :** మాఘ శుక్ల సప్తమి అశ్విని వృశ్చిక తె.1.50 వివాహం.

**3 శుక్రవారము :** మాఘ శుక్ల సప్తమి అశ్విని మేష ఉ.11.48 వివాహం. వ్యాపారం. గృహారంభం.

**13 సోమవారము :** మాఘ బహుళ తదియ ఉత్తర మేష ఉ.11.08 వ్యాపారం.

**15 బుధవారము :** మాఘ బహుళ పంచమి హస్త మేష ఉ.11.01 వివాహం. వ్యాపారం.

మాఘ బహుళ పంచమి చిత్ర వృశ్చిక తె.12.59 వివాహం.

మాఘ బహుళ పంచమి చిత్ర మకర తె.5.45 వివాహం.

**16 గురువారము :** మాఘ బహుళ షష్ఠి చిత్ర వృషభ మ.12.24 వివాహం. వ్యాపారం.

మాఘ బహుళ షష్ఠి స్వాతి మకర తె.5.41 వివాహం.

**17 శుక్రవారము :** మాఘ బహుళ సప్తమి స్వాతి మేష ఉ.10.53 వ్యాపారం. గృహారంభం.

మాఘ బహుళ సప్తమి స్వాతి వృషభ మ.12.20 వివాహం. వ్యాపారం. గృహారంభం.

**18 శనివారము :** మాఘ బహుళ అష్టమి అనూరాధ మకర తె.5.33 వివాహం.

**19 ఆదివారము :** మాఘ బహుళ అష్టమి అనూరాధ మేష ఉ.10.45 వివాహం. వ్యాపారం. గృహారంభం. గృహప్రవేశం.

మాఘ బహుళ అష్టమి అనూరాధ వృషభ మ.12.12 వ్యాపారం. గృహారంభం.

**22 బుధవారము :** మాఘ బహుళ ద్వాదశి ఉత్తరాషాఢ మకర తె.5.17 వివాహం.

## మార్చి-2017

**1 బుధవారము :** ఫాల్గుణ శుక్ల తదియ రేవతి మేష ఉ.10.06 వివాహం. వ్యాపారం. అన్నప్రాసన. గృహారంభం. గృహప్రవేశం.

ఫాల్గుణ శుక్ల తదియ రేవతి వృషభ ఉ.11.33 వివాహం. వ్యాపారం. గృహారంభం.

**2 గురువారము :** ఫాల్గుణ శుక్ల చవితి అశ్విని వృషభ ఉ.11.29 వివాహం. వ్యాపారం. గృహారంభం

**4 శనివారము :** ఫాల్గుణ శుక్ల సప్తమి రోహిణి మకర తె.4.38 వివాహం.

**5 ఆదివారము :** ఫాల్గుణ శుక్ల అష్టమి రోహిణి వృషభ ఉ.11.17 వివాహం. వ్యాపారం. గృహారంభం.

ఫాల్గుణ శుక్ల అష్టమి రోహిణి మీన ఉ.7.27 గృహారంభం. గృహప్రవేశం.

**6 సోమవారము :** ఫాల్గుణ శుక్ల నవమి మృగశిర వృషభ ఉ.11.13 వ్యాపారం. గృహారంభం.

**8 బుధవారము :** ఫాల్గుణ శుక్ల ఏకాదశి పునర్వసు వృషభ ఉ.11.05 వివాహం. వ్యాపారం.

**9 గురువారము :** ఫాల్గుణ శుక్ల ద్వాదశి పుష్యమి మీన ఉ.7.11 గృహారంభం.

**10 శుక్రవారము :** ఫాల్గుణ శుక్ల చతుర్దశి మఘ వృశ్చిక రా.11.28 వివాహం.

**12 ఆదివారము :** ఫాల్గుణ బహుళ పాడ్యమి ఉత్తర వృశ్చిక రా.11.21 వివాహం.

**13 సోమవారము :** ఫాల్గుణ బహుళ పాడ్యమి ఉత్తర వృషభ ఉ.10.45 వ్యాపారం.

**శుక్రమౌఢ్యమి: 20-3-2017 సా.04:58ల నుండి 30-3-2017 మ.03:50 వరకు.**

## ఏప్రిల్-2017

**14 శుక్రవారము :** చైత్ర బహుళ చవితి అనూరాధ మకర తె.1.56 వివాహం.

**15 శనివారము :** చైత్ర బహుళ చవితి అనూరాధ కర్కాటక మ.12.28 వివాహం. గృహారంభం. గృహప్రవేశం.

## శ్రీ దుర్ముఖినామ సంవత్సరములో రవ్యాది గ్రహరాశి ప్రవేశములు - నక్షత్ర, రాశి ప్రవేశములు

**రవి సంచార రాశి ప్రవేశము :**

| | | | |
|---|---|---|---|
| బుధ | 13 ఏప్రిల్ 2016 | సా. 7.47 | రవి అశ్విని నక్షత్ర ప్రవేశం , రవి మేష రాశి ప్రవేశం |
| బుధ | 27 ఏప్రిల్ 2016 | ఉ. 11.43 | రవి భరణి నక్షత్ర ప్రవేశం |
| బుధ | 11 మే 2016 | ఉ. 5.49 | రవి కృత్తిక నక్షత్ర ప్రవేశం |
| శని | 14 మే 2016 | సా. 4.41 | రవి వృషభ రాశి ప్రవేశం |
| బుధ | 25 మే 2016 | తె. 2.07 | రవి రోహిణి నక్షత్ర ప్రవేశం |
| మంగ | 7 జూన్ 2016 | రా. 11.56 | రవి మృగశిర నక్షత్ర ప్రవేశం |
| మంగ | 14 జూన్ 2016 | రా. 11.20 | రవి మిథున రాశి ప్రవేశం |
| మంగ | 21 జూన్ 2016 | రా. 11.00 | రవి ఆరుద్ర నక్షత్ర ప్రవేశం |
| మంగ | 5 జులై 2016 | రా. 10.34 | రవి పునర్వసు నక్షత్ర ప్రవేశం |
| శని | 16 జులై 2016 | ఉ. 10.14 | **రవి కర్కాటక రాశి ప్రవేశం** |
| మంగ | 19 జులై 2016 | రా. 10.07 | రవి పుష్యమి నక్షత్ర ప్రవేశం |
| మంగ | 2 ఆగష్టు 2016 | రా. 9.01 | రవి ఆశ్లేష నక్షత్ర ప్రవేశం |
| మంగ | 16 ఆగష్టు 2016 | సా. 6.40 | రవి మఖ నక్షత్ర ప్రవేశం రవి సింహరాశి ప్రవేశం |
| మంగ | 30 ఆగష్టు 2016 | మ. 2.39 | రవి పూర్వ ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| మంగ | 13 సెప్టెం 2016 | ఉ. 8.27 | రవి ఉత్తర ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 16 సెప్టెం 2016 | సా. 6.35 | రవి కన్యారాశి ప్రవేశం |
| మంగ | 27 సెప్టెం 2016 | రా. 12.00 | రవి హస్తా నక్షత్ర ప్రవేశం |
| సోమ | 10 అక్టో 2016 | మ. 12.55 | రవి చిత్ర నక్షత్ర ప్రవేశం |
| సోమ | 17 అక్టో 2016 | ఉ. 6.31 | రవి తులారాశి ప్రవేశం |
| ఆది | 23 అక్టో 2016 | రా. 11.29 | రవి స్వాతి నక్షత్ర ప్రవేశం |
| ఆది | 6 నవం 2016 | ఉ. 7.32 | రవి విశాఖ నక్షత్ర ప్రవేశం |
| బుధ | 16 నవం 2016 | ఉ. 6.17 | రవి వృశ్చికరాశి ప్రవేశం |
| శని | 19 నవం 2016 | మ. 1.38 | రవి అనూరాధ నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 2 డిశం 2016 | సా. 5.52 | రవి జ్యేష్ఠ నక్షత్ర ప్రవేశం |
| గురు | 15 డిశం 2016 | రా. 8.54 | రవి మూలా నక్షత్ర ప్రవేశం రవి ధనుస్సు రాశి ప్రవేశం |
| బుధ | 28 డిశం 2016 | రా. 11.07 | రవి పూర్వాషాఢ నక్షత్ర ప్రవేశం |
| బుధ | 11 జన 2017 | తె. 1.05 | రవి ఉత్తరాషాఢ నక్షత్ర ప్రవేశం |
| శని | 14 జన 2017 | ఉ. 7.38 | **రవి మకరరాశి ప్రవేశం** |
| మంగ | 24 జన 2017 | తె. 3.26 | రవి శ్రవణా నక్షత్ర ప్రవేశం |
| సోమ | 6 ఫిబ్ర 2017 | ఉ. 6.32 | రవి ధనిష్ఠ నక్షత్ర ప్రవేశం |
| ఆది | 12 ఫిబ్ర 2017 | రా. 8.38 | రవి కుంభరాశి ప్రవేశం |
| ఆది | 19 ఫిబ్ర 2017 | ఉ. 11.08 | రవి శతభిషా నక్షత్ర ప్రవేశం |
| శని | 4 మార్చి 2017 | సా. 5.21 | రవి పూర్వాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| మంగ | 14 మార్చి 2017 | సా. 5.32 | రవి మీనరాశి ప్రవేశం |
| శని | 18 మార్చి 2017 | తె. 1.53 | రవి ఉత్తరాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 31 మార్చి 2017 | ఉ. 12.40 | రవి రేవతి నక్షత్ర ప్రవేశం. |

**కుజ సంచార రాశి ప్రవేశము :**

| | | | |
|---|---|---|---|
| శని | 4 జూన్ 2016 | మ. 12.02 | కుజ (వ) విశాఖ నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 17 జూన్ 2016 | రా. 11.47 | కుజ (వ) తులారాశి ప్రవేశం |
| మంగ | 12 జులై 2016 | మ. 2.16 | కుజ వృశ్చికరాశి ప్రవేశం |
| మంగ | 26 జులై 2016 | ఉ. 11.40 | కుజ అనూరాధ నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 26 ఆగ 2016 | ఉ. 9.02 | కుజ జ్యేష్ఠ నక్షత్ర ప్రవేశం |
| ఆది | 18 సెప్టెం 2016 | ఉ. 7.44 | కుజ మూలా నక్షత్ర ప్రవేశం |
| | | | **కుజ ధనుస్సు రాశి ప్రవేశం** |
| శని | 8 అక్టో 2016 | సా. 4.19 | కుజ పూర్వాషాఢ నక్షత్ర ప్రవేశం |
| గురు | 27 అక్టో 2016 | సా. 5.29 | కుజ ఉత్తరాషాఢ నక్షత్ర ప్రవేశం |
| మంగ | 1 నవం 2016 | ఉ. 8.37 | కుజ మకరరాశి ప్రవేశం |
| మంగ | 15 నవం 2016 | రా. 12.47 | కుజ శ్రవణా నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 2 డిశం 2016 | రా. 10.17 | కుజ ధనిష్ఠ నక్షత్ర ప్రవేశం |
| ఆది | 11 డిశం 2016 | సా. 6.55 | కుజ కుంభరాశి ప్రవేశం |
| మంగ | 20 డిశం 2016 | మ. 3.00 | కుజ శతభిషా నక్షత్ర ప్రవేశం |
| శని | 7 జన 2017 | ఉ. 6.45 | కుజ పూర్వాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 20 జన 2017 | మ. 1.48 | కుజ మీనరాశి ప్రవేశం |
| బుధ | 25 జన 2017 | రా. 12.34 | కుజ ఉత్తరాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| శని | 11 ఫిబ్ర 2017 | రా. 10.33 | కుజ రేవతి నక్షత్ర ప్రవేశం |
| గురు | 2 మార్చి 2017 | తె. 2.39 | మేషరాశి కుజ ప్రవేశం |
| | | | **కుజ అశ్విని నక్షత్ర ప్రవేశం** |
| సోమ | 20 మార్చి 2017 | మ. 2.09 | కుజ భరణి నక్షత్ర ప్రవేశం |
| శని | 8 ఏప్రిల్ 2017 | ఉ. 9.52 | కుజ కృత్తిక నక్షత్ర ప్రవేశం |
| గురు | 13 ఏప్రిల్ 2017 | ఉ. 4.11 | కుజ వృషభరాశి ప్రవేశం |
| గురు | 27 ఏప్రిల్ 2017 | మ. 2.25 | కుజ రోహిణి నక్షత్ర ప్రవేశం |
| బుధ | 17 మే 2017 | తె. 3.43 | కుజ మృగశిర నక్షత్ర ప్రవేశం |
| శని | 27 మే 2017 | తె. 1.32 | కుజ మిథునరాశి ప్రవేశం |
| మంగ | 6 జూన్ 2017 | తె. 1.21 | కుజ ఆరుద్ర నక్షత్ర ప్రవేశం |
| సోమ | 26 జూన్ 2017 | ఉ. 6.39 | కుజ పునర్వసు నక్షత్ర ప్రవేశం |

**బుధ సంచార రాశి ప్రవేశము :**

| | | | |
|---|---|---|---|
| ఆది | 3 ఏప్రిల్ 2016 | తె. 3.44 | బుధ అశ్విని నక్షత్ర ప్రవేశం |
| | | | **బుధ మేషరాశి ప్రవేశం** |
| ఆది | 10 ఏప్రిల్ 2016 | ఉ. 8.21 | బుధ భరణి నక్షత్ర ప్రవేశం |
| గురు | 21 ఏప్రిల్ 2016 | తె. 4.53 | బుధ కృత్తిక నక్షత్ర ప్రవేశం |
| శని | 7 మే 2016 | మ. 2.45 | బుధ (వ) భరణి నక్షత్ర ప్రవేశం |
| ఆది | 5 జూన్ 2016 | తె. 2.59 | బుధ కృత్తిక నక్షత్ర ప్రవేశం |
| బుధ | 8 జూన్ 2016 | ఉ. 9.51 | బుధ వృషభరాశి ప్రవేశం |
| గురు | 16 జూన్ 2016 | తె. 1.19 | బుధ రోహిణి నక్షత్ర ప్రవేశం |
| గురు | 23 జూన్ 2016 | రా. 10.04 | బుధ మృగశిర నక్షత్ర ప్రవేశం |
| సోమ | 27 జూన్ 2016 | ఉ. 8.07 | బుధ మిథునరాశి ప్రవేశం |
| గురు | 30 జూన్ 2016 | మ. 1.27 | బుధ ఆరుద్ర నక్షత్ర ప్రవేశం |
| బుధ | 6 జులై 2016 | సా. 5.47 | బుధ పునర్వసు నక్షత్ర ప్రవేశం |
| సోమ | 11 జులై 2016 | ఉ. 9.46 | బుధ కర్కాటక రాశి ప్రవేశం |
| బుధ | 13 జులై 2016 | రా. 12.06 | బుధ పుష్యమి నక్షత్ర ప్రవేశం |
| మంగ | 19 జులై 2016 | సా. 6.02 | బుధ ఆశ్లేష నక్షత్ర ప్రవేశం |
| బుధ | 27 జులై 2016 | ఉ. 7.11 | బుధ మఖ నక్షత్ర ప్రవేశం |

**బుధ సింహరాశి ప్రవేశం**

| | | | |
|---|---|---|---|
| శుక్ర | 5 ఆగష్టు 2016 | రా. 12.47 | బుధ పూర్వ ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| మంగ | 16 ఆగష్టు 2016 | తె. 1.28 | బుధ ఉత్తర ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 19 ఆగష్టు 2016 | సా. 5.13 | బుధ కన్యారాశి ప్రవేశం |
| శుక్ర | 9 సెప్టెం 2016 | సా. 5.58 | బుధ (వ) సింహరాశి ప్రవేశం |
| మంగ | 13 సెప్టెం 2016 | తె. 2.00 | బుధ (వ) పూర్వ ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| శని | 1 అక్టో 2016 | ఉ. 6.33 | బుధ ఉత్తర ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| సోమ | 3 అక్టో 2016 | సా. 5.57 | బుధ కన్యారాశి ప్రవేశం |
| సోమ | 10 అక్టో 2016 | రా. 12.09 | బుధ హస్త నక్షత్ర ప్రవేశం |
| సోమ | 17 అక్టో 2016 | సా. 5.12 | బుధ చిత్త నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 21 అక్టో 2016 | మ. 2.19 | బుధ తులారాశి ప్రవేశం |
| మంగ | 25 అక్టో 2016 | మ. 1.07 | బుధ స్వాతి నక్షత్ర ప్రవేశం |
| బుధ | 2 నవం 2016 | సా.4. 48 | బుధ విశాఖ నక్షత్ర ప్రవేశం |
| బుధ | 9 నవం 2016 | రా. 12.39 | బుధ వృశ్చికరాశి ప్రవేశం |
| శుక్ర | 11 నవం 2016 | తె. 4.07 | బుధ అనూరాధ నక్షత్ర ప్రవేశం |
| శని | 19 నవం 2016 | రా. 9.40 | బుధ జ్యేష్ఠ నక్షత్ర ప్రవేశం |
| సోమ | 28 నవం 2016 | రా. 10.12 | బుధ మూలా నక్షత్ర ప్రవేశం |

**బుధ ధనుస్సు రాశి ప్రవేశం**

| | | | |
|---|---|---|---|
| గురు | 8 డిశం 2016 | రా. 9.00 | బుధ పూర్వాషాఢ నక్షత్ర ప్రవేశం |
| గురు | 29 డిశం 2016 | తె. 1.08 | బుధ (వ) మూలా నక్షత్ర ప్రవేశం |
| శని | 21 జన 2017 | మ. 1.11 | బుధ పూర్వాషాఢ నక్షత్ర ప్రవేశం |
| బుధ | 1 ఫిబ్ర 2017 | తె. 4.05 | బుధ ఉత్తరాషాఢ నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 3 ఫిబ్ర 2017 | మ. 1.18 | బుధ మకరరాశి ప్రవేశం |
| శుక్ర | 10 ఫిబ్ర 2017 | ఉ. 8.35 | బుధ శ్రవణా నక్షత్ర ప్రవేశం |
| శని | 18 ఫిబ్ర 2017 | సా. 7.05 | బుధ ధనిష్ఠ నక్షత్ర ప్రవేశం |
| బుధ | 22 ఫిబ్ర 2017 | సా. 6.45 | బుధ కుంభరాశి ప్రవేశం |
| ఆది | 26 ఫిబ్ర 2017 | మ. 2.58 | బుధ శతభిషా నక్షత్ర ప్రవేశం |
| ఆది | 5 మార్చి 2017 | రా. 10.00 | బుధ పూర్వాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| శని | 11 మార్చి 2017 | తె. 2.36 | బుధ మీనరాశి ప్రవేశం |
| ఆది | 12 మార్చి 2017 | సా. 7.19 | బుధ ఉత్తరాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| ఆది | 19 మార్చి 2017 | మ. 2.46 | బుధ రేవతి నక్షత్ర ప్రవేశం |
| సోమ | 27 మార్చి 2017 | ఉ. 7.36 | బుధ అశ్విని నక్షత్ర ప్రవేశం |

**బుధ మేషరాశి ప్రవేశం**

| | | | |
|---|---|---|---|
| మంగ | 23 మే 2017 | ఉ. 11.24 | బుధ ధరణీ నక్షత్ర ప్రవేశం |
| గురు | 1 జూన్ 2017 | సా. 7.48 | బుధ కృత్తిక నక్షత్ర ప్రవేశం |
| శని | 3 జూన్ 2017 | సా. 7.52 | బుధ వృషభరాశి ప్రవేశం |
| శుక్ర | 9 జూన్ 2017 | ఉ. 7.56 | బుధ రోహిణి నక్షత్ర ప్రవేశం |
| గురు | 15 జూన్ 2017 | రా. 8.54 | బుధ మృగశిర నక్షత్ర ప్రవేశం |
| ఆది | 18 జూన్ 2017 | రా. 10.51 | బుధ మిథున రాశి ప్రవేశం |
| బుధ | 21 జూన్ 2017 | రా. 11.49 | బుధ ఆరుద్ర నక్షత్ర ప్రవేశం |
| బుధ | 28 జూన్ 2017 | తె. 4.22 | బుధ పునర్వసు నక్షత్ర ప్రవేశం |

**గురు సంచార రాశి ప్రవేశము :**

| | | | |
|---|---|---|---|
| ఆది | 24 జులై 2016 | రా. 8.35 | గురు ఉత్తర ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| గురు | 11 ఆగష్టు 2016 | రా. 9.27 | గురు కన్యారాశి ప్రవేశం |

| | | | |
|---|---|---|---|
| బుధ | 28 సెప్టెం 2016 | సా. 4.45 | గురు హస్త నక్షత్ర ప్రవేశం |
| ఆది | 4 డిశం 2016 | రా. 8.41 | గురు చిత్త నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 14 ఏప్రిల్ 2017 | మ. 1.48 | గురు (వ) హస్త నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 4 ఆగష్టు 2017 | ఉ. 9.13 | గురు చిత్త నక్షత్ర ప్రవేశం |
| మంగ | 12 సెప్టెం 2017 | ఉ. 6.51 | గురు తులారాశి ప్రవేశం |
| శని | 14 అక్టో 2017 | ఉ. 8.23 | గురు స్వాతి నక్షత్ర ప్రవేశం |
| ఆది | 24 జులై 2016 | రా. 8.35 | గురు ఉత్తర ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| గురు | 11 ఆగ 2016 | రా. 9.27 | గురు కన్యారాశి ప్రవేశం |
| బుధ | 28 సెప్టెం 2016 | సా. 4.45 | గురు హస్త నక్షత్ర ప్రవేశం |
| ఆది | 4 డిశం 2016 | రా. 8.41 | గురు చిత్త నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 14 ఏప్రిల్ 2017 | మ. 1.48 | గురు (వ) హస్త నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 4 ఆగష్టు 2017 | ఉ. 9.13 | గురు చిత్త నక్షత్ర ప్రవేశం |
| మంగ | 12 సెప్టెం 2017 | ఉ. 6.52 | గురు తులారాశి ప్రవేశం |
| శని | 14 అక్టో 2017 | ఉ. 8.23 | గురు స్వాతి నక్షత్ర ప్రవేశం |

**శుక్ర సంచార రాశి ప్రవేశము :**

| | | | |
|---|---|---|---|
| శుక్ర | 1 ఏప్రిల్ 2016 | తె. 3.24 | శుక్ర మీనరాశి ప్రవేశం |
| ఆది | 3 ఏప్రిల్ 2016 | రా. 8.09 | శుక్ర ఉత్తరాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| గురు | 14 ఏప్రిల్ 2016 | మ. 3.18 | శుక్ర రేవతి నక్షత్ర ప్రవేశం |
| సోమ | 25 ఏప్రిల్ 2016 | ఉ. 10.50 | శుక్ర మేషరాశి ప్రవేశం |
| | | | శుక్ర అశ్విని నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 6 మే 2016 | ఉ. 6.38 | శుక్ర భరణి నక్షత్ర ప్రవేశం |
| మంగ | 17 మే 2016 | తె. 2.41 | శుక్ర కృత్తిక నక్షత్ర ప్రవేశం |
| గురు | 19 మే 2016 | సా. 7.45 | శుక్ర వృషభరాశి ప్రవేశం |
| శుక్ర | 27 మే 2016 | రా. 11.00 | శుక్ర రోహిణి నక్షత్ర ప్రవేశం |
| మంగ | 7 జూన్ 2016 | సా. 7.23 | శుక్ర మృగశిర నక్షత్ర ప్రవేశం |
| సోమ | 13 జూన్ 2016 | ఉ. 5.36 | శుక్ర మిథునరాశి ప్రవేశం |
| శని | 18 జూన్ 2016 | మ. 3.50 | శుక్ర ఆరుద్ర నక్షత్ర ప్రవేశం |
| బుధ | 29 జూన్ 2016 | ఉ. 12.19 | శుక్ర పునర్వసు నక్షత్ర ప్రవేశం |
| గురు | 7 జులై 2016 | మ. 3.36 | శుక్ర కర్కాటక రాశి ప్రవేశం |
| ఆది | 10 జులై 2016 | ఉ. 8.41 | శుక్ర పుష్యమి నక్షత్ర ప్రవేశం |
| గురు | 21 జులై 2016 | ఉ. 5.04 | శుక్ర ఆశ్లేష నక్షత్ర ప్రవేశం |
| సోమ | 1 ఆగష్టు 2016 | తె. 1.28 | శుక్ర మఖ నక్షత్ర ప్రవేశం |

**శుక్ర సింహరాశి ప్రవేశం**

| | | | |
|---|---|---|---|
| గురు | 11 ఆగష్టు 2016 | రా. 9.55 | శుక్ర పూర్వ ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| సోమ | 22 ఆగష్టు 2016 | సా. 6.39 | శుక్ర ఉత్తర ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| గురు | 25 ఆగష్టు 2016 | ఉ. 11.53 | శుక్ర కన్యారాశి ప్రవేశం |
| శుక్ర | 2 సెప్టెం 2016 | మ. 3.40 | శుక్ర హస్త నక్షత్ర ప్రవేశం |
| మంగ | 13 సెప్టెం 2016 | మ. 1.07 | శుక్ర చిత్త నక్షత్ర ప్రవేశం |
| సోమ | 19 సెప్టెం 2016 | రా. 12.05 | శుక్ర తులారాశి ప్రవేశం |
| శని | 24 సెప్టెం 2016 | ఉ. 11.12 | శుక్ర స్వాతి నక్షత్ర ప్రవేశం |
| బుధ | 5 అక్టో 2016 | ఉ. 9.54 | శుక్ర విశాఖ నక్షత్ర ప్రవేశం |
| గురు | 13 అక్టో 2016 | మ. 3.27 | శుక్ర వృశ్చికరాశి ప్రవేశం |
| ఆది | 16 అక్టో 2016 | ఉ. 9.26 | శుక్ర అనూరాధ నక్షత్ర ప్రవేశం |
| గురు | 27 అక్టో 2016 | ఉ. 10.04 | శుక్ర జ్యేష్ఠ నక్షత్ర ప్రవేశం |
| సోమ | 7 నవ 2016 | ఉ. 11.58 | శుక్ర మూలా నక్షత్ర ప్రవేశం |

**శుక్ర ధనుస్సు రాశి ప్రవేశం**

| | | | |
|---|---|---|---|
| శుక్ర | 18 నవం 2016 | మ. 3.51 | శుక్ర పూర్వాషాఢ నక్షత్ర ప్రవేశం |
| మంగ | 29 నవం 2016 | రా. 10.29 | శుక్ర ఉత్తరాషాఢ నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 2 డిశం 2016 | సా. 6.42 | శుక్ర మకరరాశి ప్రవేశం |
| ఆది | 11 డిశం 2016 | ఉ. 9.13 | శుక్ర శ్రవణా నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 23 డిశం 2016 | తె. 2.34 | శుక్ర ధనిష్ఠ నక్షత్ర ప్రవేశం |
| గురు | 29 డిశం 2016 | తె. 2.46 | శుక్ర కుంభరాశి ప్రవేశం |
| బుధ | 4 జన 2017 | ఉ. 6.16 | శుక్ర శతభిషా నక్షత్ర ప్రవేశం |
| మంగ | 17 జన 2017 | తె. 4.31 | శుక్ర పూర్వాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 27 జన 2017 | రా. 8.17 | శుక్ర మీనరాశి ప్రవేశం |
| మంగళ | 31 జన 2017 | సా. 5.19 | శుక్ర ఉత్తరాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| మంగ | 21 ఫిబ్ర 2017 | ఉ. 8.25 | శుక్ర రేవతి నక్షత్ర ప్రవేశం |
| బుధ | 15 మార్చి 2017 | ఉ. 8.11 | శుక్ర (వ) ఉత్తరాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| సోమ | 10 ఏప్రిల్ 2017 | మ. 2.28 | శుక్ర (వ) పూర్వభాద్ర నక్షత్ర ప్రవేశం |
| గురు | 20 ఏప్రిల్ 2017 | రా. 8.26 | శుక్ర ఉత్తరాభాద్ర నక్షత్ర ప్రవేశం |
| సోమ | 15 మే 2017 | రా. 10.35 | శుక్ర రేవతి నక్షత్ర ప్రవేశం |
| బుధ | 31 మే 2017 | ఉ. 8.56 | శుక్ర మేషరాశి ప్రవేశం |

**శుక్ర అశ్విని నక్షత్ర ప్రవేశం**

| | | | |
|---|---|---|---|
| మంగ | 13 జూన్ 2017 | రా. 11.27 | శుక్ర భరణి నక్షత్ర ప్రవేశం |
| సోమ | 26 జూన్ 2017 | సా. 5.11 | శుక్ర కృత్తిక నక్షత్ర ప్రవేశం |
| గురు | 29 జూన్ 2017 | సా. 7.34 | శుక్ర వృషభరాశి ప్రవేశం |

**శని సంచార రాశి ప్రవేశము :**

| | | | |
|---|---|---|---|
| శని | 9 జులై 2016 | రా. 12.30 | శని (వ) అనూరాధ నక్షత్ర ప్రవేశం |
| శని | 17 సెప్టెం 2016 | సా. 5.08 | శని జ్యేష్ఠ నక్షత్ర ప్రవేశం |
| గురు | 26 జన 2017 | సా. 7.31 | శని మూలా నక్షత్ర ప్రవేశం<br>శని ధనుస్సు రాశి ప్రవేశం |
| బుధ | 21 జూన్ 2017 | ఉ. 4.41 | శని (వ) వృశ్చికరాశి ప్రవేశం |

**శని (వ) జ్యేష్ఠ నక్షత్ర ప్రవేశం**

| | | | |
|---|---|---|---|
| గురు | 26 అక్టో 2017 | మ. 3.26 | శని మూలా నక్షత్ర ప్రవేశం<br>శని ధనుస్సు రాశి ప్రవేశం |
| శుక్ర | 2 మార్చి 2018 | రా. 11.34 | శని పూర్వాషాఢ నక్షత్ర ప్రవేశం |
| మంగ | 5 జూన్ 2018 | ఉ. 6.29 | శని (వ) మూలా నక్షత్ర ప్రవేశం |
| మంగ | 27 నవం 2018 | సా. 8.14 | శని పూర్వాషాఢ నక్షత్ర ప్రవేశం |

**రాహు, కేతు సంచార రాశి ప్రవేశము :**

| | | | |
|---|---|---|---|
| శుక్ర | 1 ఏప్రిల్ 2016 | రా. 11.53 | రాహు (వ) పూర్వ ఫల్గుణి నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 5 ఆగష్టు 2016 | సా. 7.15 | కేతు (వ) శతభిషా నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 9 డిశం 2016 | మ. 3.05 | రాహు (వ) మఖ నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 14 ఏప్రిల్ 2017 | ఉ. 10.40 | కేతు (వ) ధనిష్ఠ నక్షత్ర ప్రవేశం |
| శుక్ర | 18 ఆగష్టు 2017 | ఉ. 5.56 | కేతు (వ) మకరరాశి ప్రవేశం |

**రాహు (వ) కర్కాటక రాశి ప్రవేశం**

**రాహు (వ) ఆశ్లేష నక్షత్ర ప్రవేశం**

| | | | |
|---|---|---|---|
| శుక్ర | 22 డిశం 2017 | తె. 1.35 | కేతు (వ) శ్రవణా నక్షత్ర ప్రవేశం |
| గురు | 26 ఏప్రిల్ 2018 | రా. 9.13 | రాహు (వ) పుష్యమి నక్షత్ర ప్రవేశం |
| గురు | 30 ఆగష్టు 2018 | సా. 4.30 | కేతు(వ)ఉత్తరాషాఢ నక్షత్ర ప్రవేశం |

# శ్రీ దుర్ముఖినామ సంవత్సరంలో తెలుగు మాసాధిపతులు

| తెలుగు నెలలు | అశ్వ, మఘ, మూల | భరణి, పుబ్బ, పూ.షా. | కృత్తిక, ఉత్తర, ఉ.షా | రోహిణి, హస్త, శ్రవణ | మృగశిర, చిత్త, ధనిష్ఠ | ఆరుద్ర, స్వాతి, శతభిషం | పున, విశాఖ, పూ.భాద్ర | పుష్యమి, అనూరాధ, ఉ.భాద్ర | ఆశ్రేషా, జ్యేష్ఠ, రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చైత్ర (2016) | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 |
| వైశాఖ | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 |
| జ్యేష్ఠ | రవి 1 | రాహు 3 | కేతు 3 | శని 5 | కుజ 7 | బుధ 0 | గురు 2 | చంద్ర 4 | శుక్ర 6 |
| ఆషాఢ | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 |
| శ్రావణం | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 |
| భాద్రపదం | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 |
| ఆశ్వయుజం | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 |
| కార్తీకం | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 |
| మార్గశీర్షం | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 |
| పుష్యం | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 |
| మాఘం | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 |
| ఫాల్గుణం | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 5 | కుజ 0 | బుధ 2 | గురు 4 |
| చైత్ర (2017) | బుధ 2 | గురు 4 | చంద్ర 6 | శుక్ర 8 | రవి 1 | రాహు 3 | కేతు 5 | శని 7 | కుజ 0 |

# మాసాధిపతుల ఫలములు

1. **రవి :-** పనుల తొందర, ఒత్తిడి, ఆలస్యం, తూర్పు ప్రయాణం, దుఃఖం, శిరోవేదన, భయం, రాజభీతి, నిరుత్సాహం, అశాభంగం, శ్రమ, కోపం.

2. **చంద్రుడు :-** మాతృసౌఖ్యం, దధ్యన్నసౌఖ్యం, స్త్రీ సంభోగ సుఖం, మనోనైర్మల్యం, ఆనందం, గౌరవం, కృషి వ్యాపారాదులు, పెద్దల దర్శనం, సర్వకళాత్మభావం, లలిత కళల పట్ల కౌశల్యం, సప్త సంతాన పోషణం.

3. **గురు :-** ధనలాభం, గురు ఆదరణం, జ్ఞానం, సుఖం, భార్యకు ఆభరణములు, సంతాన సౌఖ్యం, పడమరకు ప్రయాణం, మంచి వస్త్రధారణం, స్థిర వృద్ధి, శాస్త్ర విజ్ఞానం, ధైర్యం, సర్వశుభం, శివదర్శనం.

4. **రాహు :-** అశ్రుత, శ్మశాన దర్శనం, దైన్యం, వ్యసనం, కడుపునందు, బొడ్డునందు వ్యాధి, కోపం, ధననష్టం, ప్రయాణంలో దొంగల భయం, గుండెజబ్బు, క్షయ, ఉబ్బసము వంటి దీర్ఘరోగ బాధ.

5. **బుధ :-** బంధుగోష్ఠి, విద్వజ్జన సంగమం, వర్తకజన స్నేహం, వ్యాపారవృద్ధి, భవిష్యత్ ఆలోచనలు, హాస్య సంభాషణ, ధనలాభం, ప్రయత్నసిద్ధి.

   **శాంతి :-** విష్ణుభక్తి, విష్ణుస్తోత్రములు, పూజలు

6. **శుక్రుడు :-** తెల్లని బట్టలు ధరించుట, పరిమళ ద్రవ్యోపయోగము, స్త్రీ సంభోగ సౌఖ్యం, నూతన పరిచయములు, స్థిరలాభం, మధుర పదార్థలాభం, ధనలాభం, స్త్రీ లాభం, గోలాభం, సర్వసుఖం, లక్ష్మీ స్తోత్రం.

7. **కేతువు :-** బంధువైరం, దుష్ట స్త్రీ పీడ, మనశ్చాంచల్యం, దైవభక్తి, అతి కోపం, దీర్ఘతర్కం, పుణ్యకర్మలు, స్వల్పాధికారం కలుగుతుంది. పామువల్ల ప్రమాదం. తరచు నష్ట ద్రవ్యలాభం. ప్రాయశ్చిత్తాదివ్రత కర్మాచరణం, క్రతుదీక్షా తత్పరత.

8. **శని :-** ఏనుగుల వలన జంతువుల వలన భయం, నల్లని వస్త్ర లాభం, కోపం, పరపీడ, నీచభయం, దుర్వార్తా శ్రవణం, నీచ కార్యాచరణము, బుద్ధిమాంద్యం, అనవసర ప్రసంగం, విరక్తి, గర్భశూల, గుండెపోటు.

   **శాంతి :-** రుద్రాభిషేకం, తైలాభిషేకం, శనిస్తుతి.

9. **కుజుడు :-** అధికారుల బెడద, ఆయుధముల వలన భయం, కార్యనాశనం, మనస్తాపం, మనఃకాఠిన్యం, దక్షిణ నైఋతి దిశాప్రయాణం, ఔషధసేవ, ధనమునకు ఇబ్బంది, అకారణ విరోధం, రక్తదర్శనం, ఒత్తిడులు, పనులలో ఆటంకం.

   **శాంతి :-** శివునకు అభిషేకం, కుజస్తుతి, దుర్గా స్తోత్రం.



# మేషరాశి ఫలితములు

| ఆదాయం - 2 | వ్యయం - 8 | రాజపూజ్యం - 1 | అవమానం - 7 |
|---|---|---|---|



**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం :** జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.
2. **గోచార ఫలితం** జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం. అంటే మిశ్రమ ఫలితం. ఇదే విధంగా గోచారం బాగుండి జాతకదశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోషఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.

## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - పంచమంలో ఉన్నందున కుటుంబ వాతావరణం అనుకూలంగా ఉంటుంది. ఒక శుభవార్త మీ ఇంట్లో ఆనందాన్ని నింపుతుంది. అవసరానికి డబ్బు చేతికి అందుతుంది. చేపట్టే పనుల్లో విజయం సాధిస్తారు. చేపట్టిన పని స్వల్ప ప్రయత్నంతోనే పూర్తయిపోతుంది. కీలక వ్యవహారాల్లో ముందడుగు వేస్తారు. నిర్ణయం మీకు అనుకూలంగా వస్తుంది. 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2107 వరకు శని - అష్టమంలో ఉండుటచే పనులుకావు. శాంతంగా మాట్లాడాలి. లేనిచో గోడవలు వస్తాయి. ఆరోగ్య సమస్యలు వస్తాయి. ఆరోగ్యంపై శ్రద్ధ వహించాలి. ప్రతి విషయంలోనూ ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. ఆర్థికంగా నియంత్రణ అవసరం. ఆర్థిక నష్టం, అపమృత్యుదోషం తొలగటానికి శని ధ్యానశ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు రాహువు - పంచమంలో ఉండుటచే అకాలభోజనం, సంతానంతో గొడవలు సూచితం. రాజగౌరవం, ప్రభుసన్మానాదులు కలవు. రాహు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు - లాభంలో ఉంటే పశు లాభం, భోజన సౌఖ్యం ఉంటుంది. వస్తు, వస్త్ర ప్రాప్తితో పాటు లాభాలు, విజయాలు చేకూరుతాయి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు -

షష్ఠంలో ఉన్నందున కుటుంబ సభ్యులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. ఇంట బయట జాగ్రత్తగా వ్యవహరించాలి. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 26-1-2017 నుండి 21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని - నవమంలో ఉన్నందున కుటుంబ సభ్యులకు అనారోగ్య సమస్యలు వస్తాయి. శ్రమ అధికంగా ఉంటుంది. కొద్దిగా సుఖం, ధనం ఉంటాయి. శని ధ్యానశ్లోకం చదువుకోవాలి.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. ఉద్యోగంలో స్థానచలనం, ఖర్చులు పెరుగుతాయి. చేపట్టిన పనులు కొద్దిగా ఆలస్యం అవుతాయి. అప్పుల విషయంలో జాగ్రత్త. శ్రమ అధికమౌతుంది. గృహ రక్షణ విషయంలో భద్రతను పెంచాలి. బంధుమిత్రులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. అనారోగ్య సమస్యలు రాకుండా చూసుకోండి. రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే :** శుక్రుని శుభస్థితివల్ల చేపట్టిన పనిలో విజయం సాధిస్తారు. స్వల్ప ధనలాభం, మనఃసంతోషం ఉంటాయి. రవి, కుజ, బుధుల దోషం ఉంది. శ్రమ అధికమౌతుంది. ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. బంధుమిత్రులతో వివాదాలకు పోకూడదు. ఆర్థిక నియంత్రణ అవసరం. గిట్టనివారితో జాగ్రత్త. విదేశీయానం సూచితం. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** శుక్రుని శుభస్థితివల్ల కుటుంబ సభ్యులతో ఆనందంగా గడుపుతారు. ఆరోగ్యం ఫర్వాలేదనిపిస్తుంది. మీ పనితీరుకి గుర్తింపు లభిస్తుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. చేపట్టే పనిలో ఆటంకాలు ఎదురౌతాయి. వ్యాపారంలో జాగ్రత్తలు అవసరం. ఆర్థికపరంగా జాగ్రత్తలు తీసుకోవాలి. విదేశీయానం సూచితం. కొందరి ప్రవర్తన ఇబ్బందనిపిస్తుంది. బంధువులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. రవి, కుజ, బుధ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జులై :** రవి, శుక్రుల శుభస్థితివల్ల ఆరోగ్యం అన్నివిధాలా సహకరిస్తుంది. సంతోషం, బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. శత్రువులపై విజయం సాధిస్తారు. తలపెట్టిన పనిలో విజయం సాధిస్తారు. వ్యాపారంలో ఆర్థిక లాభాలు ఉంటాయి. కుజ, బుధుల దోషం ఉంది. ఒక చెడువార్త ఇబ్బందనిపిస్తుంది. ఇంటా, బయటా కలహ సూచన. అనవసర ఖర్చులు పెరుగుతాయి. పై అధికారులతో జాగ్రత్తగా మెలగాలి. కుజ, బుధ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** శుక్రుని శుభస్థితివల్ల విందు, వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. ఆస్తిని వృద్ధి చేస్తారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. ప్రయాణంలో ఆటంకాలు ఎదురౌతాయి. ఆరోగ్యపరంగా జాగ్రత్తలు తీసుకోవాలి. చేయని తప్పుకు నిందపడాల్సి వస్తుంది. విదేశీ ప్రయాణాలు సూచితం. కార్యహాని, ఋణబాధ, మనోవిచారం సూచితం. రవి, కుజ, బుధ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** బుధుని శుభస్థితివల్ల కార్యసాధనలో ఎన్ని ఆటంకాలు ఎదురైనా మనోధైర్యంతో ముందడుగు వేసి సఫలీకృతులౌతారు. విద్య, వినోద సుఖం, వస్త్ర, ధాన్య లాభాలు కలవు. రవి, కుజ, శుక్రుల దోషం ఉంది. కొన్ని విషయాల్లో చంచల బుద్ధివల్ల మనస్తాపం చెందుతారు. విదేశీయానం సూచితం. అప్పులు బాధిస్తాయి. శత్రుపీడ, కుటుంబ సభ్యుల వలన శ్రమ పెరుగుతుంది. రవి, కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** రవి శుభస్థితివల్ల ప్రతికూల పరిస్థితులు ఎదురైనప్పటికీ ఆత్మస్థైర్యంతో అనుకున్నది సాధిస్తారు. దేహారోగ్యం కలదు. వస్త్ర, ధాన్యాది లాభములు కలవు. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. ప్రతీ విషయంలోనూ ఆచి, తూచి వ్యవహరించాలి. ప్రతి చిన్న విషయాన్ని భూతద్దంలోంచి చూడకండి. ఆ ధోరణి అపార్థాలకు దారితీస్తుంది. కోపాన్ని అదుపులో ఉంచుకోవాలి. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**నవంబరు :** శుక్రుని శుభస్థితివల్ల దుఃఖనాశనం, మహాసౌఖ్యం, బంధుమిత్రులను కలుస్తారు. ఒక ముఖ్యమైన పనికై పెద్దలను కలుస్తారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. మీ ప్రత్యర్థులు మీ ఆశలపై నీళ్లు చల్లే ప్రయత్నం చేస్తారు. మీపై అధికారులతో జాగ్రత్తగా ఉండాలి. డబ్బులను పొదుపుగా వాడుకోవాలి. విరోధాలకు దూరంగా ఉండాలి. కుటుంబంలో ఒకరికి అనారోగ్యం సూచితం. రవి, కుజ, బుధ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** శుక్రుని శుభస్థితివల్ల అనుభవజ్ఞుల సలహాలతో విజయం సాధిస్తారు. వస్త్రలాభం కలదు. గురుభక్తి, స్వధర్మం, చిత్తశుద్ధి కలిగి ఉంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. వృథా ప్రయాణాల వల్ల నిరుత్సాహం, విచారం, కలుగుతాయి. ఒక వార్త మీ మనస్సుని కలవరపెడుతుంది. అల్పాహారం వల్ల అనారోగ్య సమస్యలు తలెత్తుతాయి. శత్రువులు పెరుగుతారు. మీ ప్రమేయం లేకుండానే మిమ్మల్ని నిందిస్తారు. రవి, కుజ, బుధ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** శుక్ర, కుజుల శుభస్థితివల్ల కీర్తి ప్రతిష్ఠలు సంపాదిస్తారు. అనుకున్న పనులు నెరవేరుతాయి. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. సంతోషం, ధన, వస్త్రలాభాలు కలవు. రవి, బుధుల దోషం ఉంది. తెలియక కొన్ని పొరపాట్లు చేస్తారు. కలహ సూచన. ఆలోచించి ఖర్చు పెట్టాలి. రవి, బుధ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** రవి శుభస్థితివల్ల ఆరోగ్యం ఫర్వాలేదనిపిస్తుంది. బంధు మిత్రులను కలుస్తారు. ఒక విషయంలో పెద్దలను కలుస్తారు. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. మీకు సంబంధించిన విషయాల్లో జాగ్రత్తగా ఉండాలి. పనులయందు ఆటంకాలు ఎదురౌతాయి. మానసిక ప్రశాంతత తగ్గుతుంది. గృహరక్షణ విషయంలో జాగ్రత్తలు తీసుకోవాలి. ధనక్షయం, సంచారం, నిరుత్సాహం సూచితం. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** రవి, బుధుల శుభస్థితివల్ల ఇంట్లో శుభ కార్యక్రమాలు జరుగుతాయి. సంతోషకరమైన వార్త వింటారు. ఆరోగ్యం సహకరిస్తుంది. ఆత్మీయులు ప్రేమాభిమానాలు కురిపిస్తారు. ఉల్లాసంగా, ఉత్సాహం ఉంటారు. సానుకూల పరిస్థితులు ఏర్పడతాయి. ధనలాభం సూచితం.

కుజ, శుక్రుల దోషం ఉంది. వివాదాలవల్ల ప్రశాంతత లోపిస్తుంది. వృథా సంచారం, పనులయందు ఆటంకాలు కలుగుతాయి. మానసిక ఆందోళన పెరుగుతుంది. అనవసర ఖర్చులు తగ్గించుకోవాలి. కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.



# వృషభరాశి ఫలితములు

| ఆదాయం - 11 | వ్యయం - 14 | రాజపూజ్యం - 4 | అవమానం - 7 |
|---|---|---|---|

**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం :** జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.
2. **గోచార ఫలితం :** జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం అంటే మిశ్రమ ఫలితం. ఇదేవిధంగా గోచారం బాగుండి జాతక దశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోష ఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.

## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - చతుర్థంలో ఉండుటచే విదేశీ ప్రయాణాలు మాత్రం ఫలిస్తాయి. కొత్త పనులు ఆరంభించేటప్పుడు అన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. లేనిచో ఖర్చులు పెరుగుతాయి. అలసట ఎక్కువ. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2017 వరకు శని - సప్తమంలో ఉన్నందున ఖర్చులు పెరుగుతాయి. ధనం విషయంలో జాగ్రత్త అవసరం. ఆరోగ్యంపై శ్రద్ధ తీసుకోవాలి. విదేశయోగం ఉంటుంది. శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 8-8-2017 వరకు రాహువు - చతుర్థంలో ఉన్నందున మనస్సు అటూ ఇటూ పోకుండా చూసుకోవాలి. రాహు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 8-8-2017 వరకు కేతువు - దశమంలో ఉన్నందున చేపట్టే పనుల్లో విజయం సాధిస్తారు. భోజన సౌఖ్యం సంతోషం కలదు. శరీరబలం పెరుగుతుంది. సర్వత్రా సుఖం లభిస్తుంది. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు పంచమంలో ఉన్నందున కుటుంబ వాతావరణం అనుకూలంగా ఉంటుంది. ఒక శుభవార్త మీ ఇంట్లో ఆనందాన్ని నింపుతుంది. అవసరానికి డబ్బు చేతికి అందుతుంది. చేపట్టే పనుల్లో విజయం సాధిస్తారు. చేపట్టిన పని స్వల్ప ప్రయత్నంతోనే పూర్తయిపోతుంది. కీలక వ్యవహారాల్లో

ముందడుగు వేస్తారు. నిర్ణయం మీకు అనుకూలంగా వస్తుంది. 26-1-2017 నుండి 21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని - అష్టమంలో ఉండుటచే పనులు నిదానిస్తాయి. శాంతంగా మాట్లాడాలి. లేనిచో గొడవలు వస్తాయి. ఆరోగ్య విషయంలో జాగ్రత్త. ఆరోగ్యంపై శ్రద్ధ వహించాలి. ప్రతి విషయంలోనూ ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. ఆర్థికంగా నియంత్రణ అవసరం. ఆర్థిక బలానికి, అపమృత్యు దోషం తొలగటానికి శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** రవి, శుక్ర, బుధులవల్ల ఆర్థికాభివృద్ధి ఉంటుంది. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. మధుర పదార్థాలు స్వీకరిస్తారు. ఆరోగ్యం సహకరిస్తుంది. మీ మీ రంగాలలో విజయం సాధిస్తారు. కీర్తి పెరుగుతుంది. ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉంటారు. కుజ దోషం ఉంది. కోపాన్ని అదుపులో పెట్టుకోండి.

**మే :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంటుంది. చాలా జాగ్రత్తగా ఉండాల్సిన సమయం. ఆర్థికపరమైన జాగ్రత్తలు అవసరం. ఆవేశాలకు పోకూడదు. సౌఖ్యహాని, శ్రమ అధికమవుతుంది. పనులయందు విజయం కోసమై రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** శుక్రుని శుభస్థితివల్ల కుటుంబ సభ్యుల సలహాలతో విజయాలు సాధిస్తారు. స్వల్ప ధనలాభం, మనః సంతోషం కలుగుతాయి. రవి, కుజ, బుధుల దోషం ఉంది. శారీరక శ్రమ పెరుగుతుంది. ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. వివాదాలకు దూరంగా ఉండాలి.

**జులై :** కుజ, బుధ, శుక్రుల శుభస్థితివల్ల వృత్తి, ఉద్యోగాల్లో అనుకూల పరిస్థితులు ఉంటాయి. వస్త్ర, ధాన్య, ధన లాభాలు పొందుతారు. మనసికంగా ఉల్లాసంగా ఉంటారు. ధర్మచింతనతో వ్యవహరిస్తారు. ఆరోగ్యం సహకరిస్తుంది. గొప్పవారితో పరిచయం ఏర్పడుతుంది. కుటుంబ సభ్యులతో ఆనందంగా గడుపుతారు. నలుగురికీ ఆదర్శంగా నిలుస్తారు. రవి దోషం ఉంది. చెడు సహవాసం చేయరాదు. చిన్న చిన్న అనారోగ్య సమస్యలు ఇబ్బంది పెడతాయి. వ్యాపారంలో ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. రవి ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల ఆరోగ్యం అన్ని విధాలా సహకరిస్తుంది. బంధుమిత్రులతో సంతోషంగా గడుపుతారు. అర్థలాభం. అనుకున్న పనులు నెరవేరతాయి. మీ బుద్ధిబలంతో కీలక సమస్యలను పరిష్కరించి అందరి మన్ననలను పొందుతారు. మాతృసౌఖ్యం, ధనధాన్యవృద్ధి, సన్మానం, సుఖం, విద్యావంతులతో పరిచయాలు ఏర్పడతాయి. కుజ దోషం ఉంది. కుజ ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** శుక్రుని శుభస్థితివల్ల ధనధాన్యసమృద్ధి, లాభం, సుఖం, భోజన సౌఖ్యం ఉంటుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. కుటుంబ సభ్యులతో వాగ్వాదాలకు పోకూడదు. ప్రయాణంలో జాగ్రత్తలు అవసరం. కోపం అదుపులో పెట్టుకోవాలి. ఆరోగ్య విషయంలో జాగ్రత్త. రవి, కుజ, బుధ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** బుధుని శుభస్థితివల్ల మాతృసౌఖ్యం, సంతోషం, ధనధాన్యవృద్ధి, బుద్ధిబలం, కార్యసిద్ధి, రవి, కుజ, శుక్రుల దోషం ఉంది. బంధుమిత్రులతో విభేదాలు రాకుండా జాగ్రత్త వహించండి. చంచల బుద్ధి స్వభావం ఇబ్బంది పెడుతుంది. రవి, కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**నవంబరు :** రవి, బుధుల శుభస్థితివల్ల అనుకున్న పని నెరవేరుతుంది. ఆరోగ్యం సహకరిస్తుంది. సంతోషంగా గడుపుతారు. వస్త్ర, ధాన్యాది లాభములు, మనోధైర్యం, విద్య, వినోదసుఖం కలుగుతాయి. కుజ, శుక్రుల దోషం ఉంది. ఆటంకాలకు భయపడవద్దు. ఆర్థిక విషయాల్లో ఆచి తూచి వ్యవహరించండి. కోపం అదుపులో పెట్టుకోండి. కొన్ని సంఘటనలు భయాందోళనలను కలిగిస్తాయి. కుజ, శుక్రుల ధ్యానశ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** శుక్రుని స్థితివల్ల బంధుమిత్రులను కలుస్తారు. అధికారుల సహాయంతో ఒక పని పూర్తి చేస్తారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. ఆరోగ్యంపై శ్రద్ధ వహించాలి. కుటుంబ సభ్యులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. రవి, కుజ, బుధ ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. మాట పట్టింపులకు పోకూడదు. వృథా ప్రయాణాలు చేయకండి. శత్రువులతో జాగ్రత్త. ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేయరాదు. మాటల విషయంలో జాగ్రత్త. ఆర్థిక నియంత్రణ అవసరం. రవి, కుజ, బుధ, శుక్ర ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల ఆరోగ్యం సహకరిస్తుంది. ఆర్థికంగా బాగుంటుంది. ధైర్యంతో ముందడుగు వేసి అనుకున్న పనిని పూర్తి చేయగలుగుతారు. కీర్తి పెరుగుతుంది. సంతోషంగా గడుపుతారు. భోజన సౌఖ్యం ఉంది. రవి, బుధుల దోషం ఉంది. అనవసర ఖర్చులు పెరుగుతాయి. రవి, బుధ, ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** రవి, కుజ, శుక్రుల శుభస్థితివల్ల వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల్లో జయకేతనం ఎగురవేస్తారు. శ్రమకు తగ్గ ఫలితం లభిస్తుంది. ఆర్థికంగా విజయాలు సాధిస్తారు. ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులతో సంతోషంగా గడుపుతారు. రాజదర్శన సల్లాపములు, సుసౌఖ్యం, ధైర్యం, శరీరబలం, కీర్తి, భోజన సౌఖ్యం లభిస్తాయి. బుధుని దోషం ఉంది. కుటుంబ విషయాల్లో ఓర్పు అవసరం. బుధ ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.



# మిథునరాశి ఫలితములు

| ఆదాయం - 14 | వ్యయం - 11 | రాజపూజ్యం - 7 | అవమానం - 7 |
|---|---|---|---|

**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం** : జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.
2. **గోచార ఫలితం** :జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం అంటే మిశ్రమ ఫలితం ఉంటుంది. ఇదే విధంగా గోచారం బాగుండి జాతక దశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోష ఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.

## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - తృతీయంలో ఉన్నందున మాట విలువను కాపాడుకోవాలి. బంధువులతో గొడవలు తెచ్చుకోకండి. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల్లో ఓర్పు అవసరం. ఆస్తిని వృద్ధి చేయడంలో ఇబ్బందిపడతారు. ఆర్థికపరంగా నెమ్మదిస్తారు. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2017 వరకు శని - షష్ఠంలో ఉన్నందున చేపట్టే పనులలో విజయం సాధిస్తారు. బంధుమిత్రులను కలిసి స్థిర నిర్ణయాలు తీసుకుంటారు. ఒక సంఘటన లేదా ఒక వార్త మీ ఆత్మవిశ్వాసాన్ని పెంచుతుంది. మీరు వేసే భవిష్యత్ ప్రణాళికలు అనుకూలిస్తాయి. ధనధాన్యాలు సమృద్ధిగా ఉంటాయి. సొంత ఇంటికి సంబంధించిన పనులను మొదలుపెడతారు. గృహప్రాప్తి ఉంది. ఆస్తిని వృద్ధి చేస్తారు. 30-1-2016 నుండి 18-8-2017 వరకు రాహువు - తృతీయంలో ఉన్నందున ఆరోగ్యం కుదుటపడుతుంది. ధనలాభం కలుగుతుంది. కీర్తి పెరుగుతుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. సోదరులతో అనుకూలంగా ఉండాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు - నవమంలో ఉన్నందున చేపట్టే పనుల్లో అభివృద్ధి తక్కువ. ప్రయాణాలు చేస్తారు. కేతు ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు - చతుర్థంలో ఉండుటచే విదేశీ ప్రయాణాలు మాత్రం యోగిస్తాయి. గురు ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 26-1-2017 నుండి 21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని - సప్తమంలో ఉన్నందున ఖర్చులు పెరుగుతాయి. ఆరోగ్యంపై శ్రద్ధ తీసుకోవాలి. విదేశయోగం ఉంటుంది. శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** రవి, కుజుల శుభస్థితివల్ల ధనలాభం, మంచి ఆరోగ్యం, సుసౌఖ్యం, బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. అధికారుల సహకారం లభిస్తుంది. వస్త్ర, ధాన్య, ధనలాభాలుంటాయి. కీర్తి పెరుగుతుంది. మంచి పనులు చేస్తారు. మానసిక సంతోషాన్ని పొందుతారు. బుధ, శుక్రుల దోషం ఉంది. కుటుంబ సభ్యులతో ఓర్పు అవసరం. అనవసర ఖర్చులు తగ్గించుకోండి. బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే :** రవి, కుజ, బుధ, శుక్రుల శుభస్థితివల్ల విజయ సోపానాలను అధిరోహిస్తారు. సమాజంలో కీర్తి పెరుగుతుంది. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. ఒక తీపి వార్తను వింటారు. వస్త్ర, ధాన్య, ధనలాభాలుంటాయి. బంధుమిత్రుల నుంచి సానుకూల స్పందన ఉంటుంది. మనోల్లాసం, ధర్మసిద్ధి, మంచి ఆరోగ్యం, ఆనందం, ఉత్సాహం, సుఖం ఉంటాయి. ఇష్టదైవ ప్రార్థన చేయడం ద్వారా మరింత శుభఫలితాలు పొందుతారు.

**జూన్ :** కుజ, బుధుల శుభస్థితివల్ల ధర్మాచరణ ద్వారానే కీర్తి, విజయం లభిస్తుంది. వస్త్ర, ధాన్య, ధనలాభాలుంటాయి. ఆరోగ్యం బాగుంటుంది. మానసిక ఆనందం కలిగి ఉంటారు. ఉత్సాహంగా పనిచేస్తారు. బంధువుల సహకారం లభిస్తుంది. రవి, శుక్రుల దోషం ఉంది. ప్రతి విషయంలో అతి జాగ్రత్తగా ఉండాలి. రవి, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జులై :** శుక్రుని శుభస్థితివల్ల లక్ష్యసాధనలో ఆటంకాలు ఎదురైనా పట్టుదలతో విజయాన్ని సాధిస్తారు. స్వల్ప ధనలాభం, రవి, కుజ, బుధుల దోషం ఉంది. శారీరక శ్రమ పెరుగుతుంది. అయినవారితో జాగ్రత్త. అకాలభోజనం వల్ల అనారోగ్య సమస్యలు తలెత్తకుండా చూసుకోండి. గిట్టనివారు తప్పుదోవ పట్టిస్తారు. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల వస్త్ర, ధాన్య, ధనలాభాలుంటాయి. యశస్సు, మనోల్లాసం, ధర్మసిద్ధి, వ్యాపారం లాభాల బాటలో నడుస్తుంది. శత్రువులపై విజయం సాధిస్తారు. రవి, బుధుల దోషం ఉంది. దుష్ట జన సహవాసం వల్ల మనస్తాపానికి గురవవచ్చు జాగ్రత్త. అనవసర ఖర్చులు పెంచుకోకండి. అధికారులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. సంకుచిత విమర్శలని పట్టించుకోకండి. బుద్ధిమాంద్యం వల్ల కొత్త సమస్యలు ఎదురౌతాయి. రవి, బుధుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** రవి, కుజ, బుధ, శుక్రుల శుభస్థితివల్ల విజయం, విజ్ఞానం రెండూ లభిస్తాయి. మీదైన రంగంలో ప్రగతిని సాధిస్తారు. గౌరవ సన్మానాలు అందుకుంటారు. అదృష్టం వరిస్తుంది. ఆరోగ్యం సహకరిస్తుంది. ఆర్థికంగా పుంజుకుంటారు. బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. కుటుంబ సభ్యులకు కలిసివచ్చే కాలం. బుద్ధిబలంతో సమస్యలను అధిగమిస్తారు. ఆధ్యాత్మిక చింతనతో మానసిక ప్రశాంతత లభిస్తుంది.

**అక్టోబరు :** శుక్రుని శుభస్థితివల్ల లాభం, సుఖము, భోజన సౌఖ్యం ఉంటుంది. రవి, కుజ, బుధుల వల్ల కుటుంబ వ్యక్తులతో సమాచార లోపం రాకుండా చూసుకోవాలి. మోసకారి మనుషులకు దూరంగా ఉండాలి. మనోవిచారం కలుగుతుంది. ప్రయాణంలో జాగ్రత్తలు తీసుకోవాలి. ఎలాంటి పరిస్థితులలోనూ ఆవేశానికి గురికాకండి. ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. ఖర్చులు తగ్గించుకోవాలి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**నవంబరు :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. అలసట ఎక్కువ. జాగ్రత్త పడకపోతే ఖర్చులు అధికమవుతాయి. అడుగడుగునా ఆటంకాలు తొంగిచూస్తుంటాయి. కొన్ని విషయాల్లో స్పష్టత లోపిస్తుంది. అయినా కూడా విజయం మీదే అవుతుంది. నోటిని అదుపులో ఉంచుకోవాలి. శత్రువుల వల్ల ఒకట్రెండు ఆటంకాలున్నా అవి మిమ్మల్ని ఏమీ చేయలేవు. దగ్గరివారి వల్ల మోసం జరిగే ఆస్కారం ఉంది. ఆరోగ్యమే మహాభాగ్యమని మరువరాదు. రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** రవి శుభస్థితివల్ల మీ శ్రమకూ, మీలోని నిజాయితీకి గుర్తింపు లభిస్తుంది. ఆరోగ్యం ఫరవాలేదనిపిస్తుంది. వస్త్ర ధాన్యాది లాభములుంటాయి. కుజ, బుధ, శుక్రుని దోషం ఉంది. స్థాన చలనం సూచితం. అప్పుల బాధ ఎక్కువ. అధికారులతో జాగ్రత్తగా వ్యవహరించండి. మితభాషణం అవసరం. భయాందోళనలకు గురౌతారు. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** శుక్రుని శుభస్థితివల్ల వస్త్రలాభం, గురుభక్తి, స్వధర్మం, చిత్తశుద్ధి, కార్యములందు విజయం. రవి, కుజ, బుధుల వల్ల కుటుంబ సభ్యుల మధ్య విభేదాలు రాకుండా జాగ్రత్త పడాలి. కుటుంబ సభ్యుల ఆరోగ్య విషయంలో శ్రద్ధ చూపండి. ఆర్థికంగా జాగ్రత్తలు అవసరం. పొదుపు పాటించాలి. స్థానచలనం సూచితం. అధికారుల కోపానికి గురవకుండా, ఓర్పుగా వ్యవహరించండి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. బద్ధకం వెంటాడుతుంది. అనుకోని ఖర్చులు వచ్చిపడతాయి. శత్రువులతో జాగ్రత్త. ఉద్యోగంలో స్థానచలనం సూచితం. మీ పై అధికారులతో జాగ్రత్తగా మెలగాలి. కొందరి ప్రవర్తన బాధ కలిగిస్తుంది. రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. ఎవ్వరినీ అతిగా నమ్మకండి. స్వల్ప అనారోగ్య సమస్యలు ఉంటాయి. ఉద్యోగంలో స్థానచలనం సూచితం. గిట్టనివారు మీ ఉత్సాహంపై నీళ్లు చల్లుతారు. ఆర్థిక విషయంలో కొంత శ్రద్ధ అవసరం. దైవధ్యానంతో ఆపదలనుండి బయటపడతారు.



# కర్కాటకరాశి ఫలితములు

| ఆదాయం - 8 | వ్యయం - 11 | రాజపూజ్యం - 3 | అవమానం - 3 |
|---|---|---|---|

**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం :** జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.

2. **గోచార ఫలితం :** జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం అంటే మిశ్రమ ఫలితం. ఇదే విధంగా గోచారం బాగుండి జాతకదశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోషఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.



## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - ద్వితీయంలో ఉన్నందున ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. మంచి పనులు చేయడం ద్వారా కీర్తి పెరుగుతుంది. మీ ప్రతిభకు గుర్తింపు లభిస్తుంది. కీలక విషయాల్లో పెద్దలను కలుస్తారు. నిర్ణయం మీకు అనుకూలంగా వస్తుంది. ఒక వ్యవహారంలో డబ్బు చేతికి అందుతుంది. ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉంటారు. సౌభాగ్యం, ధనలాభం, 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2017 వరకు శని - పంచమంలో ఉన్నందున పనులు ఆలస్యమవుతాయి. శ్రమ అధికంగా ఉంటుంది. కష్టాలు ఎదురౌతాయి. శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు రాహువు - ద్వితీయంలో ఉన్నందున వాక్పౌరుషం వల్ల అనేక కష్టాలు చుట్టుముడతాయి. గౌరవం తగ్గుతుంది. మనస్తాపంతో ధైర్యాన్ని కోల్పోతారు. రాహు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు అష్టమంలో ఉండుటచే కొన్ని

ప్రతికూల పరిస్థితులు ఏర్పడతాయి. ప్రయాణాలు చేస్తారు. కేతు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు - తృతీయంలో ఉన్నందున మాట విలువను కాపాడుకోవాలి. బంధువులతో జాగ్రత్త. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల్లో కష్టిస్తే కానీ సానుకూల పరిస్థితులు కనపడవు. అనుకున్నవి అనుకున్నట్లుగా జరగలేదని కుంగిపోకండి. ఆర్థిక సమస్యలతో జాగ్రత్త. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 26-1-2017 నుండి 21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని - షష్ఠంలో ఉన్నందున చేపట్టే పనులలో విజయం సాధిస్తారు. బంధుమిత్రులను కలిసి స్థిర నిర్ణయాలు తీసుకుంటారు. ఒక సంఘటన లేదా ఒక వార్త మీ ఆత్మవిశ్వాసాన్ని పెంచుతుంది. మీరు వేసే భవిష్యత్ ప్రణాళికలు అనుకూలిస్తాయి. ధనధాన్యాలు సమృద్ధిగా ఉంటాయి. సొంత ఇంటికి సంబంధించిన పనులను మొదలుపెడతారు. గృహప్రాప్తి కలదు. ఆస్తిని వృద్ధి చేస్తారు.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** శుక్రుని శుభస్థితివల్ల చేపట్టిన కార్యములయందు విజయం సాధిస్తారు. వస్త్రలాభం, మంచి ఆరోగ్యం, గురుభక్తి, స్వధర్మం, చిత్తశుద్ధి కలిగి ఉంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. ఖర్చులు అదుపు చేయండి. శ్రమ అధికమౌతుంది. మనస్సు చెడును ఊహిస్తుంది. స్వల్ప అనారోగ్య సమస్యలు ఇబ్బంది పెడతాయి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే :** రవి శుభస్థితివల్ల ఆరోగ్యం బాగుంటుంది. సంపాదనలో స్థిరత్వం వస్తుంది. బంధుమిత్రులను కలుస్తారు. ఒక ముఖ్యమైన విషయంపై పెద్దలను కలుస్తారు. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. శ్రమ అధికమౌతుంది. మాట విలువను కాపాడుకోవాలి. ఆర్థిక భారం పెరగకుండా జాగ్రత్తపడాలి. శత్రువర్గం పెరుగుతుంది. నిరుత్సాహం చెందవద్దు. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** రవి, శుక్రుల శుభస్థితివల్ల ఇళ్ళల్లో శుభకార్యాలు జరుగుతాయి. సంతోషకరమైన వార్తను వింటారు. శ్రమతో కూడిన విజయాలను అందుకుంటారు. కీర్తి పెరుగుతుంది. లక్ష్మీ కటాక్షం ఉంది. విందు వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. కుజ, బుధుల దోషం ఉంది. చెడుసావాసాలు చేయకండి. విరోధులు తప్పుదోవ పట్టిస్తారు జాగ్రత్త. పనుల్లో ఆలస్యం, అమృతం విషం అని మరువకండి. మానసిక ఒత్తిడి పెరుగుతుంది. అకాలభోజనం కుజ, బుధుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జులై :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. మనోబలంతో ముందుకు వెళితే పనులయందు ఆటంకాలు ఎదురైనా అంతిమ విజయం మీదే. మొహమాటం వల్ల సమస్యలు ఎదురౌతాయి. ప్రతి విషయంలోనూ ఆచి తూచి వ్యవహరించాలి. ఖర్చులు అదుపు తప్పకుండా జాగ్రత్త పడాలి. మీ ప్రమేయం లేకుండానే మీమీద నింద పడుతుంది. బంధువులతో అప్రమత్తంగా ఉండాలి. శ్రమ అధికమవుతుంది. గృహరక్షణా విషయంలో భద్రతను పెంచాలి. ఆరోగ్యంపై శ్రద్ధ పెట్టాలి. రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** బుధ, శుక్రుల శుభస్థితివల్ల నలుగురిలో మంచిపేరును సంపాదిస్తారు. కుటుంబంలో ఆనందం నెలకొంటుంది. గొప్పవారితో పరిచయాలు ఏర్పడతాయి. వారి సలహాలు ఉపకరిస్తాయి. వస్త్ర, సుఖ, సంతోషాలతో వర్ధిల్లుతారు. ఆరోగ్యం సహకరిస్తుంది. రవి, కుజుల దోషం ఉంది. శ్రమ పెరుగుతుంది. బంధుమిత్రుల కలహ సూచన. మనోవిచారం కలుగుతుంది. అకాలభోజనం. రవి, కుజుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** శుక్రుని శుభస్థితివల్ల వ్యాపారంలో భవిష్యత్ ప్రణాళికను రచిస్తారు. శత్రువులపై మీదే విజయం. ఒక వ్యవహారంలో డబ్బు చేతికందుతుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. గౌరవం తగ్గుతుంది. దుర్జన సహవాసం, శిరోబాధ, వ్యవసాయ-వ్యాపార నష్టాలు, సమయానికి భోజనం లేకపోవడం, పాపకర్మలు చేయటం జరుగుతుంది. ఆర్థిక నియంత్రణ అవసరం. అధికారుల వలన కోపం, అస్థిర బుద్ధివల్ల లేనిపోని ఇబ్బందులు వస్తాయి. మనస్తాపానికి గురౌతారు. శ్రమ పెరుగుతుంది. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** రవి, కుజ, బుధ, శుక్రుల శుభస్థితివల్ల ఆరోగ్యం సహకరిస్తుంది. బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. కుటుంబ సభ్యులకు మంచి జరుగుతుంది. అనుకున్న పని నెరవేరుతుంది. వస్త్రలాభం, ధన, ధాన్యలాభాలు కలవు. యశస్సు, మనోల్లాసం, ధర్మసిద్ధి కలుగుతాయి. గొప్పవారిని కలుస్తారు. మీ బుద్ధిబలంతో అందరి ప్రశంసలు అందుకుంటారు. గౌరవ సన్మానాలు పొందుతారు.

**నవంబరు :** కుజ, బుధ, శుక్రుల శుభస్థితివల్ల వస్త్ర, ధాన్య, ధన లాభాలుంటాయి. యశస్సు, మనోల్లాసం, సంతోషం, ధర్మసిద్ధి మరియు మాతృసౌఖ్యం ఉంటాయి. సకాలంలో మీ బుద్ధిబలం పనిచేస్తుంది. చేపట్టిన పనిలో విజయం సాధిస్తారు. భోజన సౌఖ్యం కలదు. రవి దోషం ఉంది. ఇంట్లో గొడవలు, మనోవిచారం, సౌఖ్యహాని, కష్టాలు, ప్రయాణంలో ఆటంకాలు కలుగుతాయి. రవి ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** బుధుని శుభస్థితివల్ల వస్త్ర, ధాన్యాది లాభాలుంటాయి. మనోధైర్యం కలిగి ఉంటారు. విద్య, వినోద, కార్యక్రమాల్లో పాల్గొంటారు. రవి, కుజ, శుక్రుల దోషం ఉంది. మోహమాటం వల్ల డబ్బులు ఖర్చవుతాయి. కీలక విషయాల్లో చంచల బుద్ధి ఇబ్బంది పెడుతుంది. ఒక చెడు వార్త మీ మనస్సుని కలవరపెడుతుంది. ఆగ్రహావేశాలకు పోకూడదు. అలసటగా అనిపిస్తుంది. మానసిక ప్రశాంతత తగ్గుతుంది. రవి, కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల మంచి సుఖములు, మనోధైర్యంతో ప్రయత్నించిన కార్యములు సాధించుట, దేహారోగ్యం, సంతోషం, వస్త్ర ధాన్యాది లాభాలు కలుగుతాయి. విద్యా, వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులను కలుస్తారు. ఒక ముఖ్యమైన విషయమై అధికారులను కలుస్తారు. ఫలితం సానుకూలంగా వస్తుంది. కుజ దోషం ఉంది. విదేశ ప్రయాణాలు ఉన్నాయి. ఋణబాధ ఎక్కువ. కుజ ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** బుధ, శుక్రుల శుభస్థితివల్ల పనుల్లో విజయం సాధిస్తారు. వస్త్ర, ధాన్యదిలాభాలుంటాయి. మనోధైర్యం, విద్య, వినోద సుఖం పొందుతారు. మంచి ఆరోగ్యం, గురుభక్తి, స్వధర్మం, చిత్తశుద్ధి కలిగి ఉంటారు. రవి, కుజుల దోషం ఉంది. బంధు మిత్రులతో వాగ్వాదాలకు పోకూడదు. కుటుంబ సభ్యుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. స్థానచలనం సూచితం. రవి, కుజుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** శుక్రుని శుభస్థితివల్ల పనుల్లో విజయం సాధిస్తారు. పెద్దలయందు గౌరవ మర్యాదలు కలిగి ఉంటారు. వస్త్రలాభం పొందుతారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. మిమ్మల్ని విరోధించేవారితో జాగ్రత్త. వృథా ప్రయాణాలతో కాలహరణం అవుతుంది. స్థానచలనం జరగవచ్చు. అకాల భోజనం వల్ల అనారోగ్య సమస్యలు వస్తాయి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.



# సింహరాశి ఫలితములు

| ఆదాయం - 11 | వ్యయం - 5 | రాజపూజ్యం -6 | అవమానం - 3 |
|---|---|---|---|



**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం** : జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.

2. **గోచార ఫలితం** : జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం అంటే మిశ్రమ ఫలితం. ఇదే విధంగా గోచారం బాగుండి జాతకదశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోషఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.

## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - జన్మంలో ఉన్నందున వృత్తి ఉద్యోగ వ్యాపారాల్లో శ్రద్ధగా పనిచేయాలి. అధికారులతో జాగ్రత్త. మాట విలువను కాపాడుకోవాలి. లేనిచో గొడవలు వస్తాయి. ఖర్చులు పెరుగుతాయి. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2017 వరకు శని - చతుర్థంలో ఉన్నందున వాతం లాంటి ఆరోగ్య సమస్యలు రాకుండా ఆహార నియమం పాటించండి. పనులు ఆలస్యమవుతాయి. మనస్తాపం సూచితం కాబట్టి ఆలోచించి వ్యవహరించాలి. స్థానచలనం సూచితం. శని ధ్యానశ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు రాహువు - జన్మంలో ఉన్నందున విదేశీ ప్రయాణాలు చేస్తారు. ఓర్పు అవసరం. మాట విలువను కాపాడుకోవాలి. రాహు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు - సప్తమంలో ఉన్నాడు. స్వల్ప అనారోగ్య సమస్యలు ఉంటాయి. కేతు ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు -ద్వితీయంలో ఉన్నందున ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. మంచిపనులు చేయడం ద్వారా కీర్తి పెరుగుతుంది. మీ ప్రతిభకు గుర్తింపు లభిస్తుంది. కీలక విషయాల్లో పెద్దలను కలుస్తారు. నిర్ణయం మీకు అనుకూలంగా వస్తుంది. ఒక వ్యవహారంలో డబ్బు చేతికి అందుతుంది. ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉంటారు.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** శుక్రుని శుభస్థితివల్ల బంధుమిత్రులను కలుస్తారు. దుఃఖ నాశనం మహాసౌఖ్యం కలుగుతాయి. రవి, కుజ, బుధుల దోషం ఉంది. వృధా ప్రయాణాలు చేస్తారు. నోటిని అదుపులో పెట్టుకోండి. బంధువులతో పొరపొచ్చాలకు పోకండి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే :** శుక్రుని శుభస్థితివల్ల స్వధర్మం, చిత్తశుద్ధితో చేపట్టిన కార్యములందు విజయం సాధిస్తారు. వస్త్రలాభం కలదు. గురువులయందు భక్తి పెరుగుతుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. అనవసర ఖర్చులు ఎక్కువ. స్వల్ప అనారోగ్య సమస్యలు వస్తాయి. రక్తసంబంధీకులతో ఆచి తూచి వ్యవహరించాలి. శ్రమ అధికమవుతుంది. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** రవి శుభస్థితివల్ల ఆరోగ్యం సహకరిస్తుంది. బంధుమిత్రులను కలుసుకుంటారు. ఒక వ్యవహారంలో డబ్బు చేతికి అందుతుంది. రాజు (అధికారులు)ను దర్శించటం మరియూ వారితో మాట్లాడటం జరుగుతుంది. మంచి సౌఖ్యం కలుగుతుంది.. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. కొందరి ప్రవర్తన కారణంగా ఆటంకాలు ఎదురవుతాయి. చెడు తలంపులు వద్దు. కీలక విషయాల్లో నిపుణులను సంప్రదించడం మంచిది. అప్పులు ఇచ్చే విషయంలో జాగ్రత్త. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగును.

**జులై :** రవి, కుజ, బుధ, శుక్రుల శుభస్థితివల్ల ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న ఓ పని విజయవంతంగా పూర్తవుతుంది. ఆర్థిక స్థోమత పెరుగుతుంది. వంశాచారాన్ని ఆచరిస్తారు. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. బంధువులతో ఇల్లు కళకళలాడుతుంది. ఆరోగ్యం బాగుంటుంది. వస్త్రలాభం, మానసిక ఆనందం కలుగుతుంది. కీర్తి పెరుగుతుంది.

**ఆగష్టు :** శుక్రుని శుభస్థితివల్ల శ్రమకు తెలివితేటల్ని జోడించి విజయాల్ని సాధిస్తారు. ధనలాభం, మనఃసంతోషం కలదు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. బంధువులతో గొడవలకు పోరాదు. అనవసర ఖర్చులు పెరుగుతాయి. ఒక సమస్య వల్ల అయినవారు ఎవరో, కానివారు ఎవరో గుర్తిస్తారు. చెడుసావాసాల వల్ల ఇబ్బందులు ఎదురౌతాయి. స్థానచలనం సూచితం. మానసిక చికాకులు పెరుగుతాయి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** బుధ, శుక్రుల శుభస్థితివల్ల గొప్పవారి సాంగత్యం లభిస్తుంది. కీర్తి పెరుగుతుంది. కుటుంబ సభ్యులతో ఆనందంగా గడుపుతారు. ధన, వస్త్రలాభం కలదు. రవి, కుజుల దోషం ఉంది. ఆరోగ్యం, ఫర్వాలేదనిపిస్తుంది. అకాలభోజనం, త్రిప్పట ఎక్కువ. శ్రమ అధికమవుతుంది. రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** శుక్రుని శుభస్థితివల్ల వ్యాపారంలో రాణిస్తారు. ఆర్థిక స్థితి మెరుగుపడుతుంది. శత్రువులపై విజయం సాధిస్తారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. గౌరవం తగ్గుతుంది. చెడు సావాసాల వల్ల ఇబ్బందులు వస్తాయి. స్వల్ప అనారోగ్య సమస్యలు తలెత్తుతాయి. మనస్సు చెడ్డదారి వైపు మళ్ళుతుంది. అయినవారే ఇబ్బంది పెడతారు. మనస్తాపం చెందుతారు. వివాదాస్పద విషయాల్లో పాల్గొనడం సరికాదు. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**నవంబరు :** రవి, శుక్రుల శుభస్థితివల్ల ఆరోగ్యం అన్ని విధాలా సహకరిస్తుంది. విందు, వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులతో సంబంధ బాంధవ్యాలు పెరుగుతాయి. ఆర్థికంగా ప్రయోజనాలుంటాయి. అవరోధాల్ని బుద్ధిబలంతో అధిగమించి అనుకున్నది సాధిస్తారు. గౌరవ మర్యాదలు అందుకుంటారు. విద్యావంతులతో సాంగత్యం ఏర్పడుతుంది. కుజ, బుధుల దోషం ఉంది. అధికారులతో అప్రమత్తంగా ఉండాలి. బుద్ధిమాంద్యం వల్ల కొత్త సమస్యలు తలెత్తుతాయి. వివాదాస్పద వ్యక్తులకు దూరంగా ఉండాలి. ఆరోగ్యం దెబ్బతింటుంది. కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల వస్త్ర, ధాన్య, ధనలాభాలుంటాయి. మనోల్లాసం, ధర్మసిద్ధి, లాభం, సుఖము, భోజన సౌఖ్యం ఉంటుంది. రవి, బుధుల దోషం ఉంది. ఇంటి సభ్యులతో ఓర్పుగా వ్యవహరించండి. ప్రయాణంలో ఆటంకాలు వస్తాయి. రవి, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. అప్రమత్తంగా ఉండాల్సిన సమయం. బద్ధకం ఆవరిస్తుంది. మొహమాటంతో డబ్బులు ఖర్చు చేయకండి. ఆరోగ్యం, పేరుప్రఖ్యాతలు వంటి విషయాల్లో అశ్రద్ధగా వ్యవహరిస్తే ఇబ్బందులు ఎదురౌతాయి. రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** రవి, శుక్రుల శుభస్థితివల్ల శరీర సౌఖ్యం, ప్రయత్న కార్యసిద్ధి, దేహారోగ్యం, సంతోషం, వస్త్ర ధాన్యాది లాభములు, దుఃఖనాశనం, మహాసౌఖ్యం, బంధుమిత్ర సమాగమం, రాజదర్శనం వంటి శుభఫలితాలు ఉంటాయి. కుజ, బుధుల దోషం ఉంది. విదేశ పర్యటనలు, ఋణబాధ, కొన్ని అశుభ ఫలితాలు ఉంటాయి. కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** శుక్రుని శుభస్థితివల్ల దుఃఖనాశనం, మహాసౌఖ్యం పొందుతారు. బంధుమిత్రులను కలుస్తారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. బంధుమిత్రులతో గొడవలు తెచ్చుకోకండి. కుటుంబ సభ్యుల ఆరోగ్యం జాగ్రత్త. కొన్ని సంఘటనల వల్ల ఉత్సాహం తగ్గుతుంది. పనిలో అడ్డంకులు వస్తాయి. విదేశ ప్రయాణాలు చేస్తారు. పై అధికారులతో జాగ్రత్తగా ఉండాలి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.



# కన్యారాశి ఫలితములు

**ఆదాయం - 14** **వ్యయం - 11** | **రాజపూజ్యం - 2** **అవమానం - 6**

**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం** : జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.
2. **గోచార ఫలితం** : జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం... అంటే మిశ్రమ ఫలితం. ఇదే విధంగా గోచారం బాగుండి జాతకదశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోషఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.



## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - వ్యయంలో ఉన్నందున ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. శుభకార్యముల వల్ల ధనవ్యయం చేస్తారు. ఆర్థిక ఇబ్బందులు కూడా ఉంటాయి. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2017 వరకు శని - తృతీయంలో ఉన్నందున విజయం సాధిస్తారు. చేపట్టే పనులను పట్టుదలతో పూర్తిచేస్తారు. మీ పని తీరుకు ప్రశంసలు లభిస్తాయి. బుద్ధిబలం అనుకూలిస్తుంది. స్వస్థానప్రాప్తి కలదు. మంచి ఆరోగ్యంతో పాటు సుఖ సంతోషాలు లభిస్తాయి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు రాహువు - వ్యయంలో ఉండుటచే చేపట్టే పనులు ఆలస్యంగా పూర్తవుతాయి. కంటి సమస్యలు ఇబ్బంది పెడతాయి. విదేశీ ప్రయాణాలు చేస్తారు. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు - షష్ఠంలో ఉండుటచే ధైర్యంగా వ్యవహరిస్తారు. శత్రువులు ఓడిపోతారు. శుభం జరుగుతుంది. భూలాభములు చేకూరుతాయి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు - జన్మంలో ఉన్నందున వృత్తి ఉద్యోగ వ్యాపారాల్లో శ్రద్ధగా పనిచేయాలి. లేనిచో ఇబ్బందులు, ఆటంకాలు, అవమానాలు ఎదురౌతాయి. అధికారులతో జాగ్రత్త. మాట విలువను కాపాడుకోవాలి. లేనిచో గొడవలు వస్తాయి. ఖర్చులు పెరుగుతాయి. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 26-1-2017 నుండి 21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని - శని - చతుర్థంలో ఉన్నందున వాతం లాంటి అనారోగ్య సమస్యలు రావచ్చు. పనులు ఆలస్యమవుతాయి. ఆలోచించి వ్యవహరించాలి. స్థానచలనం సూచితం. శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** కుజుని శుభస్థితివల్ల ధనలాభం కలుగుతుంది. అనుకున్న పని పూర్తవుతుంది. వస్త్ర, ధనలాభాలు ఉన్నాయి. రవి, కుజ, శుక్రుని దోషం ఉంది. బంధుమిత్రులతో విభేదాలు రాకుండా వ్యవహరించాలి. కుటుంబ సభ్యుల ఆరోగ్య విషయంలో జాగ్రత్త. పై అధికారులతో అప్రమత్తంగా ఉండాలి. కోపాన్ని అదుపులో ఉంచుకోవాలి. స్వల్ప అనారోగ్య సమస్యలు ఇబ్బందిపెడతాయి. రవి, కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల అనూహ్యమైన ఆర్థిక ప్రయోజనాలున్నాయి. ఆరోగ్యం ఫర్వాలేదనిపిస్తుంది. చేపట్టిన పనులు సునాయాసంగా పూర్తవుతాయి. సుఖ సౌఖ్యాలతో  సంతోషంగా ఉంటారు. బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. రవి, బుధుల దోషం ఉంది. ఒక చెడు వార్త మనస్తాపానికి గురిచేస్తుంది. శత్రువులతో జాగ్రత్త. అనవసర ప్రయాణాలు చేయాల్సి వస్తుంది. నోరు అదుపులో పెట్టుకోండి. రవి, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల ఆర్థికంగా శుభఫలాలు ఉంటాయి. అనుకున్న పని నెరవేరుతుంది. నూతన వస్త్రప్రాప్తి కలదు. గురుభక్తి, స్వధర్మం, చిత్తశుద్ధి కలిగి ఉంటారు. రవి, బుధుల దోషం ఉంది. చేయని తప్పుకు నింద పడాల్సివస్తుంది. కలహ సూచన. రవి, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జులై :** రవి శుభస్థితివల్ల ధనలాభం, ఆరోగ్యం, బంధుమిత్రుల సమాగమం, రాజు (అధికారులు)ను దర్శించటం, వారితో మాట్లాడటంవల్ల మంచి జరుగుతుంది. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. వత్తిళ్ళు పెరుగుతాయి. నోటిని అదుపులో ఉంచుకోవాలి. చేపట్టిన పనులు ఆలస్యంగా పూర్తవుతాయి. శత్రు వర్గం వారితో జాగ్రత్త. చెడుస్నేహాలు తగ్గించుకోండి. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** రవి, కుజుల శుభస్థితివల్ల తలపెట్టిన కార్యం ఆత్మస్థైర్యంతో పూర్తిచేస్తారు. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. వంశాచారాన్ని గౌరవిస్తారు. ఓ తీపి కబురు మీ చెవిన పడుతుంది. వస్త్ర యోగం కలదు. ధనలాభం ఉంది. ఆరోగ్యం బాగుంటుంది. బుధ, శుక్రుల దోషం ఉంది. ఆటంకాలు ఎదురౌతాయి. గృహ రక్షణ విషయంలో భద్రతను పెంచాలి. శ్రమ పెరుగుతుంది. మనశ్శాంతి కోసం బుధ,  శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల ఆర్థికంగా కలసివస్తుంది. చేపట్టిన పనులు లాభదాయకంగా ముగుస్తాయి. నూతన వస్త్రయోగం ఉంది. మంచి ఆరోగ్యం, మనఃసంతోషం ఉంటాయి. రవి, బుధుల దోషం ఉంది. అందరినీ కలుపుకొని పోవడం అవసరం. వివాదాలకు దూరంగా ఉండండి. గిట్టనివారు తప్పుదోవ పట్టిస్తారు. అనవసర విషయాలపై సమయం వృథా అవుతుంది. రవి, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** శుక్రుని శుభస్థితివల్ల కుటుంబ సభ్యులతో ఆనందంగా గడుపుతారు. కీర్తి పెరుగుతుంది. వస్త్రలాభం ఉంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. బంధుమిత్రులతో వైరం సూచితం. ఖర్చులు పెరుగుతాయి. విచారం, చిన్నపాటి అనారోగ్య సమస్యలు బాధిస్తాయి. ఆవేశపూరిత నిర్ణయాలు వద్దు. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**నవంబరు :** బుధ, శుక్రుల శుభస్థితివల్ల నమ్మకస్తుల సలహాలతో వ్యాపారంలో ఆర్థిక లాభాలు అందుకుంటారు. శత్రువులపై విజయం సాధిస్తారు. సంతోషాన్నిచ్చే సంఘటనలు చోటుచేసుకుంటాయి. రవి, కుజుల దోషం ఉంది. గౌరవం తగ్గుతుంది. ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల తల్లి తరఫు బంధువుల సహకారం లభిస్తుంది. సుఖసంతోషాలతో గడుపుతారు. ఆదాయమార్గాలను పెంచుకుంటారు. మీ తెలివితేటలతో అందరినీ మెప్పిస్తారు. గౌరవం లభిస్తుంది. ఎంతో కాలంగా ఎదురుచూస్తున్న ఓ పని పూర్తవుతుంది. కుటుంబ సభ్యులకు మంచి కాలం. మిమ్మల్ని ప్రభావితం చేసేవారితో పరిచయం ఏర్పడుతుంది. ఆరోగ్యం సహకరిస్తుంది. కుజుని దోషం ఉంది. సమయానికి భోజనం ఉండదు. మనస్సు చెడును శంకిస్తుంది. కుజ ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** కుజ, బుధుల శుభస్థితివల్ల వస్త్ర, ధాన్య, ధనలాభాలు ఉన్నాయి. యశస్సు, మానసిక ఉల్లాసాన్ని పొందుతారు. న్యాయబద్ధంగా వ్యవహరిస్తూ సత్ఫలితాలు సాధిస్తారు. మాతృసౌఖ్యాన్ని పొందుతారు. రవి, శుక్రుల దోషం ఉంది. కుటుంబ సభ్యులతో సఖ్యతతో మెలగండి. ప్రయాణంలో ఆటంకాలు ఎదురౌతాయి. విరోధాలకు దూరంగా ఉండాలి. రవి, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** బుధుని శుభస్థితివల్ల బుద్ధిబలంతో క్రమ క్రమంగా అభివృద్ధిని సాధిస్తారు. మాతృసౌఖ్యం ఉంటుంది. రవి, కుజ, శుక్రుల దోషం ఉంది. చంచల స్వభావంతో సమస్యలు పెరుగుతాయి. ఆర్థికంగా ఇబ్బందులు రావచ్చు. కొన్ని వ్యవహారాలు చివరి దాకా ఊరించి ఇబ్బంది పెడతాయి. ఇంటా బయటా కలహ సూచన. కోపతాపాలకు పోరాదు. రవి, కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** రవి, బుధుల శుభస్థితివల్ల లక్ష్యాలకు చేరువవుతారు. వస్త్ర ధాన్యాది లాభములు ఉంటాయి. ఒక వార్త మీ మనోధైర్యాన్ని పెంచుతుంది. విద్య, వినోద సుఖాన్ని పొందుతారు. కుజ, శుక్రుల దోషం ఉంది. ఖర్చులు పెరగడంవల్ల ఆర్థిక ఇబ్బందులు తలెత్తవచ్చు. అనవసర విషయాల్లో తలదూర్చరాదు. ఆరోగ్యం పట్ల జాగ్రత్తలు పాటించాలి. కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.



# తులారాశి ఫలితములు

| ఆదాయం - 11 | వ్యయం - 14 | రాజపూజ్యం - 5 | అవమానం - 6 |
|---|---|---|---|

జ్యోతిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం :** జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.

2. **గోచార ఫలితం :** జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం... అంటే మిశ్రమ ఫలితం. ఇదే విధంగా గోచారం బాగుండి జాతకదశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోషఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.

## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - లాభంలో ఉన్నందున గత కొంతకాలంగా పరిష్కారం కాని కొన్ని పనులు వెంటనే పరిష్కారమవుతాయి. కీర్తి పెరుగుతుంది. మీ ప్రతిభకు గుర్తింపు, మీ పని తీరుకు ప్రశంసలు లభిస్తాయి. శత్రువులపై విజయం సాధిస్తారు. శత్రువులు మిత్రులుగా మారుతారు. ఆరోగ్యం బాగుంటుంది. అన్నిటా మీదే విజయం. మంత్రసిద్ధి కలుగుతుంది. సుఖశాంతులతో బాటు భోగాలు అనుభవిస్తారు. 2-11-2014 నుండి 26-1-2017 వరకు 21-6-2017 నుండి 26-10-2017 వరకు శని - ద్వితీయంలో ఉన్నందున ఏలినాటి శనిదోషం ఉంది. చెడుపనులకు దూరంగా ఉండాలి. ఆలోచించి మాట్లాడాలి. పనులను ఒకటికి రెండుసార్లు ఆలోచించి ఆరంభించండి. ప్రయాణాలలో జాగ్రత్తలు అవసరం. శని ధ్యానశ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017

వరకు రాహువు – లాభంలో ఉండుటచే పశులాభం, భోజన సౌఖ్యం ఉంటుంది. వస్తు, వస్త్ర ప్రాప్తితోపాటు లాభాలు, విజయాలు చేకూరుతాయి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు – పంచమంలో ఉండుటచే సమయానికి భోజనం చేయరు. సంతానంతో గొడవలు పడకుండా ఓర్పుగా వ్యవహరించండి. కేతు ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు – గురువు – వ్యయంలో ఉన్నందున ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. శుభకార్యాలవల్ల ధనవ్యయం అధికమవుతుంది. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 26-1-2017 నుండి 21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని – తృతీయంలో ఉన్నందున విజయం సాధిస్తారు. చేపట్టే పనులను పట్టుదలతో పూర్తిచేస్తారు. బుద్ధిబలం అనుకూలిస్తుంది. స్వస్థానప్రాప్తి ఉంది. మంచి ఆరోగ్యంతో పాటు సుఖ సంతోషాలు లభిస్తాయి.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** రవి, బుధుల శుభస్థితివల్ల మీరు అనుకున్న పనిని విజయవంతంగా పూర్తి చేయగలుగుతారు. వస్త్ర, ధాన్య లాభాలు ఉంటాయి. ఆరోగ్యం సహకరిస్తుంది. మనోధైర్యం కలిగి ఉంటారు. విద్యార్థులు విద్యలో రాణిస్తారు. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. కుజ, శుక్రుల దోషం ఉంది. చేపట్టే పనులు ఆలస్యంగా పూర్తవుతాయి. బంధువులతో ఆచి తూచి వ్యవహరించాలి. కుటుంబ సభ్యుల వల్ల శ్రమ అధికమౌతుంది. మనోవిచారం కలుగుతుంది. కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. అప్రమత్తంగా ఉండాల్సిన సమయం. సకాలంలో పనులు పూర్తి చేసుకోవాలి. ఆర్థికంగా పలు జాగ్రత్తలు తీసుకోవాలి. ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేయకండి. మాట పట్టింపులకు పోకండి. మానసిక ప్రశాంతత కోసం రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** శుక్రుని శుభస్థితివల్ల బంధు మిత్రులను కలుస్తారు. రాజ (అధికారుల) దర్శన ప్రాప్తి కలదు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. ఆదాయానికి మించి ఖర్చులుంటాయి. ఆరోగ్యాన్ని కాపాడుకోవాలి. కొందరి ప్రవర్తన మీకు ఇబ్బంది కలిగిస్తుంది. సమయం వృథా చేయకండి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జులై :** శుక్రుని శుభస్థితివల్ల అద్భుతమైన విజయాలను పొందుతారు. ధర్మకార్యాలను చేపడతారు. చేపట్టిన పనులను చిత్తశుద్ధితో పూర్తిచేస్తారు. వస్త్రలాభం ఉంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. కలహాలకు తావివ్వకండి. పొదుపు సూత్రాన్ని పాటించాలి. త్రిప్పట, అలసట ఎక్కువ. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల సమయస్ఫూర్తితో వ్యవహరించి విజయాలు సాధిస్తారు. ఆలోచనలే పెట్టుబడిగా లాభాలను అందుకుంటారు. ఒక ముఖ్యమైన విషయమై పెద్దలను కలుస్తారు. ఫలితం అనుకూలంగా వస్తుంది. సంతోషాన్నిచ్చే సంఘటనలు చోటు చేసుకుంటాయి. బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. కుజుని దోషం ఉంది. ఇబ్బంది పెట్టేవారు పక్కనే ఉండి సమస్యలను సృష్టిస్తారు. కలహాలకు దూరంగా ఉండండి. ఆవేశపడరాదు. నిదానంగా వ్యవహరించండి. కుజుని ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** రవి శుభస్థితివల్ల అవసరానికి ధనం చేతికందుతుంది. ఆచారాలకి పెద్దపీట వస్తారు. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. విందు, వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. పనుల్లో ఆటంకాలు ఎదురైనా తెలివిగా పరిష్కరిస్తారు. కొందరు అదేపనిగా మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలని చూస్తారు. శ్రమ అధికమవుతుంది. కలహ సూచన. ధైర్యంగా ఉండండి. దైవారాధన చేస్తే సత్ఫలితాలు పొందుతారు. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** కుజ, బుధ, శుభస్థితివల్ల ఉత్సాహంతో పనిచేసి తలపెట్టిన కార్యాల్లో విజయం సాధిస్తారు. ధనలాభం పరిపూర్ణంగా ఉంది. సంతోషకరమైన వార్తను వింటారు. ఆత్మీయుల సలహాలు ప్రశాంతతను ఇస్తాయి. రవి దోషం ఉంది. స్థానచలన సూచన. దైవానుగ్రహంతో ఆపదల నుండి బయటపడతారు. రవి ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**నవంబరు :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల విశేష ధనలాభం ఉంది. అనుకున్న పనులు త్వరగా పూర్తవుతాయి. నూతన ప్రయత్నాలు సిద్ధిస్తాయి. ప్రతిభకు తగిన గుర్తింపు లభిస్తుంది. కుటుంబ వాతావరణం సహకరిస్తుంది. ఆరోగ్యం బాగుంటుంది. ధైర్యంగా వ్యవహరించి పెద్దల మెప్పును పొందుతారు. రవి, బుధుల దోషం ఉంది. సమయానికి ఆహార విశ్రాంతులు తీసుకోవాలి. బంధువులతో అప్రమత్తంగా ఉండాలి. వివాదాలకు దూరంగా ఉండాలి. దుష్టులను దరిచేరనీయకండి. మానసిక ప్రశాంతత కోసం రవి, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** శుక్రుని శుభస్థితివల్ల వ్యాపారంలో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. ఆర్థికంగా పుంజుకుంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. అందరినీ కలుపుకు పోవడం వల్ల తలపెట్టిన కార్యం శీఘ్రంగా సిద్ధిస్తుంది. చంచల బుద్ధి వల్ల ఇబ్బందులు రావచ్చు. అనారోగ్య సమస్యలు రాకుండా జాగ్రత్తలు తీసుకోండి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** రవి, శుక్రుల శుభస్థితివల్ల విజయావకాశాలు పెరుగుతాయి. విందు, వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. ధనలాభం ఉంది. ఆరోగ్యం బాగుంటుంది. కుజ, బుధుల దోషం ఉంది. అధికారులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. శ్రమ పెరుగుతుంది. సమయానికి ఆహారం, విశ్రాంతి తీసుకోండి. పనుల్లో నిర్లక్ష్యం చేయడంవల్ల మనస్తాపానికి గురికావాల్సి వస్తుంది. కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** కుజుని శుభస్థితివల్ల లాభాలుంటాయి. ధర్మకార్యాచరణతో యశస్సు పెరుగుతుంది. రవి, బుధ, శుక్రుల దోషం ఉంది. అవరోధాలున్నా ఆత్మబలంతో పోరాడి విజయం సాధిస్తారు. ఆత్మీయులతో విభేదాలు రాకుండా చూసుకోవాలి. అధికారులతో అతి చనువు వద్దు. ప్రయాణంలో జాగ్రత్తలు అవసరం. ఖర్చులు అధికమవుతాయి. రవి, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** కుజుని శుభస్థితివల్ల స్థిర సంకల్పంతో వ్యవహరించి విజయాన్ని అందుకుంటారు. ధర్మసిద్ధి కలదు. రవి, బుధ, శుక్రుల దోషం ఉంది. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల్లో ఓపిక అవసరమవుతుంది. మొహమాటం వల్ల లేనిపోని సమస్యలు కొనితెచ్చుకోకండి. విరోధాలకు చోటివ్వరాదు. అపకీర్తిపాలు చేసేవారు ప్రక్కనే ఉంటారు. ఆరోగ్యమే మహాభాగ్యం అని మరువకండి. రవి, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.



# వృశ్చికరాశి ఫలితములు

| ఆదాయం - 2 | వ్యయం - 8 | రాజపూజ్యం - 1 | అవమానం - 2 |
|---|---|---|---|

**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం :** జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.
2. **గోచార ఫలితం :** జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం .... అంటే మిశ్రమ ఫలితం. ఇదే విధంగా గోచారం బాగుండి జాతకదశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోషఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.

## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - దశమంలో ఉన్నందున అదృష్టం దూరమవుతుంది. కాలం సహకరించదు. విజయం సాధించడంలో ఎక్కువ శ్రమ పడాలి. పరిస్థితుల ప్రభావం వల్ల పనులు ఆలస్యమౌతాయి. ఆర్థిక సమస్యలు పెరుగుతాయి. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2017 వరకు శని - జన్మంలో ఉన్నందున ఏలినాటి శనిదోషం ఉంది. ఆరోగ్యంపై శ్రద్ధ పెట్టాలి. అపకీర్తి రాకుండా వ్యవహరించండి. ఆలోచనలో స్పష్టత అవసరం. ప్రతి విషయంలోనూ ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. ఆర్థికంగా నియంత్రణ అవసరం. శని ధ్యానశ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు రాహువు - దశమంలో ఉండుటచే చేపట్టే పనుల్లో విజయం సాధిస్తారు. భోజన సౌఖ్యం, సంతోషం ఉంటాయి. శరీరబలం పెరుగుతుంది. సర్వత్రా సుఖం లభిస్తుంది. వస్తు, వస్త్ర ప్రాప్తితో పాటు లాభాలు, విజయాలు చేకూరుతాయి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు - చతుర్థంలో ఉండుటచే బుద్ధి స్థిరంగా ఉండదు. పనుల్లో ఆటంకాలు వస్తాయి. భయం, వాతరోగ సమస్యలు వస్తాయి. అకాలభోజనం, త్రిప్పట తప్పవు. సంతానంతో గొడవలు రాకుండా జాగ్రత్తగా వ్యవహరించాలి. కేతు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు - లాభంలో ఉన్నందున గత కొంత కాలంగా పరిష్కారం కాని కొన్ని పనులు వెంటనే పరిష్కారమవుతాయి. కీర్తి

పెరుగుతుంది. మీ ప్రతిభకు గుర్తింపు, మీ పనితీరుకు ప్రశంసలు లభిస్తాయి. శత్రువులపై విజయం సాధిస్తారు. శత్రువులు మిత్రులుగా మారుతారు. ఆరోగ్యం బాగుంటుంది. అన్నిటా మీదే విజయం. మంత్రసిద్ధి కలుగుతుంది. సుఖశాంతులతో బాటు భోగాలు అనుభవిస్తారు. 26-1-2017 నుండి 21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని - ద్వితీయంలో ఉన్నందున ఏలినాటి శని దోషం ఉంది. చెడ్డపనులకు దూరంగా ఉండాలి. ఆలోచించి మాట్లాడాలి. పనులను ఒకటికి రెండుసార్లు ఆలోచించి మొదలుపెట్టండి. మానసిక విచారానికి లోనుకారాదు. ప్రయాణాలలో జాగ్రత్తలు అవసరం. శని ధ్యానశ్లోకం చదువుకోవాలి.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** శుక్రుని శుభస్థితివల్ల ధనధాన్య సమృద్ధి కలుగుతుంది. లాభాలుంటాయి. విందు కార్యక్రమాల్లో పాల్గొంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. బంధుమిత్రుల వల్ల అనవసర ధన వ్యయం కలుగుతుంది. కుటుంబంలో చిన్నపాటి సమస్యలు ఉంటాయి. ఖర్చులు పెరుగుతాయి. ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. మనశ్శాంతి తగ్గుతుంది. కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే :** రవి, బుధుల శుభస్థితివల్ల మీకు అప్పగించిన బాధ్యతల్ని సమర్థవంతంగా నిర్వహిస్తారు. దేహారోగ్యం, సంతోషం, వస్త్ర ధాన్యాది లాభములు సిద్ధిస్తాయి. మనోధైర్యం కలిగి ఉంటారు. కుజ, శుక్రుల దోషం ఉంది. కుటుంబ కలహాలు రాకుండా జాగ్రత్తపడాలి. కొందరి ప్రవర్తన బాధ కలిగిస్తుంది. కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** బుధుని శుభస్థితివల్ల మీ సాంకేతిక నైపుణ్యమే మీ విజయ రహస్యం. జ్ఞాన సముపార్జన చేస్తారు. వస్త్ర, ధాన్యాది లాభాలుంటాయి. రవి, కుజ, శుక్రుల దోషం ఉంది. కొన్ని సంఘటనలు పాఠాలు నేర్పుతాయి. ఒకటి, రెండు సవాళ్లు ఎదురైనా మనోధైర్యంతో ఎదుర్కొంటారు. దుష్టులవల్ల పీడ, అనారోగ్య సమస్యలు బాధిస్తాయి. రవి, కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జులై :** శుక్రుని శుభస్థితివల్ల కృషికి తగ్గ ఫలితం ఉంటుంది. ఒక ముఖ్యమైన విషయమై అధికారులను కలుస్తారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. అనవసర ప్రయాణాల వల్ల ఉత్సాహం తగ్గుతుంది. శత్రువులతో జాగ్రత్త. అనుకోని ఖర్చులు ఎదురౌతాయి. శుభఫలితాలు కోసం రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. ధైర్యంగా వ్యవహరించాల్సిన సమయం. మీ లక్ష్యాల కోసం ఆత్మస్థైర్యంతో పనిచేస్తారు. విఘ్నాలను అధిగమించి విజయాన్ని సొంతం చేసుకుంటారు. చేయని తప్పుకు బాధ్యత వహించాల్సి వస్తుంది. కలహ సూచన. చిరునవ్వు అనేక సమస్యలకు పరిష్కారం అవుతుంది. రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల పెద్దల సహకారంతో, మీ సంకల్పం నెరవేరుతుంది. తెలివితేటలతో వ్యవహరించి ఆస్తిని వృద్ధి చేస్తారు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల్లో ప్రగతిని సాధిస్తారు. బంధువుల ఆదరాభిమానాలు లభిస్తాయి. ఆనందోత్సాహాలతో కూడిన వాతావరణం ఉంటుంది. ఆరోగ్యం అన్ని విధాలా సహకరిస్తుంది. కుజుని దోషం ఉంది. దుష్టులవల్ల పీడ, కుజుని ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** రవి శుభస్థితివల్ల ఆచార సాంప్రదాయాలను గౌరవిస్తారు. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. పనుల్లో వేగం అవసరం. లక్ష్యసాధనలో నలుగురినీ కలుపుకు పోవాల్సిన అవసరం వుంది. చిన్నపాటి అనారోగ్య సమస్యలు ఇబ్బందినిస్తాయి. చెడుసావాసాలకు దూరంగా ఉండండి. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగును.

**నవంబరు :** శుక్రుని శుభస్థితివల్ల చేపట్టే పనులు లాభదాయకంగా ముగుస్తాయి. మానసిక ప్రశాంతతతో ఉంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. స్థానచలన సూచన. ఖర్చులు పెరగకుండా జాగ్రత్త వహించాలి. కొన్ని సంఘటనలు మానసిక ప్రశాంతతను మింగేస్తాయి. మాట పట్టింపులకు పోరాదు. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** కుజ, బుధ, శుక్రుల శుభస్థితివల్ల విజయాలు సొంతమవుతాయి. కుటుంబ సభ్యుల సహాయ సహకారాలు లభిస్తాయి. ధన ప్రవాహం పుష్కలంగా ఉంటుంది. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. సుఖం, మహానుభావులతో పరిచయాలు ఏర్పడతాయి. సమాజంలో పలుకుబడి పెరుగుతుంది. రవి దోషం ఉంది. పనిలో శ్రమ పెరుగుతుంది. సమయానికి నిద్రాహారాలు పాటించండి. రవి ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** బుధ, శుక్రుల శుభస్థితివల్ల తెలివితేటలతో అందరినీ ఆకట్టుకుంటారు. ధనప్రాప్తి కలుగుతుంది. కొత్త వ్యక్తుల పరిచయం వల్ల మీలోని ప్రతిభ విస్తరిస్తుంది. గౌరవ సన్మానాలు అందుకుంటారు. రవి, కుజుల దోషం ఉంది. వ్యవసాయం, వ్యాపారాల్లో అనుభవజ్ఞుల సలహాలు అవసరమవుతాయి. గిట్టనివారు మిమ్మల్ని తప్పుదోవ పట్టిస్తారు. శాంతంగా వ్యవహరించి సమస్యల్ని దూరం చేసుకోవాలి. రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల మీరనుకున్నది సాధించటానికి గెలుపు తలుపులు తెరుచుకుంటాయి. ఆర్థికంగా ప్రగతిని సాధిస్తారు. ఆరోగ్యం అన్నివిధాలా సహకరిస్తుంది. పుత్ర సౌఖ్యం కలదు. బంధుమిత్రులతో కొన్ని మధుర క్షణాలు గడుపుతారు. కుజుని దోషం ఉంది. మనస్సు చెడును శంకిస్తుంది. కుజుని ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** బుధ, శుక్రుల శుభస్థితివల్ల జీవితాశయం దిశగా ముందడుగు వేస్తారు. అనుకున్న పనుల్ని చక్కని ప్రణాళికతో పూర్తిచేస్తారు. ధనధాన్య సమృద్ధి ఉంది. మాతృసౌఖ్యం కలదు. మంచి భోజన సౌఖ్యం ఉంటుంది. రవి, కుజుల దోషం ఉంది. ఎదుటివారి మనోభావాల్ని గౌరవించడం ద్వారా వివాదాలు దరిచేరవు. ప్రయాణంలో జాగ్రత్తలు తీసుకోవాలి. ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేయకండి. రవి, కుజుల ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.



# ధనుస్సురాశి ఫలితములు

| ఆదాయం - 5 | వ్యయం - 14 | రాజపూజ్యం - 4 | అవమానం - 2 |
|---|---|---|---|

**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం** : జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.
2. **గోచార ఫలితం** : జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం... అంటే మిశ్రమ ఫలితం. ఇదే విధంగా గోచారం బాగుండి జాతకదశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోషఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.

## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - నవమంలో ఉన్నందున ధనలాభంతో పాటు స్వగృహప్రాప్తి కలుగుతుంది. భాగ్య గురువు వల్ల ఆస్తిని వృద్ధిచేస్తారు. ఆచార సాంప్రదాయాలతోపాటు గౌరవం పెరుగుతుంది. విందు వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. సుఖ సంతోషాలను అనుభవిస్తారు. 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2017 వరకు శని - వ్యయంలో ఉన్నందున ఏలినాటి శని దోషం ఉంది. ఆలోచించి మాట్లాడాలి. భోజన సౌఖ్యం తక్కువ. ప్రతి విషయంలోనూ ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. శని ధ్యానశ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు రాహువు - నవమంలో ఉన్నందున చేపట్టే పనులు నిదానంగా పూర్తవుతాయి. ప్రయాణాలు చేస్తారు. రాహు ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు - తృతీయంలో ఉండటంవల్ల ఆరోగ్యం కుదుటపడుతుంది. ధనలాభం కలుగుతుంది. కీర్తి పెరుగుతుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. సోదరులతో అనుకూలంగా ఉండాలి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు - దశమంలో ఉన్నందున అదృష్టం దూరమవుతుంది. కాలం సహకరించదు. విజయం సాధించడంలో విఘ్నాలు అధికమవుతాయి. పరిస్థితుల ప్రభావం వల్ల పనులు ఆలస్యమవుతాయి. ఆర్థిక సమస్యలు పెరుగుతాయి. ధనధాన్య నష్టం సూచితం. వృథా సంచారాలు చేయాల్సి వస్తుంది. భయం, బంధు దూషణం ఉంటాయి. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 26-1-2017 నుండి

21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని - జన్మంలో ఉన్నందున ఏలినాటి శని దోషం ఉంది. ఆరోగ్యంపై శ్రద్ధపెట్టాలి. అనారోగ్య సమస్యలు కనపడుతున్నాయి. అపకీర్తి రాకుండా చూచుకోవాలి. ఆలోచనలో స్పష్టత అవసరం. ప్రతి విషయంలోనూ ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. ఆర్థికంగా నియంత్రణ అవసరం. శని ధ్యానశ్లోకం చదువుకోవాలి.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** బుధ, శుక్రుల వల్ల మాతృ సౌఖ్యం ఉంటుంది. ధనధాన్య వృద్ధి కలుగుతుంది. చేపట్టిన పనుల్లో విజయం సాధిస్తారు. బుద్ధిబలంతో అందరి ప్రశంసలు అందుకుంటారు. మీ ప్రతిభకు గుర్తింపు లభిస్తుంది. రవి, కుజుల దోషం ఉంది. ఇంట్లో సమస్యలు బాధిస్తాయి. మనోవిచారం కలుగుతుంది. దూర ప్రయాణాలలో ఆటంకాలు కలుగకుండా జాగ్రత్తపడాలి. ఖర్చులు పెరుగుతాయి. రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే :** శుక్రుని శుభస్థితివల్ల ధనధాన్య లాభాలుంటాయి. మంచి భోజన సౌఖ్యం. రవి, కుజ, బుధుల దోషం ఉంది. మొహమాటం వల్ల ఇబ్బందులు ఎదురౌతాయి. శ్రమ పెరుగుతుంది. చేతి దాకా వచ్చిన అవకాశాన్ని చేజారకుండా చూసుకోవాలి. అయినవారి వల్ల సమస్యలు రాకుండా జాగ్రత్తపడాలి. ఆరోగ్యంపట్ల జాగ్రత్త అవసరం. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** రవి శుభస్థితివల్ల పట్టుదలతో పనిచేసి విజయాన్ని సొంతం చేసుకుంటారు. ఆరోగ్యం సహకరిస్తుంది. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. మాట విలువను కాపాడుకోవాలి. తగాదాలలో తలదూర్చరాదు. విచారకర సంఘటనలు చోటుచేసుకున్నా అవి మీ అభివృద్ధిని ఆపలేవు. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జులై :** కుజుని శుభస్థితివల్ల మనోధైర్యంతో ముందుకెళతారు. తలపెట్టిన కార్యాన్ని పూర్తిచేస్తారు. ఆదాయ మార్గాలను పెంచుకుంటారు. ఆ మేరకు కొత్త నైపుణ్యాన్ని సంపాదిస్తారు. రవి, బుధ, శుక్రుల దోషం ఉంది. ఆత్మీయులతో విభేదాలు రాకుండా చూసుకోవాలి. అనారోగ్య సమస్యలు ఇబ్బందిపెడతాయి. నిరుత్సాహాన్ని విడనాడాలి. పై అధికారులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. రవి, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** శుక్రుని శుభస్థితివల్ల స్వధర్మాన్ని దృష్టిలో పెట్టుకుని చిత్తశుద్ధితో కార్యాలలో విజయం సాధిస్తారు. నూతన వస్త్రయోగం ఉంటుంది. గురువుల కటాక్షం మిమ్మల్ని రక్షిస్తుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. శత్రువులు పెరగకుండా చూసుకోవాలి. వృథా ప్రయాణాల వల్ల కాలహరణం అవకుండా జాగ్రత్తపడాలి. తొందరపాటు నిర్ణయాలు పనికిరావు. ఆరోగ్యంపై శ్రద్ధ పెంచాలి. ఖర్చులు పెరగకుండా చూసుకోవాలి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. ప్రతి విషయంలోనూ లోతుగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. అవరోధాల్ని పట్టించుకోకుండా పనిచేసుకుపోతే అంతా శుభమే. ఆచితూచి ఖర్చుపెట్టాలి. ఆరోగ్యంపై ఒత్తిడి పెరగకుండా జాగ్రత్త పడాలి. ప్రణాళిక ద్వారా విజయాలకు దగ్గరవుతారు. రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** రవి, శుక్రుల శుభస్థితివల్ల గతమాసం కంటే మెరుగైన ఫలితాలుంటాయి. ప్రోత్సాహకరమైన వాతావరణం ఉంటుంది. పెద్దల అండదండలు ఉంటాయి. అనుకున్న పనిని విజయవంతంగా పూర్తిచేస్తారు. ధనలాభం కలుగుతుంది. బంధుమిత్రులను కలుస్తారు. ఆరోగ్యం బాగుంటుంది. కుజ, బుధుల దోషం ఉంది. శత్రువులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. ఆవేశానికి పోకూడదు. కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**నవంబరు :** రవి, బుధుల శుభస్థితివల్ల ధనలాభం, స్వకులాచారం, ఇంట్లో శుభకార్యక్రమాల గురించి చర్చిస్తారు. ఆర్థిక ఫలితాలు అనుకూలంగా ఉంటాయి. ఆరోగ్యం సహకరిస్తుంది. కుజ, శుక్రుల దోషం ఉంది. విఘ్నాల్ని కలిగించేవారు పక్కనే ఉంటారు. అపోహలకి తావివ్వకండి. మనోబలం పెరగటానికై కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** శుక్రుని శుభస్థితివల్ల ఏకాగ్రతతో పనిచేసి విజయాన్నందుకుంటారు. మనః సంతోషం, ధనలాభం ఉంటాయి. రవి, కుజ, బుధుల దోషం ఉంది. సాధ్యమైనంతవరకూ అప్పులు ఇవ్వకండి. దృఢ సంకల్పంతో ఎటువంటి సమస్యనైనా అధిగమిస్తారు. ఒక సంఘటన కారణంగా మనోవిచారం కలుగుతుంది. నిద్రాహారాల సమయాన్ని పాటించండి. గిట్టనివారు మిమ్మల్ని తప్పుదోవ పట్టిస్తారు. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల వ్యాపారంలో నైపుణ్యం పెరుగుతుంది. ఆర్థికయోగం శుభప్రదంగా ఉంటుంది. శత్రువులపై విజయం సాధిస్తారు. ఆరోగ్యం బాగుంటుంది. రవి, బుధుల దోషం ఉంది. సమయానికి ఆహారం తీసుకోవాలి. అజాగ్రత్తగా ఉంటే వివాదాలు చుట్టుముడతాయి. చెడుసావాసాల వల్ల మనోవిచారం కలుగుతుంది. రవి, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** శుక్రుని శుభస్థితివల్ల పదునైన ఆలోచనలతో కీలక విషయాల్లో విజయం సాధిస్తారు. గౌరవం పెరుగుతుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. వ్యాపారంలో పెద్దల సలహాలు అవసరమవుతాయి. డబ్బును పొదుపుగా వాడాలి. మనస్సు చెడ్డపనుల మీదకు మళ్ళుతుంది. కొందరి ప్రవర్తన బాధ కలిగించవచ్చు. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** రవి, శుక్రుల శుభస్థితివల్ల గంభీరంగా ఉంటారు. బుద్ధిబలంతో అనుకున్నది సాధిస్తారు. ధనలాభం ఉంటుంది. విందు, వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులను కలుస్తారు. సంతోషకరమైన జీవితాన్ని గడుపుతారు. కుజ, బుధుల దోషం ఉంది. సాహసానికి పరీక్షా కాలం. పై అధికారులతో అతి చనువు పనికిరాదు. అందరికీ ఆమోదయోగ్యమైన పనులు చేయడం ద్వారా విజయాలకు త్వరగా చేరువకావచ్చు. కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.



# మకరరాశి ఫలితములు

| ఆదాయం - 8 | వ్యయం - 8 | రాజపూజ్యం - 7 | అవమానం - 2 |
|---|---|---|---|

**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం** : జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.
2. **గోచార ఫలితం** : జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం... అంటే మిశ్రమ ఫలితం. ఇదే విధంగా గోచారం బాగుండి జాతకదశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోషఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.

## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - అష్టమంలో ఉన్నందున కోపంగా కఠినంగా మాట్లాడతారు. కాబట్టి శాంతం చాలా అవసరం. ముఖ్యమైన పనులు వాయిదా వేసుకోవడం మంచిది. చోర, అగ్నిభయాలతోపాటు అధికారుల వల్ల ఇబ్బందులూ కలుగుతాయి. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2107 వరకు శని - లాభంలో ఉన్నందున చేపట్టే పనుల్లో విజయం సాధిస్తారు. సంతానాభివృద్ధికి సంబంధించిన శుభవార్త వింటారు. మంచి ఆరోగ్యం లభిస్తుంది. అవసరానికి డబ్బు చేతికి అందుతుంది. సుఖసంతోషాలు ఉంటాయి. అదృష్టం వరిస్తుంది. 30-1-2016 నుండి 18-8-2017 వరకు రాహువు అష్టమంలో ఉన్నందున అనారోగ్యం, మనోవిచారం కలుగుతాయి. అధికారులు అనుకూలంగా ఉండరు. ప్రయాణాలు చేస్తారు. రాహు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు ద్వితీయంలో ఉండుటచే వాక్పౌరుషం వల్ల అనేక కష్టాలు చుట్టుముడతాయి. అపకీర్తి పాలౌతారు. కేతు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు - నవమంలో

ఉన్నందున ధనలాభంతో పాటు స్వగృహప్రాప్తి కలుగుతుంది. భాగ్య గురువు వల్ల ఆస్తిని వృద్ధి చేస్తారు. ఆచార సాంప్రదాయాలతోపాటు గౌరవం పెరుగుతుంది. విందు వినోద  కార్యక్రమాల్లో పాల్గొంటారు. సుఖ సంతోషాలను అనుభవిస్తారు. 26-1-2017 నుండి 21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని - వ్యయంలో ఉన్నందున ఏలినాటి శని దోషం కలదు. ఆలోచించి మాట్లాడాలి. లేనియెడల అపకీర్తిని మూటగట్టుకుంటారు. భోజన సౌఖ్యం ఉండదు. మనస్తాపం చెందుతారు. ప్రతి విషయంలోనూ ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. శ్రమ జీవనం, అనారోగ్య సమస్యలు వస్తాయి. శని ధ్యానశ్లోకం చదువుకోవాలి.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** రవి, కుజ, శుక్రుల శుభస్థితివల్ల అనుకున్న పని విజయవంతంగా పూర్తి చేయగలుగుతారు. ఆర్థికాభివృద్ధి ఉంటుంది. బంధుమిత్రులతో సంతోషంగా గడుపుతారు. శత్రువులపై విజయం సాధిస్తారు. బుధుని దోషం ఉంది. పై అధికారులతో అప్రమత్తంగా ఉండాలి. బుద్ధిమాంద్యం వల్ల సమస్యలు ఎదురౌతాయి. మనస్తాపం చెందుతారు. బుధుని ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**మే :** కుజ, బుధ, శుక్రుల శుభస్థితివల్ల బుద్ధిబలం సమయానికి పనిచేస్తుంది. స్వప్నం సాకారమవుతుంది. ధనధాన్యాభివృద్ధి ఉంటుంది. గౌరవ మర్యాదలు పెరుగుతాయి. ఆరోగ్యం బాగుంటుంది. రవి దోషం ఉంది. కుటుంబ సభ్యులతో ఆచితూచి వ్యవహరించాలి. ప్రయాణంలో జాగ్రత్తలు తీసుకోవాలి. మానసిక ప్రశాంతత కోసం రవి ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** కుజ, బుధ, శుక్రుల శుభస్థితివల్ల విజయ సోపానాలను అధిరోహిస్తారు. మీలో అంతర్లీనంగా ఉన్న ప్రత్యేకతలు బయటకు వస్తాయి. ఆర్థికంగా శుభఫలితాలు లభిస్తాయి. సంతోషంగా ఉంటారు. ఆరోగ్యం బాగుంటుంది. రవి దోషం ఉంది. పనుల్లో శ్రమ అధికమవుతుంది. మొహమాటం వల్ల ధనవ్యయ సూచితం. రవి ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జూలై :** రవి, బుధుల శుభస్థితివల్ల అప్పగించిన బాధ్యతల్ని సమర్థవంతంగా పూర్తి చేస్తారు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల్లో ప్రోత్సాహకరమైన వాతావరణం ఉంటుంది. మనోధైర్యం కలిగి ఉంటారు. విందు, వినోదాల్లో పాల్గొంటారు. ఆరోగ్యం బాగుంటుంది. కుజ, శుక్రుల దోషం ఉంది. ఉద్యోగంలో స్థానచలన కలుగుతుంది. శత్రుపీడ ఇబ్బందిపెడుతుంది. విరోధాలకు తావివ్వరాదు. కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల ఎన్నాళ్ళగానో ఎదురుచూస్తున్న ఒక కల నెరవేరుతుంది. వస్త్ర, ధనలాభాలు ఉన్నాయి. బంధుమిత్రులను కలుస్తారు. అధికారుల దర్శనభాగ్యం లభిస్తుంది. మంచి ఆరోగ్యం ఉంటుంది. రవి, బుధుల దోషం ఉంది. వివాదాల వల్ల ప్రశాంతత లోపిస్తుంది. రెట్టించిన ఉత్సాహంతో పనిచేయాలి. రవి, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల అనుభవజ్ఞుల సలహాలు పాటిస్తూ ధైర్యసాహసాలతో విజయం సాధిస్తారు. గురువులయందు భక్తిప్రపత్తులతో ఉంటారు. మంచి ఆరోగ్యం ఉంటుంది. ధనలాభం సిద్ధిస్తుంది. రవి, బుధుల దోషం ఉంది. రెట్టించిన ఉత్సాహంతో పనిచేయాలి. వృథా ప్రయాణాలు తప్పవు. ఒకవార్త మానసిక ప్రశాంతతను తగ్గిస్తుంది. ఇబ్బంది పెట్టేవారిని దరిచేరనీయరాదు. రవి, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** రవి, కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. చేపట్టే పనిలో ఆటంకాలు ఎదురైనా అధిగమించే ప్రయత్నం చేస్తారు. సంబంధం లేని విషయాల్లో తలదూర్చరాదు. మనశ్శాంతిని మింగేసే సంఘటనలు చోటుచేసుకుంటాయి. బంధువులతో విభేదాలు రాకుండా చూసుకోవాలి. ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. డబ్బులు పొదుపుగా వాడాలి. రవి, కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**నవంబరు :** రవి, శుక్రుల శుభస్థితివల్ల మనోభీష్టం నెరవేరుతుంది. ఆదాయ మార్గాలు పెరుగుతాయి. సంఘంలో గౌరవం పెరుగుతుంది. బంధుమిత్రులను కలుస్తారు. ఆరోగ్యం బాగుంటుంది. భోజన సౌఖ్యం ఉంటుంది. కుజ, బుధుల దోషం ఉంది. పనిలో శ్రమ అధికమవుతుంది. ఆలస్యం అమృతం విషం అన్న సూత్రాన్ని మరువరాదు. కొన్ని సంఘటనలు మనోవిచారాన్ని కలిగిస్తాయి. కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** రవి శుభస్థితివల్ల ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. ధనలాభం కలిగే సూచన ఉంది. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. స్వల్ప అనారోగ్య సమస్యలు ఇబ్బంది పెడతాయి. కలహాలకు దూరంగా ఉండాలి. కొందరి ప్రవర్తన బాధ కలిగిస్తుంది. పనులయందు శ్రమ అధికమవుతుంది. గృహరక్షణ విషయంలో భద్రతను పెంచాలి. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** శుక్రుని శుభస్థితివల్ల కుటుంబ సభ్యులతో ఆనందంగా గడుపుతారు. సమాజంలో గౌరవం పెరుగుతుంది. ఆరోగ్యం సహకరిస్తుంది. నూతన వస్త్రయోగ ప్రాప్తి ఉంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. పనుల్లో ఆటంకాలు ఎదురైనా అధిగమించే ప్రయత్నం చేస్తారు. స్థానచలన సూచితం. అనవసర ఖర్చులను అదుపు చేసుకోవాలి. దుర్జన సాంగత్యం వల్ల మానసిక ప్రశాంతత తగ్గుతుంది. రవి. కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల పని నెరవేరుతుంది. వ్యాపారంలో రాణిస్తారు. ధనలాభం ఉంది. శత్రువులపై మీదే విజయం. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. రవి, బుధుల దోషం ఉంది. అడుగడుగునా ఆటంకాలు వచ్చినా, బుద్ధిబలంతో అధిగమిస్తారు. బంధుమిత్రులతో విభేదాలు రాకుండా చూసుకోవాలి. మానసిక ఒత్తిడి పెరుగుతుంది. రవి, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** కుజ, బుధ, శుక్రుల శుభస్థితివల్ల వృత్తి, ఉద్యోగ, వ్యాపార లక్ష్యాల కోసం ఉత్సాహంగా పనిచేస్తారు. ఆర్థికపరంగా అభివృద్ధి చెందుతారు. ఆరోగ్యం బాగుంటుంది. గొప్పవారితో సాంగత్యం ఏర్పడుతుంది. శత్రువులు మిత్రులుగా మారుతారు. రవి దోషం ఉంది. వ్యవసాయం, వ్యాపారాల్లో అనుభవజ్ఞుల సలహాలు అవసరమవుతాయి. చెడుసావాసాల వల్ల గౌరవం తగ్గుతుంది. రవి ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.



# కుంభరాశి ఫలితములు

| ఆదాయం - 8 | వ్యయం - 8 | రాజపూజ్యం - 3 | అవమానం - 5 |
|---|---|---|---|

**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం** : జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.

2. **గోచార ఫలితం :** జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం... అంటే మిశ్రమ ఫలితం. ఇదే విధంగా గోచారం బాగుండి జాతకదశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోషఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.

## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - సప్తమంలో ఉన్నందున గతంలో పరిష్కారం కాని కొన్ని సమస్యలు పరిష్కారమవుతాయి. పెద్దలవల్ల, అధికారుల వల్ల మేలు జరుగుతుంది. చేపట్టే పనుల్లో విజయం సాధిస్తారు. హుందాగా ఉంటారు. ఆరోగ్యం బాగుంటుంది. ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉంటారు. 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2017 వరకు శని - దశమంలో ఉన్నందున శ్రద్ధతో పనిచేయాలి. లేనిచో వృత్తిలో ఆటంకాలు వస్తాయి. పాపకార్యముల వల్ల ఆందోళన కలుగుతుంది. ఒక చెడువార్త వింటారు. శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు రాహువు - సప్తమంలో ఉన్నందున స్వల్పలాభం. వృథా ప్రయాణం చేయాల్సి వస్తుంది. స్వల్ప అనారోగ్య సమస్యలు ఉంటాయి. రాహు

ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు - జన్మంలో ఉండుటచే విదేశీయానం సూచితం. ధననష్టం కలుగుతుంది. అనారోగ్య సమస్యలు, కష్టాలు వస్తాయి. కలహాలు తప్పవు. మాటవిలువను కాపాడుకోవాలి. కేతు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు - అష్టమంలో ఉన్నందున కోపంగా కఠినంగా మాట్లాడతారు. కాబట్టి శాంతం చాలా అవసరం. పనులు వాయిదా వేసుకోవడం మంచిది. అలసట ఎక్కువగా ఉంటుంది. సాహసాలకు పూనుకుంటారు. చోర, అగ్నిభయాలతోపాటు అధికారులవల్ల ఇబ్బందులూ కలుగుతాయి. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 26-1-2017 నుండి 21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని - లాభంలో ఉన్నందున చేపట్టే పనుల్లో విజయం సాధిస్తారు. సంతానాభివృద్ధికి సంబంధించిన శుభవార్త వింటారు. మంచి ఆరోగ్యం లభిస్తుంది. అవసరానికి డబ్బు చేతికి అందుతుంది. సుఖ సంతోషాలు ఉంటాయి. అదృష్టం వరిస్తుంది.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** బుధ, శుక్రుల వల్ల కుటుంబ సభ్యులతో ఆనందంగా గడపుతారు. మీ పనితీరుకు ప్రశంసలు లభిస్తాయి. ధన, వస్త్ర, లాభాలు కలుగుతాయి. గొప్ప వ్యక్తుల సాంగత్యం కలుగుతుంది. రవి, కుజుల వల్ల వ్యాపారంలో ఆర్థిక ఇబ్బందులు ఎదురౌతాయి. ఉద్యోగంలో స్థాన చలనం, దుష్ట జన సహవాసంవల్ల తప్పుడు నిర్ణయాలు తీసుకుంటారు. స్వల్ప అనారోగ్య సమస్యలు ఇబ్బందిపెడతాయి. రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే :** రవి, శుక్రుల శుభస్థితివల్ల పట్టుదలతో పనిచేస్తే అంతిమ విజయం మీదే. ఆరోగ్యపరంగా శుభఫలితాలున్నాయి. బంధుమిత్రులతో ఇల్లు కళకళలాడుతుంది. శత్రువులు మిత్రులుగా మారతారు. కీర్తి ప్రతిష్ఠలు పెరుగుతాయి. సుఖ, సంతోషాలకు లోటుండదు. కుజ, బుధుల దోషం ఉంది. ఉద్యోగంలో స్థానచలన సూచితం. ఆర్థికంగా నియంత్రణ అవసరం. అధికారులతో జాగ్రత్తగా ఉండాలి. కుజ, బుధుల దోషం ఉంది. ఉద్యోగంలో స్థానచలన సూచితం. ఆర్థికంగా నియంత్రణ అవసరం. అధికారులతో జాగ్రత్తగా ఉండాలి. కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** శుక్రుని శుభస్థితివల్ల బుద్ధిబలంతో సమయానుకూలంగా అనుకున్నది సాధిస్తారు. కీర్తి ప్రతిష్ఠలు అందుకుంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. సంతోషకరమైన జీవితం కోసం కొన్ని జాగ్రత్తలు తీసుకోండి. ప్రధానంగా లక్ష్యంపై దృష్టి పెట్టాలి. అందరితో నవ్వుతూ మాట్లాడాలి. ఇబ్బంది పెట్టేవారు పక్కనే ఉండి సమస్యలను సృష్టిస్తారు. నిదానంగా వ్యవహరించండి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జులై :** శుక్రుని శుభస్థితివల్ల పట్టుదలతో పనులు సాధిస్తారు. ధనధాన్యాభివృద్ధి ఉంటుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. శ్రమ అధికమవుతుంది. కొన్ని విషయాల్లో చంచల స్వభావం ఉంటుంది. భయంగా అనిపిస్తుంది. బద్ధకం వదిలి పనిచేస్తే మంచి భవిష్యత్తు నిర్మించవచ్చు. ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. రవి, కుజ, బుధుల ధ్యాన  శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** రవి శుభస్థితివల్ల ఆత్మస్థైర్యంతో ధర్మబద్ధంగా వ్యవహరించి అనుకున్నది సాధిస్తారు. ఆరోగ్యం సహకరిస్తుంది. వస్త్ర ధాన్యాది లాభాలు కలుగుతాయి. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. ఆటంకాలను అధిగమించడానికి ముందుగానే మంచి నిర్ణయాలు తీసుకోవాలి. పనిలో ఒత్తిడి పెరగకుండా జాగ్రత్త పడాలి. ఆవేశపడరాదు. నిదానంగా వ్యవహరించండి. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** శుక్రుని శుభస్థితివల్ల దుఃఖనాశనం, మహాసౌఖ్యం, బంధుమిత్ర సమాగమం, రాజదర్శనం, రవి, కుజ, బుధుల దోషం ఉంది. కలహాలకు అవకాశం ఇవ్వకండి. ఉద్యోగంలో చెడుఫలితాలు రాకుండా, శక్తివంచన లేకుండా పనిచేయాలి. ఆందోళన చెందుతారు. అపార్థాలకు అవకాశం ఇవ్వకండి, మోసపోకండి. ఆరోగ్యంపై శ్రద్ధ వహించాలి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** కుజ, శుక్రుల శుభస్థితివల్ల పనిలో శీఘ్ర విజయం లభిస్తుంది. చిత్తశుద్ధితో పనిచేసి ప్రశంసలు అందుకుంటారు. ధర్మబద్ధంగా ముందుకెళతారు. కొన్ని విషయాలలో ధైర్యంగా వ్యవహరిస్తారు. రవి, బుధుల దోషం ఉంది. ఆచితూచి నిర్ణయాలు తీసుకోవాలి. శత్రువులు పెరుగుతారు. ప్రయాణాలకు సమయం వృథా అవుతుంది. చెడు వార్తలు వినాల్సి వస్తుంది. ఆర్థిక సమస్యలు తలెత్తకుండా జాగ్రత్త పడాలి. ఆరోగ్యం ఫర్వాలేదనిపిస్తుంది. రవి, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**నవంబరు :** కుజుని శుభస్థితివల్ల మనోధైర్యంతో పనిచేసి విజయం సాధిస్తారు. రవి, బుధ, శుక్రుల దోషం ఉంది. సంఘటనలు చికాకు కలిగిస్తాయి. ఆలోచనల్లో స్పష్టత లోపించకుండా ఇతరుల సలహాలు ఉపకరిస్తాయి. ఆర్థిక అవసరాలు పెరుగుతాయి. ఆరోగ్యం ఫర్వాలేదనిపిస్తుంది. రవి, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల ఈ నెలలో అదృష్టం పడుతుంది. గౌరవం లభిస్తుంది. ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న ఓ పని నెరవేరుతుంది. ఆరోగ్యం బాగుంటుంది. అధికార పరిధి పెరుగుతుంది. ఆనందోత్సాహాలతో ముందు కెళ్తారు. కుజుని దోషం ఉంది. ఖర్చులు అదుపు తప్పే సూచన. అనవసర ప్రయాణాలవల్ల సమయం వృథా కాకుండా జాగ్రత్త పడండి. కుజ ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల ఉత్సాహంగా పనిచేసి మంచి పేరు సంపాదిస్తారు. విజయాన్ని అందుకుంటారు. ఆర్థిక స్తోమత పెరుగుతుంది. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. కుటుంబ వాతావరణం అనుకూలంగా ఉంటుంది. ఆరోగ్యం అన్ని విధాలా సహకరిస్తుంది. కుజుని దోషం ఉంది. దుష్టులకు దూరంగా ఉండండి. కుజ ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** బుధ, శుక్రుల శుభస్థితివల్ల చక్కని ఆలోచనా విధానంతో మీదైన రంగంలో విజయం సాధిస్తారు. కీర్తి పెరుగుతుంది. ఆరోగ్యం బాగుంటుంది. అదృష్టప్రాప్తి ఉంది. బంధువుల సహకారం లభిస్తుంది. రవి, కుజుల దోషం ఉంది. శ్రమ అధికమవుతుంది. స్థానచలన సూచన. కొందరి ప్రవర్తన అపార్థాలకు దారితీస్తుంది. మనశ్శాంతి కొరకై రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** శుక్రుని శుభస్థితివల్ల కుటుంబ సభ్యులతో ఆనందంగా గడుపుతారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. పనిలో విజయం రావాలంటే శ్రద్ధతో పనిచేయాలి. చెడు సావాసాలు చేయరాదు. కలహాలకు దూరంగా ఉండాలి. ఆర్థిక ఖర్చులు పెరగకుండా జాగ్రత్త పడాలి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.



# మీనరాశి ఫలితములు

| ఆదాయం - 5 | వ్యయం - 14 | రాజపూజ్యం - 6 | అవమానం - 5 |
|---|---|---|---|



**జ్యో**తిష ఫలితాలు రెండు విధాలు.

1. **జాతక ఫలితం :** జన్మలగ్నాత్ దశాగ్రహం ఉన్న స్థితిని బట్టి ఫలితాలు. దీన్నే దశాఫలితం అంటారు.

2. **గోచార ఫలితం :** జన్మరాశి నుండి వర్తమాన గ్రహస్థితి ఫలితం.

ఈ జాతక, గోచార ఫలితాల్లో రెండూ జీవితంపై ప్రభావం చూపుతాయి. దశ, గోచారం రెండూ బాగుంటే అత్యంత శుభ ఫలితం. దశ బాగుండి గోచారం దెబ్బతింటే 50% శుభం, 50% అశుభం. అంటే మిశ్రమ ఫలితం. ఇదే విధంగా గోచారం బాగుండి జాతకదశ సరిగా లేకపోతే మిశ్రమ ఫలితం ఉంటుంది. గోచారం మరియు జాతక దశ రెండూ దోషఫలితాలైతే ఇబ్బంది అధికమవుతుంది.

## సంవత్సర గోచార ఫలితాలు :

11-8-2016 వరకు గురువు - షష్ఠంలో ఉన్నందున కుటుంబ సభ్యులతో జాగ్రత్తగా మాట్లాడాలి. లేనిచో కుటుంబ సభ్యులతో విభేదాలు వస్తాయి. ఇంటా బయటా గొడవలు, అధికారుల వల్ల భయం, చోరభయం, అగ్నిభయం సూచితం. గురు ధ్యానశ్లోకం చదువుకోవాలి. 2-11-2014 నుండి 26-1-2017 వరకు మరియు 21-6-2017 నుండి 26-10-2017 వరకు శని నవమంలో ఉన్నందున కుటుంబ సభ్యులకు అనారోగ్య సమస్యలు వస్తాయి. శ్రమ అధికంగా ఉంటుంది. కొద్దిగా సుఖం, ధనం ఉంటాయి. శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు రాహువు - షష్ఠంలో

ఉండుటచే ధైర్యంగా వ్యవహరిస్తారు. శత్రువులు ఓడిపోతారు. శుభం జరుగుతుంది. భూలాభములు చేకూరుతాయి. 30-1-2016 నుండి 18-8-2017 వరకు కేతువు - వ్యయంలో ఉండుటచే చేపట్టే పనుల్లో ఆటంకాలు వస్తాయి. దారిద్ర్యం, శత్రుభయం, ధననష్టాలు సంభవిస్తాయి. కంటి సమస్యలు ఇబ్బంది పెడతాయి. విదేశీయానం సూచితం. కేతు ధ్యాన శ్లోకం చదువుకోవాలి. 11-8-2016 నుండి 12-9-2017 వరకు గురువు - సప్తమంలో ఉన్నందున గతంలో పరిష్కారం కాని కొన్ని సమస్యలు పరిష్కారమవుతాయి. పెద్దలవల్ల, అధికారుల వల్ల మేలు జరుగుతుంది. చేపట్టే పనుల్లో విజయం సాధిస్తారు. హుందాగా ఉంటారు. ఆరోగ్యం బాగుంటుంది. ఉల్లాసంగా ఉత్సాహంగా ఉంటారు. 26-1-2017 నుండి 21-6-2017 మరియు 26-10-2017 నుండి 24-1-2020 వరకు శని - దశమంలో ఉన్నందున శ్రద్ధతో పనిచేయాలి. లేనిచో వృత్తిలో ఆటంకాలు కలుగుతాయి. ఒక చెడువార్త వింటారు. శని ధ్యాన శ్లోకం చదువుకోవాలి.

## నెలవారీ ఫలితాలు :

**ఏప్రిల్ :** శుక్రుని వల్ల ధనలాభం. మీరు అనుకున్న పనులను నిర్విఘ్నంగా పూర్తి చేస్తారు. మానసికంగా దృఢంగా ఉంటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. ఆరోగ్య సమస్యలు ఎదురవుతాయి. ఉద్యోగంలో స్థాన చలన సూచనలున్నాయి. బంధుమిత్రులతో ఆచితూచి వ్యవహరించాలి. మనస్థాపం చెందుతారు. శారీరక శ్రమ పెరుగుతుంది. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మే :** బుధ, శుక్రుల శుభస్థితివల్ల ఆర్థిక శక్తి పెరుగుతుంది. కుటుంబపరంగా కలిసివస్తుంది. సమాజంలో మీ మాటకు విలువ పెరుగుతుంది. రవి, కుజుల దోషం ఉంది. వ్యాపారంలో ఆర్థికపరమైన జాగ్రత్తలు తీసుకోవాలి. ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేయరాదు. రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జూన్ :** రవి, బుధ, శుక్రుల శుభస్థితివల్ల భవిష్యత్తుకు సంబంధించిన విషయాలలో స్పష్టత వస్తుంది. మనోభీష్టం నెరవేరుతుంది. ఆదాయమార్గాలు పెరుగుతాయి. విందు వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధుమిత్రుల అండదండలు లభిస్తాయి. పిల్లల ప్రగతి ఆనందాన్ని కలిగిస్తుంది. ఆరోగ్యరీత్యా శుభఫలితాలున్నాయి. కుజుని దోషం ఉంది. ఖర్చులు అదుపులో ఉంచుకోవాలి. స్థానచలన సూచితం. కుజ ధ్యాన శ్లోకం చదివితే మంచి జరుగుతుంది.

**జులై :** బుధ, శుక్రుల శుభస్థితివల్ల ఏకాగ్రతతో పనిచేసి సత్ఫలితాల్ని అందుకుంటారు. మాతృసౌఖ్యం కలదు. కీర్తి ప్రతిష్ఠలు వరిస్తాయి. ఆర్థిక శక్తి పెరుగుతుంది. రవి, కుజుల దోషం ఉంది. ప్రయాణాల్లో జాగ్రత్తలు అవసరం. కుటుంబ సభ్యులతో సఖ్యతగా ఉండాలి. ఆరోగ్యంపై శ్రద్ధ వహించాలి. రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఆగష్టు :** బుధుని శుభస్థితివల్ల మనోధైర్యంతో ముందుకెళతారు. విజ్ఞానపరంగా అభివృద్ధి చెందుతారు. రవి, కుజ, శుక్రుల దోషం ఉంది. విశ్రాంతి లోపిస్తుంది. పొదుపు సూత్రాన్ని పాటించాలి. తొందరపాటు చర్యలొద్దు. ఎవ్వరినీ ఎక్కువగా నమ్మరాదు. రవి, కుజ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**సెప్టెంబరు :** రవి శుభస్థితివల్ల ఆరోగ్యం బాగుంటుంది. ఆత్మస్థైర్యంతో పనులు పూర్తిచేస్తారు. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. శ్రమ అధికమవుతుంది. అధికారులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. ఆవేశపూరిత నిర్ణయాలు తీసుకోరాదు. అనవసరమైన ఖర్చులు చేయరాదు. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**అక్టోబరు :** బుధ, శుక్రుల శుభస్థితివల్ల మనోధైర్యంతో అద్భుతమైన విజయాలు సాధిస్తారు. వస్త్ర, ధాన్యలాభాలు ఉంటాయి. పండితులతో విజ్ఞాన సంబంధమైన విషయాలు చర్చిస్తారు. ఆలోచనా పరిధి పెంచుకుంటారు. బంధుమిత్రులను కలుస్తారు. రవి, కుజుల దోషం ఉంది. బద్ధకాన్ని వీడనాడాలి. చైతన్యవంతంగా పనిచేయాలి. అనారోగ్య సమస్యలు ఇబ్బందిపెడతాయి. చిరునవ్వుతో కష్టాలను దూరం చేసుకోవచ్చని మరువకండి. రవి, కుజుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**నవంబరు :** శుక్రుని శుభస్థితివల్ల చిత్తశుద్ధితో పనిచేసి విజయాలను సొంతం చేసుకుంటారు. ధర్మకార్యాలను చేపడతారు. మీ స్వధర్మం మిమ్మల్ని కాపాడుతుంది. రవి, కుజ, బుధుల దోషం ఉంది. అపకీర్తి కలిగించేవారు ఎదురవుతారు. వృథా ప్రయాణాలు తప్పకపోవచ్చు. ఒక వార్త మిమ్మల్ని మనస్తాపానికి గురిచేస్తుంది. ఆరోగ్యం ఫర్వాలేదనిపిస్తుంది. భయాందోళనలు విడనాడాలి. రవి, కుజ, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**డిసెంబరు :** కుజుని శుభస్థితివల్ల పెద్దల ఆశీర్వచనంతో విజయం సాధిస్తారు. విశేష ధనలాభం సూచితం. ఆరోగ్యం సహకరిస్తుంది. కీలక సమయాల్లో ధైర్యంగా వ్యవహరిస్తారు. రవి, బుధ, శుక్రుల దోషం ఉంది. సకాలంలో పనులు పూర్తిచేసుకోవాలి. ఖర్చులు అదుపు తప్పకుండా జాగ్రత్తపడాలి. కలహాలకు తావివ్వరాదు. చేయని పొరపాటుకు బాధ్యత వహించాల్సి వస్తుంది. రవి, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**జనవరి 2017 :** రవి శుభస్థితివల్ల ఒక ముఖ్యమైన విషయమై పెద్దలను కలుస్తారు. ఆత్మవిశ్వాసం మరియు పట్టుదలతో అనుకున్న పనిని సాధిస్తారు. మీ విజయానికి మిత్రుల సహకారం తోడవుతుంది. కుజ, బుధ, శుక్రుల దోషం ఉంది. ఆర్థికంగా నష్టాలు రాకుండా ముందే జాగ్రత్తలు తీసుకోవాలి. బంధువులతో చనువుగా ఉండరాదు. సమయానికి ఆహార విశ్రాంతులు తీసుకోవాలి. మనశ్శాంతి కోసం దైవధ్యానం చేయాలి. కుజ, బుధ, శుక్రుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**ఫిబ్రవరి :** రవి, శుక్రుల శుభస్థితివల్ల ప్రయత్నపూర్వక కార్యసిద్ధి ఉంది. ఆర్థికంగా అనుకూల ఫలితాలు ఉన్నాయి. ఆచార సాంప్రదాయాలకు పెద్దపీట వేస్తారు. ఇంట్లో శుభకార్యక్రమాలు జరుగుతాయి. కుజ, బుధుల దోషం ఉంది. దుష్టులకు దూరంగా ఉండాలి. కుటుంబ సభ్యుల సహకారం లోపిస్తుంది. అందరితో మృదువుగా మాట్లాడండి. సమయపాలన పాటించండి. కుజు, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

**మార్చి :** శుక్రుని శుభస్థితివల్ల ఏకాగ్రతతో పనిచేసి విజయం సాధిస్తారు. ఆర్థికంగా పురోగతి ఉంటుంది. శుభవార్తలు వింటారు. రవి, కుజ, బుధుల దోషం ఉంది. శారీరక శ్రమ అధికమవుతుంది. ఆప్తులతో మాటపట్టింపులకు పోకండి. ఆపద, అవమానాలను మనోధైర్యంతో తట్టుకోవాలి. రవి, కుజు, బుధుల ధ్యాన శ్లోకాలు చదివితే మంచి జరుగుతుంది.

# శ్రీ దుర్ముఖి నామ సంవత్సర రోజువారీ సవ్య చక్రాలు

| | | | |
|---|---|---|---|
| శు లగ్న రవి | చంద్ర బు | | |
| కే | 08-04-2016 | | |
| | శుక్రవారము | | గు(వ) రా |
| | కు శ (వ) | | |

| | | | |
|---|---|---|---|
| శు లగ్న రవి | బు | చంద్ర | |
| కే | 11-04-2016 | | గు(వ) రా |
| | సోమవారము | | |
| | కు శ(వ) | | |

| | | | |
|---|---|---|---|
| శు లగ్న | రవి బు | | చంద్ర |
| కే | 14-04-2016 | | |
| | గురువారము | | గు(వ)రా |
| | కు శ(వ) | | |

| | | | |
|---|---|---|---|
| శు లగ్న రవి | బు చంద్ర | | |
| కే | 09-04-2016 | | |
| | శనివారము | | గు (వ) రా |
| | కు శ(వ) | | |

| | | | |
|---|---|---|---|
| శు లగ్న రవి | బు | | చంద్ర |
| కే | 12-04-2016 | | |
| | మంగళవారము | | గు(వ) రా |
| | కు శ(వ) | | |

| | | | |
|---|---|---|---|
| శు లగ్న | రవి బు | | |
| కే | 15-04-2016 | | చంద్ర |
| | శుక్రవారము | | గు(వ) రా |
| | కు శ(వ) | | |

| | | | |
|---|---|---|---|
| శు లగ్న రవి | బు | చంద్ర | |
| కే | 10-04-2016 | | |
| | ఆదివారము | | గు(వ) రా |
| | కు శ(వ) | | |

| | | | |
|---|---|---|---|
| శు లగ్న రవి | బు | | చంద్ర |
| కే | 13-04-2016 | | |
| | బుధవారము | | గు(వ) రా |
| | కు శ(వ) | | |

| | | | |
|---|---|---|---|
| శు లగ్న | రవి బు | | |
| కే | 16-04-2016 | | చంద్ర |
| | శనివారము | | గు(వ) రా |
| | కుశ(వ) | | |

## వధూవరులకు ఏక నక్షత్రమైనను దోషములేని నక్షత్రములు

**శ్లో ॥ విశాఖికార్ద్ర శ్రవణ ప్రజేశ తిష్యాంతతత్పూర్వమఖాః ప్రశస్తాః**
**స్త్రీ పుంసతారై క్య పరిగ్రహేతుః శేషావివర్జ్యా ఇతిసంగిరంతి ॥**

**తా ॥** విశాఖ, ఆర్ద్ర, శ్రవణ, రోహి, పుష్య, రేవతి, ఉత్తరాభాద్ర, మఖ – ఈ రాశి నక్షత్రములలో జన్మించిన వధూవరులకు ఏక నక్షత్రంబైనను వివాహము శుభంబు. తక్కినవి పనికిరావు. అని "విధిరత్న" వచనమే కాక "ముహూర్తదర్పణ" ములో కూడా పై 8 నక్షత్రములే చెప్పబడినవి.

### -: రాశికూట విషయ వివరణము :-

**ముహూర్త దర్పణ గ్రంథానుసారము :–** శ్లో ॥ ద్వికే ద్వాదశకే మృత్యు ః (౨– ౧౨ మృత్యువు) ఆయుర్ద్వాదశ కేద్వికే (౧౨– ౨ ఆయువు) తృతీయైకాదశం దుఃఖం (౩– ౧౧ దుఃఖం) సుఖమేకాదశత్రికే (౧౧– ౩ సుఖం) చతుర్దశకేనిస్వం (౪– ౧౦ దారిద్ర్యం) ధనం దశచతుర్థకే (౧౦– ౪ ధనం అశుభం పంచనమే (౫– ౯ అశుభం) శుభంతు నవపంచకే (౯– ౫ శుభం) షష్టాష్టకే పుత్రనాశః (౬– ౮ పుత్రనాశము) పుత్రలాభోష్ట షష్టకే (౮– ౬ పుత్రలాభం) నమసప్తేతు మాంగల్యం (౭– ౭ మాంగల్యము) దంపత్యోః ప్రీతివర్ధనం. పై శ్లోకానుసారము వధూవరుల అష్టకూట పొంతనములో రాశి కూటములు శుభప్రదము లెవ్వియో, అశుభప్రదము లెవ్వియో తెలుపబడినవి.

### వివాహ సంబంధముగ వధూవరులకు నక్షత్ర రాసుల పొంతనము

**శ్లో ॥ దంపత్యోర్జన్మనక్షత్ర మేకపాదంగతం యది ః తయో ః పరస్పరం నిత్యం అత్యంత కలహోభవేత్ ।**
**దంపత్యో రేకరాసిత్యే భిన్నరంభవేద్య ది । నక్షత్రేకం భిన్నరాశౌ నాడీ దోషో న విద్యేతే ॥**

తా ॥ వధూవరులకు ఏకనక్షత్రము, ఏకపాదమైన పరస్పర కలహమును, ఏక రాసియైనచో నక్షత్రభేదమును, ఒకేనక్షత్రమైన రాసి భేదమైనచో నాడీ దోషము లేదు.

## కుజదోషములేని నక్షత్రములు

అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, ఉత్తర, స్వాతి, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ఉత్తరాభాద్ర, రేవతి – ఈ నక్షత్రములందు జన్మించినవారికి కుజదోషము లేదు.

## కుజదోష విచారము

**శ్లో ॥ కుటుంబేచ వ్యయే సౌఖ్యే సప్తమే చాష్టమే కుజే ।**
**నరాణాం స్త్రీ వధం కుర్యాత్ స్త్రీణాం భర్తృవధం తథా ॥**

**తా ॥** 2, 12, 4, 7, 8 – ఈ రాసులలో కుజుడున్నచో పురుషులకు భార్య చనిపోవును. స్త్రీలకు భర్త చనిపోవును.

**శ్లో ॥ కించ ॥ అర్కేందు క్షేత్ర జాతానాం కుజదోషో న విద్యతే ॥**

**తా ॥** ఆర్క – సూర్యుడు, ఇందు – చంద్రుడు, వీరి రాసులగు సింహ, కర్కాటక రాసులందు పుట్టినవారికి కుజదోషములేదు.

**శ్లో ॥ కించ ॥ స్వోచ్ఛ మిత్రభ జాతానాం పీడకో న భమేత్కు జః ॥**

**తా ॥** అంగారకునికి స్వ క్షేత్రములైన మేష, వృశ్చిక రాసులందును, ఉచ్ఛ అయిన మకర రాసియందును, కుజునికి మిత్రులైన గురు, రవి, రాసులైన ధనుః మీనం, సింహరాసులందు పుట్టినవారికి కుజదోషము లేదు.

**శ్లో ॥ కించ దేవకేర ళే ॥ ద్వితీయే భౌమదోషస్తు యుగ్మకన్యకయోర్వినా ॥**

**తా ॥** మిధున, కన్య రాసులందు పుట్టినవారికి రెండవ యింట యందున్న కుజదోషము లేదు.

**శ్లో ॥ ద్వాదశే భౌమదోషస్తు వృషతౌళిక యోర్వినా ॥**

**తా ॥** తుల, వృషభరాసులందు పుట్టినవారికి పన్నెంటింటనున్న కుజదోషము లేదు.

**శ్లో ॥ చతుర్థే భౌమదోషస్తు మేష వృశ్చిక యోర్వినా ॥**

**తా ॥** మేష, వృశ్చిక రాసులందు పుట్టినవారికి నాల్గవయింట వున్న కుజదోషము లేదు.

**శ్లో ॥ సప్తమే భౌమదోషస్తు నక్రకర్కట యోర్వినా ॥**

**తా ॥** మకర, కర్కాటక రాసులందు పుట్టినవారికి ఏడింటనున్న కుజదోషము లేదు.

**శ్లో ॥ అష్టమే భౌమదోషస్తు ధనుర్మీన ద్వయోర్వినా ॥**

**తా ॥** ధనుస్సు, మీనరాసులందు పుట్టినవారికి ఎనిమిదవయింట నున్న కుజదోషము లేదు.

**శ్లో ॥ కుంభే సింహే నదోషస్యాత్ ప్రత్యక్షం దేవకేరళే ॥**

**తా ॥** కుంభము, సింహము యీ రాసులందు పుట్టినవారికి కుజదోషము లేదని దేవకేరళమను గ్రంథమునందు చెప్పబడినది.

శ్లో ॥ **గురుమంగళ సంయోగే భౌమదోషో నవిద్యతే ॥**

తా ॥ కుజుడు గురువుతో కలిసియున్నను, గురువుచేత చూడబడియున్నను అట్టి జాతకునికి కుజదోషము లేదు.

శ్లో ॥ **ద్వితీయే ద్యూనగే పుంసాం స్త్రీణాం చత్వారి రివృగే ।**

తా ॥ పురుషులకు రెండవయింట, ఏడవయింట కుజుడున్న ఎక్కువ దోషము. స్త్రీలకు నాలుగు ఎనిమిది యిండ్లయందు కుజుడున్న ఎక్కువ దోషము.

శ్లో ॥ **ఉపయో రష్టమం దోషం భౌమదోషం వదేద్బుధ :**

తా ॥ స్త్రీలకు గాని, పురుషులకు గాని ఎనిమిదవయింటగాని కుజుడున్నచో ఎక్కువ దోషము.

శ్లో ॥ **దంపత్యో ర్జన్మకాలే వ్యయ ధనహిబుతె సప్తమే రంధ్రలగ్నే లగ్నా చంద్రాశ్చ శుక్రాదసి ఖలు నివసన్ భూమి పుత్రస్తయోశ్చః**

తా ॥ దంపతులు పుట్టినరాశికి పండ్రెండు, రెండు, నాలుగు ఎనిమిది లగ్నముల నెక్కడ కుజుడున్నను దోషము. జన్మలగ్నము నుండి కాని, చంద్రుడున్న రాశినుండి గాని, శుక్రుడున్న రాశి నుండిగాని కుజదోషమును చూచుచుండవలయును. దంపతులకు జన్మరాశి, చంద్రరాశి శుక్రరాశు లనుండి ఎచ్చట కుజదోషమున్నను పరిహారమగును.

శ్లో ॥ **దాంపత్యం దీర్ఘకాలం సుత ధన బహుళం పుత్రలాభంచ సౌఖ్యం దద్యాలేకత్రహీనో మృతి రఖిలభయం పుత్రనాశం కరోతి ॥**

తా ॥ ఈ విధముగ కుజదోష పరిహారమున్నచో దంపతులకు దీర్ఘకాల దాంపత్యము, సంతానము, ఎక్కువ ధనము, సౌఖ్యము కలిగియుండును. దంపతులలో నేనొక్కరికి కుజదోషము ఉన్ననూ మరణము, భయము, సంతాన నష్టము కలుగును.

## ఏకోదర సంస్కార నిర్ణయము

అన్నదమ్ములకు సమానమైన సంస్కారము ఏక ముహూర్తమున చేయకూడదు. అథవా ఆరు మాసములయిన సంధి యుండవలయును. లేదా ఫాల్గుణ మాసములో నొకరికిని, ముందురాగల చైత్ర-వైశాఖములలో నొకరికిని చేయుట కలదు. లేక తప్పనిసరిగా చేయవలసిన పరిస్థితులలో ఆయన భేదము చేతను, అథమ పక్షమున ఋతు భేదముచేతను చేసికొనుచున్నారు. అన్నా చెల్లెలు సంస్కారమొక ముహూర్తమున చేయవచ్చును. తన పుత్రికను ఇచ్చిన ఇంటిలో తన కుమారునకు కన్యను తేకూడదు. మొదలు ఇవ్వబడిన పుత్రిక జీవించియుండగ మరొక పుత్రికను తిరిగి యివ్వకూడదు. పుత్రికా జ్యేష్ఠ పుత్రులకు చేయు సంస్కారమును విడిచి కనిష్ఠ పుత్రిక, పుత్రులకు చేయకూడదు. జ్యేష్ఠ సంతానమునకు జ్యేష్ఠమాసమున, జ్యేష్ఠనక్షత్రము గలవారికిని త్రిజ్యేష్ఠము గనుక వివాహాది శుభకార్యములు చేయకూడదు. జన్మ జన్మతిథి, జన్మనక్షత్రము, జన్మలగ్నములకు శుభకార్యములు చేయకూడదు.

# వింశతి వర్గములు

దైవజ్ఞులు వివాహ ప్రకరణమున వధూవరుల పొంతనములను గూర్చి కొందరు వింశతి వర్గములనియు, కొందరు ద్వాదశ వర్గములనియు, కొందరు దశవర్గములనియు, కొందరు అష్టవర్గములనియు, కొందరు షడ్వర్గములు ప్రధానమనియు, కొందరు చతుర్వర్గములు ప్రధానమనియు చెప్పుచున్నారు.

శాస్త్రముల అభిప్రాయము ననుసరించి ఇరువది వర్గములు ఈ క్రింద వివరించబడుచున్నవి.

## వింశతి వర్గ నామములు

1. గ్రహమైత్ర వర్గము
2. గణవర్గము
3. స్త్రీదీర్ఘ వర్గము
4. యోనివర్గము
5. నాడీవర్గము
6. రాశివర్గము
7. మహేంద్రవర్గము
8. గణితగతాయుష్య వర్గము
9. ఆయవర్గము
10. వశ్యవర్గము
11. దినవర్గము
12. జాతివర్గము
13. వేదావర్గము
14. పక్షివర్గము
15. రజ్జువర్గము
16. యోగినీవర్గము
17. లింగవర్గము
18. భూతవర్గము
19. చంద్రయోగవర్గము
20. గోత్రవర్గము



## 1. గ్రహమైత్రవర్గః వివరణము :

| గ్రహములు | రవికి | చంద్రునకు | కుజునకు | బుధునకు | గురువునకు | శుక్రునకు | శనికి |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రులు | చం–కు–గు | ర–బు | ర–చం–గు | ర–శు | ర–చం–కు | బు–శ | బు–శు |
| సములు | బు | కు–గు–శు–శ | శు–శ | కు–గు–శ | శ | కు–గు | గు |
| శత్రువులు | శు–శ | లేరు | బు | చం | బు–శు | ర–చం | ర–చం–కు |

ఈ చక్రము నైసర్గికమగు (స్వభావసిద్ధమగు) శత్రుత్వమును, మిత్రత్వమును, సమత్వమును తెలియజేయుచున్నది.

## విశేషములు

రాశిచక్రమునందు గ్రహమునకు 2-3-4-10-11-12 స్థానములయందు గల గ్రహములు తాత్కాలిక మిత్రులగుచున్నారు. 1-5-6-7-8-9 స్థానములయందు గల గ్రహములు తాత్కాలిక శత్రువులగుచున్నారు.

నైసర్గిక మిత్రులు తాత్కాలిక మిత్రులయిన, అధి మిత్రులగుచున్నారు.

నైసర్గిక శత్రువులు తాత్కాలిక శత్రువులైన అధి శత్రువులగుచున్నారు.

నైసర్గిక మిత్రులు తాత్కాలిక శత్రువులైనను, నైసర్గిక శత్రువులు తాత్కాలిక మిత్రులైనను సములు అగుచున్నారు. నైసర్గిక సములు తాత్కాలిక శత్రువులైన శత్రువులుగానే అగుచున్నారు. తాత్కాలిక మిత్రులైన మిత్రులుగానే అగుచున్నారు అని తెలియదగియున్నది.

**1. ఫలం :** వధూవరుల యొక్క జన్మ రాశ్యాధిపతులు మిత్రులైనను, ఏకరాశ్యాధిపత్యము కలిగియున్నను శుభప్రదము. శత్రువులైన వధూవరులు పరస్పరము కలహము కలవారగుదురు.

**2. గణవర్గము :** పునర్వసు, పుష్యమి, స్వాతి, హస్త, శ్రవణం, రేవతి, అనూరాధ, మృగశిర, అశ్విని - ఈ తొమ్మిది నక్షత్రములు దేవగణ నక్షత్రములు. రోహిణి, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, ఆర్ద్ర, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర - ఈ తొమ్మిది నక్షత్రములు మనుష్యగణ నక్షత్రములు.

కృత్తిక, ఆశ్లేష, మఖ, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం - ఈ తొమ్మిది నక్షత్రములు రాక్షసగణ నక్షత్రములు.

**ఫలంః** శ్లో ॥ **స్త్రీ రాక్షసగణాజ్ఞాతా హంతి మర్త్యగణం పరమ్ ।**

తా ॥ వధూవరుల నక్షత్రములు ఏకగణమైన ఉత్తమం, దేవమనుష్య గణములలో చేరిన మధ్యమం, దేవరాక్షస గణములలో చేరిన అశుభం, మనుష్యరాక్షస గణములలో చేరిన మరణం అని తెలియదగినది.

**3. స్త్రీదీర్ఘ వర్గము :** **వధూనక్షత్రమారభ్య వరభంచోర్ధ్వ సంస్థితమ్ ! వరభం శుభదంప్రోక్తమితిదైవవిదాంవరైః ।**

**ఫలం :** తా ॥ వధూనక్షత్రము మొదలు వరనక్షత్రమువరకు లెక్కించగా ప్రథమ నవకములో చేరియున్న అశుభం, సదా కలహప్రదము అనియు, రెండవ నవకములో చేరియున్న మధ్యమ ఫలము అనియు, మూడవ నవకములో చేరియున్న శుభదాయకము, సుఖదాయకము అనియు దైవజ్ఞులలో కొందరు చెప్పుచున్నారు. మరికొందరు అట్లు లెక్కించుటలో వరనక్షత్రము వధూనక్షత్రము నుంచి 13

నక్షత్రములకు పైనయున్న అత్యంత శుభదాయకమని చెప్పుచున్నారు. మరికొందరు వర నక్షత్రము వధూనక్షత్రమునకు పై సంఖ్యలోనున్న శుభకరమేననియు చెప్పుచున్నారు.

**4. యోనివర్గము :** అశ్విని–శతభిషం గుఱ్ఱములు, భరణి–రేవతి యేనుగులు, కృత్తిక–పుష్యమి మేకలు, రోహిణి–మృగశిర సర్పములు, ఆర్ద్ర–మూల కుక్కలు, పున–ఆశ్రేష పిల్లులు, మఖ–పుబ్బ ఎలుకలు, హస్త–స్వాతి ఎనుములు, చిత్త–విశాఖ పులులు, అనూ–జ్యేష్ఠ జింకలు, ఉ.ఫ.–ఉ.భా. ఆవులు, అభి–ఉ–షా ముంగిసలు, పూ.భా. –ధని– సింహములు, పూ.షా–శ్రవ–కోతులు. ఈ నక్షత్రముల జంటలో మొదటి నక్షత్రము పురుష నక్షత్రము గాను, రెండవ నక్షత్రము స్త్రీ నక్షత్రముగాను తెలియదగియున్నది.

**ఫలం :** **తా ॥** స్త్రీ, పురుషులు ఏక యోనివర్గములో చేరియున్న సంపద కలుగును. వేరు వేరు యోనివర్గములలో నున్న మధ్యమ ఫలము. శత్రుత్వముగల యోని వర్గములలో చేరిన అశుభప్రదము మరియు స్త్రీ తారలకు స్త్రీ తారల తోటి సంబంధము కలుగకూడదు. అట్లు జరిగెనేని మధ్యమ ఫలము, పురుష తారలకు పురుష తారలతోటి సంబంధము కలిగిన దాంపత్యము సర్వకాల సర్వావస్థల యందును కలహములు కలదై అశుభమును పొందుచున్నది.

## నైసర్గిక విరోధముగల జంటల వివరము

1. గో–వ్యాఘ్రములు
2. గజ–సింహములు
3. అశ్వ–మహిషములు
4. శునక–హరిణములు
5. నకుల–సర్పములు
6. వానర–మేషములు
7. మార్జాల–మూషకములు

ఇటుల యే నక్షత్రములకు పరస్పర విరోధము స్వతస్సిద్ధమో అట్టి విరుద్ధ నక్షత్రముల సంబంధము కలిగిన వధూవరులు సదా వైరములు కలవారై యుందురు అని తెలియదగియున్నది.

**5. నాడీవర్గః ॥** (18) చతుష్పాన్నక్షత్రములు – ఈ నక్షత్రములయందు బుట్టిన స్త్రీకి అశ్విన్యాదిగా మూడు వ్రేళ్ళయందును,

**ఫలం :** (6) త్రిపాన్నక్షత్రములు – ఈ నక్షత్రములయందు బుట్టిన స్త్రీకి కృత్తిక మొదలుగా నాలుగు వ్రేళ్ళయందును, (3) ద్విపానక్షత్రములు – ఈ నక్షత్రములయందు బుట్టిన స్త్రీకి మృగశిర మొదలుగా అయిదు వ్రేళ్ళయందును లెక్కించగా కన్యాజన్మ నక్షత్రము వరుని జన్మ నక్షత్రమున్న వ్రేలియందు కాక మరియొక వ్రేలియందున్న శుభకరమున్నూ సౌభాగ్య ప్రదాయకమున్నూ అగుచున్నది. అని తెలియవలెను.

**6. రాశివర్గ ః ॥**

**ఫలం :**

స్త్రీ రాశికి – పురుష రాశి 12 అయిన
పురుషరాశికి – స్త్రీ రాశి 2 అయిన } దీర్ఘాయుష్యం

వ్యుత్క్రమముగా

స్త్రీ రాశికి – పురుషరాశి 2 అయిన
పురుషరాశికి – స్త్రీ రాశి 12 అయిన } మృత్యువు

ఇటులనే పై భాగములను తెలియదగియున్నది. అనగా స్త్రీ రాశికి, పురుషరాశి 12–11–10–9–8 అయిన క్రమముగా దీర్ఘాయుష్యం, సౌఖ్యం, ధనసమృద్ధి, శుభము, పుత్రసంపదలు గలుగును. శుభకరములు అని తెలియవలెను.

స్త్రీ రాశికి, పురుషరాశి 2–3–4–5–6 అయిన క్రమముగా మరణము, దుఃఖము, దారిద్ర్యము, అశుభము, పుత్రనాశనము కలుగును గాన అశుభకరమని తెలియదగియున్నది.

స్త్రీ రాశి పురుషరాశి ఒక్కటియైనను సమ సప్తక రాశులైనను అత్యుత్తమము. అనగా పుత్రలాభము, అన్యోన్యానురాగము, మాంగల్యము, సర్వసంపదలు లభించును. శుభదాయకము అని తెలియదగియున్నది.

**7. మహేంద్రవర్గ ః ॥**

**ఫలం :** వధూనక్షత్రం మొ॥ వరనక్షత్రం వరకు గణనము చేయగా 4–7–10–13–16–19–22–25 ఈ యెనిమిది వర్గములు మహేంద్ర వర్గములు. ఈ సంఖ్యలు వచ్చెనేని దంపతులకు సుపుత్ర ప్రదములు. ఇతర వర్గములు (అనగా 1–2–3–5–6–8– 9–11–12–14 –15–17–18–20–21–23–24–26–27) ఈ సంఖ్యలు వచ్చెనేని దంపతులకు కలహ ప్రదములు అని తెలియవలెను.

**8. గణితగతాయుష్య వర్గః ॥** వధూవరుల జన్మనక్షత్రములలో వధూనక్షత్రము మొదలు వరనక్షత్రము వరకు (అభిజిత్తుతో లెక్కించవలెను) లెక్కించి ఆ సంఖ్యను 7చే గుణించి 28 చే భాగించగా మిగిలిన శేషము వధూశేషము. తిరిగి ఇటులనే వరనక్షత్రము మొదలు వధూనక్షత్రము వరకు (అభిజిత్తుతో లెక్కించవలెను) లెక్కించి ఆ సంఖ్యను 7చే పెంచి 28చే భాగించగా మిగిలిన శేషము వరశేషము.

**ఫలం :** ఈ వరశేషము వధూశేషము కంటే తక్కువ అగునెడల దంపతులలో ముందు పురుషునకు మరణం కలుగును. వరశేషమధికమాయెనేని ముందు స్త్రీకి మరణం కలుగును అని తెలియవలెను.

**9. ఆయవర్గ ః ॥**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తూర్పు | – | ధ్వజ | అశ్విని | ఆశ్రేష | అనూరాధ | పూర్వాభాద్ర |
| ఆగ్నేయం | – | ధూమ | భరణి | మఖ | జ్యేష్ఠ | ఉత్తరాభాద్ర |
| దక్షిణం | – | సింహ | కృత్తిక | పుబ్బ | మూల | రేవతి |
| నైఋతి | – | శునక | రోహిణి | ఉత్తర | పూర్వాషాఢ | |
| పడమర | – | వృషభ | మృగశిర | హస్త | ఉత్తరాషాఢ | |
| వాయవ్యం | – | ఖర | ఆర్ద్ర | చిత్త | శ్రవణం | |
| ఉత్తరం | – | గజ | పునర్వసు | స్వాతి | ధనిష్ఠ | |
| ఈశాన్యం | – | కాక | పుష్యమి | విశాఖ | శతభిషం | |

**ఫలం :** వధూవరుల జన్మ నక్షత్రములలో పురుష జన్మనక్షత్రము యే ఆయముగల నక్షత్రములలో నున్నదో తెలుసుకొని ఆ ఆయమునకు అయిదవ ఆయమునగల నక్షత్రములయందు స్త్రీ జన్మ నక్షత్రముండెనేని నిత్యము వధూవరులు కలహములు కలిగియుందురు.

**10 వశ్యవర్గః ॥**

| | | |
|---|---|---|
| మేషరాశికి | సింహవృశ్చికరాశులు | వశ్యములు |
| వృషభరాశికి | కటక తులా రాశులు | ॥ |
| మిధునరాశికి | కన్యారాశి | ॥ |
| కటకరాశికి | వృశ్చిక ధనూ రాశులు | ॥ |
| సింహరాశికి | తులారాశి | ॥ |
| కన్యారాశికి | మీన మిధున రాశులు | ॥ |
| తులారాశికి | మకర కన్యారాశులు | వశ్యములు |
| వృశ్చికరాశికి | కర్కాటకరాశి | ॥ |
| ధనూరాశికి | మీనరాశి | ॥ |
| మకరరాశికి | మేష కుంభ రాశులు | ॥ |
| కుంభరాశికి | మేషరాశి | ॥ |
| మీనరాశికి | మకరరాశి | ॥ |

ఫలం : శ్లో ॥ "వశ్యయోగాచ్ఛుభం ప్రోక్తం స్త్రీ రాశే ః పురుషస్య చ"

తా ॥ స్త్రీ రాశికి పురుషరాశికి వశ్యయోగము కలుగట వలన శుభమని తెలియదగినది.

11. దినవర్గ ః ॥ శ్లో ॥ **కన్యాదివరఋుక్షాస్తం గణయేన్నవభాజితమ్ ।**
**శిష్టం సమంయది శుభం విషమంచేదరిష్టదమ్ ॥**

ఫలం : తా ॥ వధూనక్షత్రం మొదలుకొని వరనక్షత్రం వరకు లెక్కించి 9చే భాగించగా శేషం 1. మృత్యువు, 2.ప్రేమ, 3. ఆపద, 4. సుఖం, 5. పీడ, 6. పశులాభం, 7. రోగప్రాప్తి, 8. ప్రజావృద్ధి, 9. శత్రువృద్ధిగాన సరిసంఖ్య శుభదాయకమనియు విషమ సంఖ్య అశుభదాయకము అనియు తెలియవలెను.

12. జాతివర్గ ః ॥

| | | | |
|---|---|---|---|
| కటకరాశి | మీనరాశి | వృశ్చికరాశి | బ్రాహ్మణజాతి |
| సింహరాశి | ధనూరాశి | మేషరాశి | క్షత్రియజాతి |
| తులారాశి | మిధునరాశి | కుంభరాశి | వైశ్యజాతి |
| వృషభరాశి | కన్యారాశి | మకరరాశి | శూద్రజాతి |

ఫలం : శ్లో ॥ **న దద్యాద్వర్ణ హీనస్య వర్ణశ్రేష్ఠాం తు కన్యకామ్**

తా ॥ వధూవరుల రాశులొకవర్గము కలవైయున్న శుభకరం. వరరాశికంటె వధూరాశి అధికవర్గము కలదైయున్న అశుభకరం, హీనరాశియైయున్న మధ్యము ఫలము అని తెలియదగియున్నది.

13. వేధావర్గ ః ॥ అశ్విని–జ్యేష్ఠ, భరణి–అనూరాధ, కృత్తిక–విశాఖ, రోహిణి–స్వాతి, ఆర్ద్ర–శ్రవణం, పునర్వసు–ఉత్తరాషాఢ, పుష్య–పూర్వాషాఢ, ఆశ్రేష–మూల, మఖ–రేవతి, పుబ్బ–ఉత్తరాభాద్ర, ఉత్తర–పూర్వాభాద్ర, హస్త–శతభిషం.

ఫలం : ఈ జంట నక్షత్రములు పరస్పర విరోధములు కలవి. చిత్త, మృగశిర, ధనిష్ఠ ఈ ద్విపాన్నక్షత్రములు మూడు అన్యోన్న విరోధములు కలవి గాన ఈ నక్షత్రముల జంటలలో నొకజంట దంపతుల జన్మనక్షత్రద్వయమై యుండెనని దంపతులకు సదా విరోధము సిద్ధమైయుండును.

14. పక్షివర్గ ః ॥ 1. గరుడ పక్షి, 2. పింగళపక్షి, 3. కాకి, 4. కోడి, 5. నెమలి. ఇవి అయిదు పక్షులు.

5 అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర కు ....... గరుడపక్షి అధిపతి

5 ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, మఖ, పుబ్బకు ....... పింగళపక్షి అధిపతి

6 ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ కు .... కాకి అధిపతి

5 జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం ........... కోడి అధిపతి

6 ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి ............ నెమలి అధిపతి

**ఫలం :** వధూవరుల జన్మనక్షత్రములు, ఒక పక్షి ఆధిపత్యములోయున్న అన్యోన్యము ప్రీతికలవారై యుందురు. ఆ నక్షత్రములు వేరువేరు పక్షుల ఆధిపత్యములలోయున్న నిత్యము కలహము కలవారై యుందురు.

**15. రజ్జువర్గ ః ॥** అశ్విని, ఆశ్రేష, మఖ, జ్యేష్ఠ, మూల, రేవతి – ఈ ఆరు పాదరజ్జు నక్షత్రములు.
భరణి, పుష్యమి, పుబ్బ, అనూరాధ, పూ.షా, ఉ.భా.– ఈ ఆరు కటిరజ్జు నక్షత్రములు.
కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉ.షా, పూ.భా. – ఈ ఆరు ఉదరరజ్జు నక్షత్రములు.
రోహిణి, ఆర్ద్ర, హస్త, స్వాతి, శ్రవణం, శతభిషం – ఈ ఆరు కంఠరజ్జు నక్షత్రములు.
మృగశిర, చిత్త, ధనిష్ఠ – ఈ మూడు శిరోరజ్జు నక్షత్రములు.

**ఫలం : శ్లో ॥ ఏకరజ్జుర్మృత్యుకరీ భిన్న రజ్జుశ్శుభావహా ॥**

**తా ॥** స్త్రీ పురుష నక్షత్రములు, శిరోరజ్జువుయందున్న భర్తను, కంఠరజ్జువుయందున్న భార్యను, ఉదర రజ్జువుయందున్న కుమారులను నశింపజేయును. కటిరజ్జువుయందున్న దారిద్ర్యమును పాదరజ్జువుయందున్న వ్యభిచారమును కలుగచేయును అని తాత్పర్యము.

**16. యోగినీవర్గ ః ॥** 1. బ్రాహ్మణీ, 2. కౌమారీ, 3. వారాహీ, 4. సిద్ధా, 5. వైష్ణవీ, 6. మాహేంద్రీ, 7. చాముండీ, 8. మాహేశ్వరీ అను యెనిమిది దిక్శక్తులు కలవు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| **బ్రాహ్మణి** | : | తూర్పు | – | అశ్విని | ఆశ్రేష | అనూరాధ | పూర్వాభాద్ర |
| **కౌమారీ** | : | ఆగ్నేయం | – | భరణి | మఖ | జ్యేష్ఠ | ఉత్తరాభాద్ర |
| **వారాహీ** | : | దక్షిణం | – | కృత్తిక | పుబ్బ | మూల | రేవతి |
| **సిద్ధా** | : | నైఋతి | – | రోహిణి | ఉత్తర | పూర్వాషాఢ | |
| **వైష్ణవీ** | : | పడమర | – | మృగశిర | హస్త | ఉత్తరాషాఢ | |
| **మాహేంద్రీ** | : | వాయవ్యం | – | ఆర్ద్ర | చిత్త | శ్రవణం | |
| **చాముండీ** | : | ఉత్తరం | – | పునర్వసు | స్వాతి | ధనిష్ఠ | |
| **మాహేశ్వరీ** | : | ఈశాన్యం | – | పుష్యమి | విశాఖ | శతభిషం | |

**ఫలం :** వధూవరుల జన్మనక్షత్రములు ఒక శక్తి నక్షత్రములలో యున్న యెడల అన్యోన్య ప్రేమ కలవారై యుందురు. భిన్న శక్తుల నక్షత్రములలో యున్న యెడల పరస్పరము కలహము కలవారై యుందురు.

**17. లింగవర్గ ః ॥** భరణి, ఆర్ద్ర, ఆశ్రేష, మఖ, పుబ్బ, ఉత్తర, చిత్త, స్వాతి, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, రేవతి – ఈ 14 నక్షత్రములు స్త్రీ లింగములు.

మృగశిర, మూల, శతభిషం – ఈ 3 నక్షత్రములు నపుంసక లింగములు.

అశ్విని, కృత్తిక, రోహిణి, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, శ్రవణం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర – ఈ పది నక్షత్రములు పుంలింగములు.

**ఫలం :** వధూవరుల జన్మనక్షత్రములు ఏకలింగము కలవైయున్న పరస్పరము ప్రేమకలవారైయుందురు. భిన్నలింగము కలవైయున్న పరస్పరము కలహము కలవారై యుందురు.

**18. భూతవర్గ ః ॥** 5 పృథివీ – అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర 6 జలం – ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, మఖ, పుబ్బ 6 అగ్ని – ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ 5 వాయువు – జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం.

5 ఆకాశం – ధనిష్ట, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.

**ఫలం :** వధూవరుల జన్మనక్షత్రములలో నొకటి జలవర్గములోను మరియొకటి అగ్నివర్గములోను చేరిన వధూవరులకు మరణము సంభవించును. మిగిలిన నక్షత్రములు శుభకరంబులగును.

**19. చంద్రయోగ వర్గః ॥**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తూర్పు – ఇంద్రుడు | పాడ్యమి – నవమి | అశ్విని | ఆశ్రేష | అనూరాధ | పూర్వాభాద్ర | సూర్యః |
| ఆగ్నేయం – అగ్ని | విదియ–దశమి | భరణి | మఘ | జ్యేష్ఠ | ఉత్తరాభాద్ర | చంద్రః |
| దక్షిణము – యముడు | తదియ–ఏకాదశి | కృత్తిక | పుబ్బ | మూల | రేవతి | కుజః |
| నైఋతి – నిర్ఋతి | చవితి–ద్వాదశి | రోహిణి | ఉత్తర | పూర్వాషాఢ | | బుధః |
| పశ్చిమం–వరుణుడు | పంచమి–త్రయోదశి | మృగశిర | హస్త | ఉత్తరాషాఢ | | గురుః |
| వాయవ్యం–వాయువు | షష్ఠి–చతుర్దశి | ఆర్ద్ర | చిత్త | శ్రవణం | | శుక్రః |
| ఉత్తరం–కుబేరుడు | సప్తమి–పూర్ణిమ | పునర్వసు | స్వాతి | ధనిష్ఠ | | శనిః |
| ఈశాన్యం–ఈశానుడు | అష్టమి–అమావాస్య | పుష్యమి | విశాఖ | శతభిషం | | రాహుః |

ఫలం : వధూవరుల జన్మనక్షత్రములలో పురుషుని జన్మనక్షత్రము ఏ దిక్కున యున్నదో ఆ దిక్కునగల దినాధిపతిని, నక్షత్రాధిపతిని, గ్రహాధిపతిని, దిక్పతిని తెలుసుకొని వారికిని, స్త్రీ జన్మనక్షత్ర మేదిక్కునయున్నదో, ఆ దిక్కునగల దినాధిపతిని, నక్షత్రాధిపతిని, గ్రహాధిపతిని, దిక్పతిని తెలుసుకొని వీరికిని, మిత్రత్వమున్న దంపతులకు మిత్రత్వమును, శత్రుత్వమున్న దంపతులకు శత్రుత్వమును, సమత్వమున్న దంపతులకు సమత్వమును ఉండునని తెలియవలెను.

**20. గోత్రవర్గః ॥**

| | | | | |
|---|---|---|---|---|
| మరీచిః | అశ్విని | భరణి | కృత్తిక | రోహిణి |
| అత్రిః | మృగశిర | ఆర్ద్ర | పునర్వసు | పుష్యమి |
| సిష్ఠః | ఆశ్రేష | మఖ | పుబ్బ | ఉత్తర |
| అంగిరాః | హస్త | చిత్త | స్వాతి | విశాఖ |
| పౌలస్త్యం | అనూరాధ | జ్యేష్ఠ | మూల | పూర్వాషాఢ |
| పులహః | ఉత్తరాషాఢ | అభిజిత్ | శ్రవణం | ధనిష్ఠ |
| క్రతుః | శతభిషం | పూర్వాభాద్ర | ఉత్తరాభాద్ర | రేవతి |

అశ్వన్యాది నాలుగు నక్షత్రములు మరీచి గోత్రమునకు చెందియున్నవి. మృగశీర్షాది నాలుగు నక్షత్రములు అత్రిగోత్రమునకు చెందియున్నవి. ఇటులనే పై నక్షత్రముల గోత్రములను కూడా తెలియవలెను.

ఫలం : వధూవరుల జన్మనక్షత్రములు ఒక గోత్రమునకు చెందియున్న యెడల వధూవరులు నిత్యము కలహము కలవారై యుందురు. భిన్న గోత్రములకు చెందియున్న యెడల శుభప్రదము.

ఈ పైన వివరింపబడిన వింశతివర్గములు వధూవరుల పొంతనములను గూర్చి ముఖ్యములైనవి. ఈ ఇరువది వర్గములయందు అనుకూల్యమును చూచి స్త్రీ పురుషులకు దాంపత్యమును సమకూర్చుట ఉత్తమోత్తమము అయియున్నది. ఇది దుర్లభము. అదృష్టాయత్తముకూడ అయియున్నది. మొదటి ఆరు వర్గములు వివాహ సమయమున ముఖ్యతరములనియు, మిగిలిన 14 వర్గములు అముఖ్యులైనను అభ్యుచ్ఛయములుగా కాలజ్ఞులు చెప్పుచున్నారు. గాన ఆ ఆరు వర్గముల యందు అనుకూల్యమును చూచి దాంపత్యమును నిర్ణయించుట ఉత్తమము.

**శ్లో ॥ గ్రహమైత్రం ద్విజాతీనాం క్షత్రియాణాం గణస్తథా ।**

**కన్యాదూరం తు వైశ్యానాం శూద్రాణాం యోనివరే చ । ఇత్యాది.**

**తా ॥** ప్రమాణముచే బ్రాహ్మణులు గ్రహమైత్ర వర్గమును, క్షత్రియులు గణవర్గమును, వైశ్యులు స్త్రీ దీర్ఘ వర్గమును, శూద్రులు యోనివర్గమును నియతముగా విచారించి స్త్రీ పురుషులకు దాంపత్యమును నిర్ణయించవలెను. ఇతర వర్గములు అప్రధానములు అభ్యుచ్ఛయ సాధనములుగా భావించవలెను. ఇతర వర్గములు దేశభేదముచే ప్రత్యేకముగా ప్రాధాన్యము నొందుచూ సాఫల్యమును గడించుచునే యున్నవి. వైఫల్య మేమాత్రమును లేదు. అని సమయశాస్త్ర పారదృశ్యలు చెప్పుచున్నారు.

## పంచక రహితమును చేయుట

పంచకము ప్రతిపదాది తిథులు, భానువారాది వారములు, అశ్విన్యాది నక్షత్రములు, మేషాది లగ్నములను జేర్చి ఆ సంఖ్యను తొమ్మిదితో భాగించగా మిగిలిన సంఖ్య ౧ మృత్యు, ౨ అగ్ని, ౪ రాజ, ౬ చోర, ౮ రోగ పంచకములు అనబడును. ఇవి అశుభములు. చోర రోగములు రాత్రియందును, రోగాగ్నులు పగటియందును, మృత్యువు దివారాత్రములయందును పనికిరానేరవు. అవసరమై ఆచరించవలసి వచ్చినప్పుడు 1–2–4–6–8 పంచకములకు క్రమముగా రత్నములు, చందనము, నిమ్మపండ్లు, దీపము, ధాన్యము దానము చేసిన రోగపరిహారమగును అని కొందరి మతము. శాక, గుడ, లవణ, సతిలబంగారము, బంగారము – వీటిని దానము చేయవలెనని కొందరి మతము.

## పంచకరహితములో విశేషములు

సుముహూర్త నిర్ణయమునందు తిథి, వార, నక్షత్రలగ్నములు కాక ధ్రువకమును కూడా చేర్చిన పంచకమగును. అప్పుడు పంచకరాహిత్యమును చేయవలెను అని కొందరి మతము.

ధ్రువకమనగా -- **శ్రుతిః బాణః పంచ వేద త్రీణి ద్వి చంద్రమాః ।**

**గగనేందు ద్వయం త్రీణి ధ్రువకంచే త్యమక్రమాత్ । ఇతి.**

**తా ॥** ధ్రువకసంఖ్య మేషమునకు 4 వృషభమునకు 5 మిథునమునకు 6 కటకమునకు 5 సింహమునకు 4 కన్యకు 3 తులకు 2 వృశ్చికమునకు 1 ధనుస్సుకు 0 మకరమునకు 1 కుంభమునకు 2 మీనం 3గా తెలియవలెను. పై నాలుగు సంఖ్యలలో ధ్రువక సంఖ్యను కూడా చేర్చి పంచకరాహిత్యము చేయవలెను.

# తారాబలమును చూచుట

**శ్లో ॥ జన్మ నక్షత్రమారభ్య నిత్యభాంతం చ గణ్యతే ।**
**నవసంఖ్యాహృతంభాగం నవతారాః ప్రకీర్తితా ॥**
**జన్మభం దేహనాశాయ సంపత్సంపద ఏవ చ ।**
**విపచ్చ కార్యనాశాయ క్షేమం క్షేమకృతేభవేత్ ॥**
**ప్రత్యక్చ కార్యనాశాయ సాధనం కార్యసాధనే । నై ధనం**
**విధనే ఽపిప్యాన్మిత్రం చ సుఖసంపది ।**
**పరమమైత్రం సుఖే వింద్యాత్తారాబలమితి క్రమాత్ ।**

**తారాబలము :** జన్మనక్షత్రము, (లేక నామనక్షత్రము) మొదలు దిన నక్షత్రమువరకు ఎంచి ఆ సంఖ్యను తొమ్మిదిచే భాగించగా మిగిలిన సంఖ్య ౧ జన్మతార, ౨ సంపత్తార, ౩ విపత్తార, ౪ క్షేమతార, ౫ ప్రత్యక్తార, ౬ సాధనతార, ౭ నైధనతార, ౮ మిత్రతార, ౯ పరమ మైత్రతార.

పై చెప్పబడిన తొమ్మిది తారలలో జన్మతారవలన దేహనాశమును, సంపత్తారవలన సంపదయును విపత్తారవలన కార్యనాశమును, క్షేమతారవలన క్షేమమును, ప్రత్యక్తార వలన కార్యహానియు, సాధనతార వలన కార్యసాధనమును, నైధనతార వలన మరణమును, మిత్రతారవలన సుఖ పంద్వృద్ధియు, పరమ మైత్రతార వలన దేహసౌఖ్యమును కలుగును.

**శుభతారలు :** సంపత్ – క్షేమ – సాధన – మిత్ర – పరమమైత్రములు ॥

**అశుభతారలకు దానములు :** జన్మతారకు శాకము – విపత్తారకు గుడము – ప్రత్యక్తారకు లవణము, నైధనతారకు తిలసహిత కాంచనము, అశుభ తారల యందు మిక్కిలి క్రూరకాలము – జన్మతారయందు 3 పాదము, విపత్తారయందు ౧ పాదము, ప్రత్యక్తారయందు ౪ పాదము, నైధనతారయందు ౨ పాదము.

**శ్లో ॥ ప్రథమే ప్రథమం త్యాజ్యం ద్వితీయేతు తృతీయకం ।**
**తృతీయే పంచమంత్యాజ్యం నైధనం త్రిషువర్జయేత్ ॥**

**తా ॥** పరిగణనమున 1 – పర్యాయము జన్మతారయు, 2 – వ పర్యాయము విపత్తారయు, 3 – వ పర్యాయము ప్రత్యక్తారయు, మూడు పర్యాయములయందు నైధనతారయు పనికిరానేరవు.

# చంద్రబలమును చూచుట

చంద్రబలము ॥ జన్మరాశి (లేక నామరాశి) మొదలు ౧ - ౩ - ౬- ౭- ౧౦ - ౧౧ రాశులయందు చంద్రుడు శుభుడు. ౨- ౪- ౫- ౮- ౧- ౨ రాశులయందు అశుభుడు. శుక్లపక్షమున ౨౫౮ రాశులయందును, కృష్ణపక్షమున ౪- ౮- ౧- ౨రాశులయందు శుభుడు.

1. **వివాహమునకు తగిన వయస్సు :** పురుషునకు 21వ సం॥ నుండి తదుపరి బేసి సంవత్సరములు, కన్యకు 18వ సం॥ నుండి సరి సంవత్సరములందునా వివాహమునకు యుక్తవయస్సుగా చెప్పబడినవి.
2. **వధూవరులకు చూడవలసిన నాడీకూటమి :** అశ్విని మొదలు మూడు వ్రేళ్ళయందు మూడేసి చొప్పున లెక్కించగా వధూవరుల నక్షత్రములు ఒకే వ్రేలిపైకి రారాదు. వచ్చినచో అశుభమందురు.
3. **రాశికూటమి :** వధువు జన్మరాశి మొదలు - వరుని జన్మరాశి వరకు గణించగా - వరుని రాశి 7వ దైవ శుభము. వధూవరుల రాశులు రెండూ ఒకటే అయిన శుభము. వధువురాశికి వరుని రాశి 3, 4, 5, 10, 11 యగుట-వరుని రాశికి వధువురాశి 3, 4, 9, 10, 11 యగుట శుభము.
4. **గ్రహమైత్రి :** వధూవరుల జన్మనాశాధిపతులు ఒకరే అయినను, మిత్ర అధిమిత్రసములైనను శుభము. శత్రువులైన అశుభము.
5. **స్త్రీ దీర్ఘకూటము :** వధువు నక్షత్రము నుండి 27 నక్షత్రములను 3 నవకముల క్రింద తొమ్మిదేసి చొప్పున వేసుకొనవలెను. అందు వరుని నక్షత్రము మొదటి నవకములో పడినచో కలహము. రెండవ నవకమందైన సామాన్యము. 3వ నవకమైన శుభము. వధువు నక్షత్రమునకు వరుని నక్షత్రము 13 నక్షత్రములపైన ఉన్నచో శుభమేనని కొందరు చెప్పియున్నారు.
6. **గణకూటము :** అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, రేవతి - ఇవి దేవ గణములు. భరణి, రోహిణి, ఆరుద్ర, పుబ్బ, ఉత్తర, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర - ఇవి మనుష్య గణములు. కృత్తిక, ఆశ్రేష, మఖ, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం - ఇవి రాక్షసగణములు. వధూవరుల నక్షత్రములు ఒకే గణమందుండినచో మంచిది. వరుని నక్షత్రము దేవగణము, వధువు తార మానవ గణమైనను మంచిదే. వధువుతార రాక్షసగణమై వరుని తార ఇతర గణములందున్నచో ఆ సంసారము కష్టతరము.

   ఈ పొంతనములు మేనరికము విషయములో చూడనక్కరలేదు.
7. **త్రిజ్యేష్ఠ :** వివాహమున వధూవరులకు త్రిజ్యేష్ఠ శబ్దము రాకూడదు. అనగా - వధూవరులిరువురకు జ్యేష్ఠ సంతానములై జ్యేష్ఠమాసముగాని, జ్యేష్ఠా నక్షత్రముగాని కారాదు. అట్లే ఇరువురకు జ్యేష్ఠ జన్మనక్షత్రమై - ఒకరు జ్యేష్ఠలేనచో త్రిజ్యేష్ఠ యగును. ఒకరి జన్మతార జ్యేష్ఠయై, ఇరువురును జ్యేష్ఠ జన్ములైన అదియు త్రిజ్యేష్ఠయే. అట్లే ఒక జన్మతార జ్యేష్ఠయై, మరొకరు జ్యేష్ఠులై, జ్యేష్ఠ మాసమైననూ త్రిజ్యేష్ఠయే. ఈ విధముగా చూచుకొని - త్రిజ్యేష్ఠను తప్పనిసరిగా వదిలివేయవలెను. జ్యేష్ఠులనగా స్త్రీ పురుష సంతానములలో తొలిసారిగా లెక్కించవలెను. వీరికన్న ముందరి వారు ఎవరైనను మృతులైనచో - బ్రతికినవారిలో జ్యేష్ఠులుగా లెక్కించరాదు.
8. **పెండ్లి ముహూర్తమునకు కుజాష్టమ దోషం :** వధూవరులిరువురకు కుజదోషమున్న శుభమే గాని - వివాహ ముహూర్తమునకు మాత్రము కుజుడు అష్టమమందుండరాదు. ఆ ముహూర్తం నిషిద్ధం.

9. **సగ్రహ చంద్ర దోషము :** చంద్రుడితర గ్రహములు వేనితోనూ కల్సియుండరాదు. ఏలననగా – ముహూర్త సమయమునకు చంద్రుడు రవితో కలిసినచో దరిద్రము, కుజుని కూడిన మృత్యుభీతి, బుధ సంబంధీకుడైన సంతానహీన కష్టములు, గురు సంయోగమున ధననష్టాదులు, శుక్రసంపర్కంవల్ల భార్యా విరోధము – ఎడబాటు, శనితో కలయికవలన దరిద్రము కలుగును. అందుచే చంద్రుడు ఏ గ్రహముతోటీ కలవకుండునట్లు చూడవలెను.

10. **జామిత్రస్థానం :** ముహూర్త లగ్నమునకు సప్తమ స్థానము శుద్ధిగా ఉండవలెను. వివాహముహూర్తమునకిది అత్యంత ప్రధానం.

11. **పాప షడ్వర్గు :** లగ్న, హూర, ద్రేక్కాణ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశాధిపతులు – శుభగ్రహయుతులైగాని – శుభస్థానములందుగాని యుండవలెను. పాపస్పర్శ మహాదోషము.

12. **రిః ఫచంద్ర దోషం :** వివాహ ముహూర్త లగ్నమునకు 1-6-8-12 స్థానములలో చంద్రుడున్నచో అది చెరుపు చేయును.

13. **శుభతిథులు :** ఉభయపక్షములందలి 2, 3, 7, 10 తిథులును, శుక్ల 11, 12, 13, 15 బహుళ పాడ్యమి తిథులును శ్రేష్ఠములు ఉభయ పక్షములలోని 4, 6 తిథులు – శుక్ల 8, 9 తిథులు రెండవ మతము.

14. **శుభవారములు :** బుధ, గురు, శుక్రవారములు శ్రేష్ఠము. తప్పని సరియైనప్పుడు శని, ఆదివారములు కూడా అంగీకరింపబడుచున్నవి. మంగళవారము నిషిద్ధము. దూష్యము. సోమవారము పునర్వివాహప్రదము. కావున సోమ, మంగళ వారములలో పెండ్లి తలపెట్టరాదు.

## ఆదివారాదిగా వార కార్యములు

**ఆదివారము :** మంత్రోపదేశములకు, ఉల్లి, మిర్చి, పొగాకు వంటి తోటలు వేయుటకు, డాక్టర్లను సంప్రదించుటకు, ఔషధములు సేవించుటకు, రవిరత్నమైన కెంపుటుంగరమును ధరించుటకు, ఉత్తరదిక్కు ప్రయాణమునకు, ప్రభుత్వ సంబంధ వ్యక్తులను కలిసికొనుటకు.

**సోమవారము :** వెండి వస్తువులను ఉపయోగించుట లేదా కొనుట, నీటి సంబంధ కార్యములు ప్రారంభించుటకు, ముత్యమున్న వుంగరమును ధరించుటకు, తెల్లని వస్తు – వస్త్రాభరణములు ధరించుటకు, దక్షిణదిక్కు ప్రయాణమునకు.

**మంగళవారము :** ధైర్యసాహస కార్య ప్రయత్నములకు, కోర్టు, రెవెన్యూ వంటి వ్యవహారములు నడుపుటకు, యుద్ధ విద్యలు, నృత్యవిద్యలు అభ్యసించుటకు, రక్షణశాఖ యందు చేరుటకు, పగడపు ఉంగరమును ధరించుటకు, తూర్పు దిక్కు ప్రయాణమునకు.

**బుధవారము :** నూతన వ్యాపార వ్యవహార ప్రయత్నములకు, వ్యాకరణ సంబంధ విద్యాప్రవేశములకు, జ్యోతిష విద్యారంభమునకు, గణితశాస్త్రము నేర్చుకొనుటకు, సంగీత చిత్ర, కళారంభమునకు, పచ్చ పొదిగిన ఉంగరమును ధరించుటకు, పడమర దిక్కుగా ప్రయాణము చేయుటకు.

**గురువారము :** అక్షరాభ్యాసమునకు నూతన విద్యా ప్రవేశమునకు, దైవ సంబంధ యజ్ఞయాగాది క్రతువులు జరుపుటకు, తీర్థయాత్రలు చేయుటకు, దేవతా, గురు పూజలకు, పుష్యరాగమున్న ఉంగరమును ధరించుటకు, పడమర దిక్కు ప్రయాణమునకు.

**శుక్రవారము :** నూతన వస్తు – వస్త్రాభరణములను ధరించుటకు మరియు స్త్రీ పురుష సంబంధ శృంగార కార్యములకు, రాజకీయ రంగ ప్రవేశమునకు, కావ్య, నాటక రచనా వ్యాసంగములకు, కళాసంబంధ కార్య ప్రయత్నములకు, వజ్రపుటుంగరమును ధరించుటకు ఉత్తరదిక్కు ప్రయాణమునకు.

**శనివారము :** లోహ సంబంధ పనులకు, ఆయుధ నిర్మాణములు వంటివి చేయుటకు, శనిదోష పూజా కార్యక్రమములు నిర్వహించుటకు, నీలపుటుంగరమును ధరించుటకు, దక్షిణదిక్కు ప్రయాణమునకు.

## నవగ్రహ దశలు - అంతర్దశలు

| గ్రహము | సూర్యుడు 6 సం॥ | | | | | | చంద్రుడు 10 సం॥ | | | | | | కుజుడు 7 సం॥ | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | అంతర్దశ | | | మొత్తము | | | అంతర్దశ | | | మొత్తము | | | అంతర్దశ | | | మొత్తము | | |
| | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో |
| సూర్యుడు | 0 | 3 | 18 | 0 | 3 | 18 | – | – | – | – | – | – | – | – | – | – | – | – |
| చంద్రుడు | 0 | 6 | 0 | 0 | 9 | 18 | 0 | 10 | 0 | 0 | 10 | 0 | – | – | – | – | – | – |
| కుజుడు | 0 | 4 | 6 | 1 | 1 | 24 | 0 | 7 | 0 | 1 | 5 | 0 | 0 | 4 | 27 | 0 | 4 | 27 |
| రాహువు | 0 | 10 | 23 | 2 | 0 | 18 | 1 | 6 | 0 | 2 | 4 | 0 | 1 | 0 | 18 | 1 | 5 | 15 |
| గురుడు | 0 | 9 | 18 | 2 | 10 | 6 | 1 | 4 | 0 | 4 | 3 | 0 | 0 | 11 | 6 | 2 | 4 | 21 |
| శని | 0 | 11 | 12 | 3 | 9 | 18 | 1 | 7 | 0 | 5 | 10 | 0 | 1 | 1 | 9 | 3 | 6 | 0 |
| బుధుడు | 0 | 10 | 6 | 4 | 7 | 24 | 1 | 5 | 0 | 7 | 3 | 0 | 0 | 11 | 27 | 4 | 5 | 27 |
| కేతువు | 0 | 4 | 6 | 5 | 0 | 0 | 0 | 7 | 0 | 7 | 10 | 0 | 0 | 4 | 27 | 4 | 10 | 24 |
| శుక్రుడు | 1 | 0 | 0 | 6 | 0 | 0 | 1 | 8 | 0 | 9 | 6 | 0 | 1 | 2 | 0 | 6 | 0 | 24 |
| సూర్యుడు | – | – | – | – | – | – | 0 | 6 | 0 | 10 | 0 | 0 | 0 | 4 | 6 | 6 | 5 | 0 |
| చంద్రుడు | – | – | – | – | – | – | – | – | – | – | – | – | 0 | 7 | 0 | 7 | 0 | 0 |

| గ్రహము | రాహువు 18 సం॥ | | | | | | గురుడు 16 సం॥ | | | | | | శని 19 సం॥ | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | అంతర్దశ | | | మొత్తము | | | అంతర్దశ | | | మొత్తము | | | అంతర్దశ | | | మొత్తము | | |
| | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో |
| రాహువు | 2 | 8 | 12 | 2 | 8 | 12 | – | – | – | – | – | – | – | – | – | – | – | – |
| గురుడు | 2 | 4 | 24 | 5 | 1 | 6 | 2 | 1 | 18 | 2 | 1 | 18 | – | – | – | – | – | – |
| శని | 2 | 10 | 6 | 7 | 11 | 12 | 2 | 6 | 12 | 4 | 8 | 0 | 3 | 0 | 3 | 3 | 0 | 3 |
| బుధుడు | 2 | 6 | 18 | 10 | 6 | 0 | 2 | 3 | 6 | 6 | 11 | 6 | 2 | 8 | 9 | 5 | 8 | 12 |
| కేతువు | 1 | 0 | 18 | 11 | 6 | 18 | 0 | 11 | 6 | 7 | 10 | 12 | 1 | 1 | 9 | 5 | 9 | 21 |
| శుక్రుడు | 3 | 0 | 0 | 14 | 6 | 18 | 2 | 8 | 0 | 10 | 6 | 12 | 3 | 2 | 0 | 9 | 11 | 21 |
| సూర్యుడు | 0 | 10 | 24 | 15 | 5 | 12 | 0 | 9 | 18 | 11 | 4 | 0 | 0 | 11 | 12 | 10 | 11 | 13 |
| చంద్రుడు | 1 | 6 | 0 | 16 | 11 | 12 | 1 | 4 | 0 | 12 | 8 | 0 | 1 | 7 | 0 | 12 | 6 | 3 |
| కుజుడు | 1 | 0 | 18 | 8 | 0 | 0 | 0 | 11 | 6 | 13 | 7 | 6 | 1 | 1 | 9 | 13 | 7 | 12 |
| రాహువు | – | – | – | – | – | 6 | 2 | 4 | 24 | 16 | 0 | 0 | 2 | 10 | 6 | 16 | 5 | 18 |
| గురుడు | – | – | – | – | – | – | – | – | – | – | – | – | 2 | 6 | 12 | 19 | 0 | 0 |

| గ్రహము | బుధుడు 17 సం॥ | | | | | | కేతువు 7 సం॥ | | | | | | శుక్రుడు 20 సం॥ | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | అంతర్దశ | | | మొత్తము | | | అంతర్దశ | | | మొత్తము | | | అంతర్దశ | | | మొత్తము | | |
| | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో | సం. | మా. | రో |
| బుధుడు | 2 | 4 | 27 | 2 | 4 | 27 | – | – | – | – | – | – | – | – | – | – | – | – |
| కేతువు | 0 | 11 | 27 | 3 | 4 | 24 | 6 | 4 | 27 | 0 | 4 | 7 | – | – | – | – | – | – |
| శుక్రుడు | 2 | 10 | 0 | 6 | 2 | 24 | 1 | 2 | 0 | 1 | 6 | 27 | 3 | 4 | 0 | 3 | 4 | 0 |
| సూర్యుడు | 0 | 10 | 6 | 7 | 1 | 0 | 0 | 4 | 6 | 1 | 11 | 3 | 1 | 0 | 0 | 4 | 4 | 0 |
| చంద్రుడు | 1 | 5 | 0 | 8 | 6 | 0 | 0 | 7 | 0 | 2 | 6 | 3 | 1 | 8 | 0 | 6 | 0 | 0 |
| కుజుడు | 0 | 11 | 27 | 9 | 5 | 27 | 0 | 4 | 27 | 2 | 11 | 0 | 1 | 2 | 0 | 7 | 2 | 0 |
| రాహువు | 2 | 6 | 18 | 12 | 0 | 15 | 1 | 0 | 18 | 3 | 11 | 18 | 3 | 0 | 0 | 10 | 2 | 0 |
| గురుడు | 2 | 3 | 6 | 14 | 3 | 21 | 0 | 11 | 6 | 4 | 10 | 24 | 2 | 8 | 0 | 12 | 10 | 0 |
| శని | 2 | 8 | 9 | 17 | 0 | 0 | 1 | 1 | 9 | 6 | 0 | 3 | 3 | 2 | 0 | 16 | 0 | 0 |
| బుధుడు | – | – | – | – | – | – | 0 | 11 | 27 | 7 | 0 | 0 | 2 | 10 | 0 | 18 | 10 | 0 |
| కేతువు | – | – | – | – | – | – | – | – | – | – | – | – | 1 | 2 | 0 | 20 | 0 | 0 |

## శుక్ర ఘడియలు - వాటి ఫలితాలు

**గమనిక :** ప్రతి దినము సూర్యోదయము నుండి ఒక ఘడియ అనగా 24 ని॥లు చొప్పున ఫలితము చూసుకొనవలయును. దీనికి తిధివార నక్షత్రములతో పనిలేదు గాన దీనిననుసరించుట శ్రేయోదాయకమే. ఉదయం నుండి సాయంత్రం వరకూ ఎలాగునో పిదప సాయంత్రము నుండి తిరిగి మరునాటి ఉదయం వరకు అదే విధంగా చూసుకోవలెను. ఇచ్చట సూర్యోదయం 6 గం॥లకు చూపడమైంది.

| గంటలు నుండి వరకు | ఆదివారము | సోమవారము | మంగళవారము |
|---|---|---|---|
| 6.00 - 6.24 | క్షేమము, లాభము | విషభయము, కార్యనాశనం | క్రొత్త ప్రయత్నాలు, ధనలాభం |
| 6.24 - 6.48 | సుఖము, వివాహం | రాజపూజ్యత, కార్యసిద్ధి | సుఖము, సౌఖ్యప్రాప్తి |
| 6.48 - 7.12 | ప్రయాణ కలహం, ప్రాణభయం | క్షేమము, లాభము | భయము, బంధనము |
| 7.12 - 7.36 | ఋణనష్టం, అనారోగ్యము | స్త్రీ సౌఖ్యము, సుఖము | భూతభయము |
| 7.36 - 8.00 | చోరభయము, శస్త్ర భయం | భూలాభం, వాహనయోగం | ఉద్యోగానికి మంచిది, జయం |
| 8.00 - 8.24 | దుఃఖము, భయము | ధననాశనం, దుఃఖము | పరోపకారము, కార్యజయం |
| 8.24 - 9.48 | అభీష్ఠసిద్ధి, వివాహానికి శుభం | కార్యసిద్ధి, జయము | ప్రయాణానికి కష్టం, దుఃఖప్రాప్తి |
| 8.48 - 9.12 | సౌఖ్యము, లాభము | వ్యవహార జయం ఫలప్రాప్తి | సుఖము, వస్త్రాది ప్రాప్తి |
| 9.12 - 9.36 | క్షేమం, ధనలాభం | ఉద్యోగం, అభీష్టసిద్ధి | ప్రయాణమునకు కష్టం |
| 9.36 - 10.00 | మిత్రవృద్ధి, అభీష్టసిద్ధి | వాహన, వస్తుభూషణ ప్రాప్తి | పీడ, జ్వర వివాదహాని |
| 10.00 - 10.24 | మృత్యుభయం, కార్యనాశనం | ప్రయాణానికి మంచిది | ప్రయాణానికి, శత్రుబాధ |
| 10.24 - 10.48 | ఆరోగ్యం, సుఖవృద్ధి | రాజదర్శనం, మిత్రత్వం | శుభం, స్త్రీ లాభం |
| 10.48 - 11.12 | శుభకర్మలకు మంచిది, జయం | కలహం, శత్రుపీడ | కలహము, వ్యవహారహాని మంచిది |
| 11.12 - 11.36 | యాత్రకు మంచిది, కార్యసిద్ధి | కార్యభంగం, రోగపీడ | ప్రయాణానికి మంచిది |
| 11.36 - 12.00 | దుఃఖము, విషభయం | శత్రుభయం, కార్యసిద్ధి | జంతువులు, మృగాలవల్ల భయం |
| 12.00 - 12.24 | జయం, ఉద్యోగం | చోరనాశనము, శత్రునాశనం | అగ్నిపీడ, శత్రుత్వము |

| గంటలు నుండి వరకు | ఆదివారము | సోమవారము | మంగళవారము |
| --- | --- | --- | --- |
| 12.24 - 12.48 | కార్యభంగము, వివాదము | ధనలాభం, గోలాభం | భయం, ప్రయాణనష్టం |
| 12.48 - 1.12 | క్షేమం, రాజసన్మానం | అభీష్టసిద్ధి, గోలాభం | సర్వప్రయత్నాలకు మంచిది |
| 1.12 - 1.36 | ప్రయాణ లాభం - ఇష్టసిద్ధి | నగర, గ్రామ ప్రవేశాలకు | వివాహ శుభం, కార్య జయం |
| 1.36 - 2.00 | సంతాపము, ద్రవ్యనాశనము | కార్యసిద్ధి, మిత్రత్వం | భయము, కార్యనాశనము |
| 2.00 - 2.24 | భయము, దుఃఖము | సుఖం, కార్యసిద్ధి | రాజసన్మానం, యాత్రాసిద్ధి |
| 2.24 - 2.48 | ద్రవ్యహాని, జ్వరభయము | కార్యభంగం, మనస్థాపం | ప్రయత్నాలు వమ్ముఅగుట |
| 2.48 - 3.12 | ధనలాభము, మిత్రత్వము | లాభప్రాప్తి, కార్యజయం | దుఃఖము, కార్యనష్టము |
| 3.12 - 3.36 | బంధనము, మరణము | ఆశ్చర్యం, కార్యసిద్ధి | అపజయము, హాని |
| 3.36 - 4.00 | వివాదము, శత్రువృద్ధి | అరటికి మంచిది, ధనలాభం | శత్రుజయం, లాభం |
| 4.00 - 4.24 | మరణము, రోగము | కార్యజయం, విద్యాలాభం | ధనక్షయము, స్థానభ్రంశం |
| 4.24 - 4.48 | స్త్రీభోగం, అభీష్టసిద్ధి | స్థిరకార్యాలకు నష్టం | సుఖము, జయప్రదము |
| 4.48 - 5.12 | కార్యజయం ప్రయాణానికి మంచిది | రాజసన్మానం ఉద్యోగానికి మంచిది | ప్రయాణాలకు మంచిది, కార్యసిద్ధి |
| 5.12 - 5.36 | దుఃఖం, ప్రయాణానికి మంచిది కాదు | మనోభీష్టసిద్ధి మంతా శుభం | అభీష్ట కార్యసిద్ధి లాభము |
| 5.36 - 6.00 | భూలాభం, వివాహానికి మంచిది | రాజభయం, రోగపీడ | కార్యజయం, క్షేమము |

| బుధవారము | గురువారము | శుక్రవారము | శనివారము |
| --- | --- | --- | --- |
| భయము, దుర్వార్త వినుట | ప్రయాణమున ధనలాభం | కార్యసిద్ధి, స్త్రీ లాభం | కార్యనాశనం, జయం |
| కార్యభంగం, కలహము | క్షేమము, లాభము | శత్రురోగ వృద్ధి | రాజసన్మానం, సౌఖ్యం |
| ధనలాభం, కార్యజయం | అనారోగ్యం, శత్రువృద్ధి | భయం, ధనలాభం | వివాహము, ధనలాభం |
| ప్రయత్న కార్యసిద్ధి | వాహనప్రాప్తి, విద్యావివాహం | రాజానుగ్రహం, శుభం | మిత్రత్వం, శుభకార్యసిద్ధి |
| ఉద్వేగం, అతిభయం | సంతాపం, మనస్తాపం | వివాదం, క్షుద్భమం | వాహనాది లాభం |
| ఆపద, నష్టము | ఉద్యోగ కార్యాలకు శుభం | ప్రయాణమున కార్యభయం | ప్రయాణమున కార్యసిద్ధి |
| మహాభయము | స్వామి దర్శనం, లాభం | రోగ దుఃఖము, భయం | రాజసన్మానం, కార్యజయం |

| బుధవారము | గురువారము | శుక్రవారము | శనివారము |
|---|---|---|---|
| మనశ్చాంచల్యము ప్రయాణం | వ్యవహారములందు కలహం | ధైర్యం, సేనాధిపత్యం | కార్యనష్టం, మృత్యుహాని |
| సర్పాది విషభయం, ఉపద్రవం | మనశ్చింత, కార్యసిద్ధి | అశుభం, నష్టం | రాజసన్మానం, కార్యజయం |
| జయప్రదం, ధనలబ్ధి | ప్రయాణ శుభం | ధన ధాన్య వివర్ధనం | అనుకూలం, కార్యనష్ట ప్రయాణం |
| జయం, ప్రయాణమున భయం | ప్రయాణమున శత్రునాశనం | సుఖ సౌఖ్యాలు | మృత్యుహాని, వస్త్రలాభం |
| రాజసన్మానం, కార్యజయం | ధనలాభం, జయప్రదం | ప్రయాణానికి మంచిది | స్త్రీ లాభం, సంతాపము |
| ధనధాన్య సుఖప్రాప్తి | రోగము, నాశనం | విద్యావృద్ధి, వినోదం | మిత్రత్వనష్టం, |
| ధనలాభం, మిత్రత్వం | కార్యనష్టం, కలహాకరం | జయం, చింత | కార్యసాఫల్యం, మిత్రత్వం |
| లాభం, శుభం, కార్యజయం | ఉద్యోగనష్టం, హాని | కార్యసిద్ధి, వాహనభీతి | స్త్రీ లాభం, ధనలాభం |
| ప్రయాణమున మృత్యునాశనం | రోగపీడ, కలహం | శస్త్రభయం, శుభం | స్త్రీ లాభం, ధనలాభం |
| వస్త్రలాభం, స్త్రీ లాభం | కార్యజయం, శుభం | సుఖం, ఫలనాశనం | జయం, శుభకార్యాలకు మంచిది |
| లాభం, సంతోషం | మరణం, భయం | అతిభయం | ధననాశనం, భయము |
| లాభం, క్షేమము | చోరభయము, హాని | కార్యారంభములకు మంచిది | కార్యజయము, క్షేమము |
| శాంతి, జయం | కలహము, కృషి | ప్రయాణమున రోగబాధ | వాహనయోగ ప్రయాణాల్లో |
| కలహం, ప్రయాణమున భయం | సర్వకార్య ఆరంభాలకు | | కార్యసిద్ధి, జయప్రాప్తి |
| ఇష్టసిద్ధి, శత్రుజయం | మంచిది, జయము | వాహనయోగం, కార్యప్రాప్తి | జ్ఞానవృద్ధి, శుభం |
| స్త్రీ లాభం, పుత్రలాభం | ధైర్యహాని, కార్యనాశనం | వివాద పరిష్కారమునకు | మనోభీష్టసిద్ధి, భయం |
| ప్రయాణమున విజయం, | | | |
| ప్రియ సంభాషణ, | బంధం, లాభం | కార్యనష్టం, దుఃఖం | ఉద్యోగనష్టం, ప్రయత్నజయం |
| వ్యవహారమున జయం | క్షేమము, శుభకర్మలు | ప్రయాణమునకు బంధన | ఆయురారోగ్యాభివృద్ధి |
| శుభము, వివాహానికి మంచిది | వివాహము, కార్యభంగం | ఆందోళనం, శత్రుభయం | భయం, శత్రునాశనం |
| కార్యజయం, క్షేమము | కష్టము, జ్వరశస్త్ర | ఉద్యోగ కార్య నష్టం | ప్రియసంభాషణం, శాంతి |
| మనఃక్లేశకరం, కార్యసిద్ధి | వివాదములు, హాని విద్యావృద్ధి | గొప్పభయం, ప్రయాణాన సుఖం | విరోధ నాశనం, లాభం |
| రాజదర్శనం, ప్రయాణము | వృద్ధి, మనోభీష్ట కార్యసిద్ధి | లాభాలు, ప్రయత్న నాశనం | సుఖము, జయము |

# వధూవర గుణమేళన చక్రము (వరుని నక్షత్రము)

| వధూ నక్షత్రం | అశ్వి | భ | కృ 1 | కృ 3 | రో | మృ 2 | మృ 2 | ఆర్ద్ర | పున 3 | పున 1 | పు | ఆ | మ | పు | ఉఫ 1 | ఉఫ 3 | హ | ఛి 2 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | 28 | 33 | 28 | 18 | 21 | 22 | 26 | 17 | 18 | 22 | 31 | 27 | 21 | 26 | 17 | 11 | 9 | 13 |
| భరణి | 34 | 28 | 29 | 19 | 22 | 15 | 18 | 26 | 26 | 30 | 23 | 24 | 21 | 19 | 28 | 21 | 19 | 6 |
| కృత్తిక1 | 27 | 27 | 28 | 17 | 9 | 15 | 19 | 20 | 21 | 25 | 26 | 23 | 17 | 21 | 22 | 15 | 15 | 18 |
| కృత్తిక3 | 18 | 18 | 19 | 28 | 19 | 25 | 16 | 17 | 18 | 22 | 23 | 20 | 19 | 23 | 24 | 21 | 21 | 23 |
| రోహిణి | 23 | 23 | 10 | 19 | 28 | 36 | 27 | 23 | 23 | 27 | 26 | 13 | 12 | 26 | 28 | 25 | 26 | 20 |
| మృగ 2 | 22 | 13 | 15 | 27 | 34 | 28 | 20 | 25 | 23 | 26 | 19 | 22 | 21 | 17 | 25 | 23 | 27 | 13 |
| మృగ2 | 27 | 18 | 21 | 18 | 25 | 20 | 28 | 33 | 31 | 19 | 10 | 15 | 24 | 20 | 28 | 30 | 34 | 21 |
| ఆరుద్ర | 19 | 27 | 21 | 18 | 24 | 26 | 34 | 28 | 25 | 13 | 20 | 13 | 23 | 29 | 22 | 24 | 24 | 27 |
| పున 3 | 19 | 26 | 22 | 19 | 23 | 24 | 32 | 24 | 28 | 16 | 23 | 16 | 22 | 27 | 21 | 23 | 24 | 25 |
| పున3 | 21 | 28 | 23 | 20 | 24 | 25 | 19 | 10 | 14 | 28 | 35 | 28 | 15 | 20 | 14 | 18 | 18 | 20 |
| పుష్య | 30 | 21 | 26 | 23 | 24 | 17 | 10 | 18 | 21 | 35 | 28 | 30 | 18 | 14 | 23 | 26 | 27 | 12 |
| ఆశ్లేష | 25 | 23 | 22 | 19 | 12 | 21 | 13 | 12 | 15 | 28 | 28 | 28 | 15 | 15 | 17 | 20 | 20 | 26 |
| మఖ | 21 | 21 | 17 | 18 | 11 | 19 | 22 | 22 | 21 | 16 | 18 | 16 | 28 | 30 | 26 | 16 | 16 | 22 |
| పుబ్బ | 27 | 19 | 21 | 22 | 25 | 17 | 20 | 28 | 27 | 22 | 16 | 16 | 30 | 28 | 34 | 24 | 22 | 8 |
| ఉ॥ఫ1 | 18 | 27 | 22 | 23 | 27 | 25 | 28 | 21 | 21 | 16 | 25 | 18 | 26 | 34 | 28 | 18 | 26 | 14 |
| ఉ॥ఫ3 | 13 | 21 | 16 | 21 | 25 | 23 | 30 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 25 | 19 | 28 | 25 | 24 |
| హస్త | 11 | 20 | 16 | 21 | 26 | 26 | 33 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 22 | 17 | 26 | 28 | 27 |
| చిత్త 2 | 13 | 6 | 19 | 25 | 20 | 12 | 19 | 26 | 24 | 20 | 12 | 26 | 23 | 9 | 15 | 24 | 27 | 28 |
| చిత్త 2 | 22 | 15 | 28 | 23 | 20 | 12 | 13 | 20 | 18 | 20 | 12 | 26 | 25 | 10 | 17 | 17 | 20 | 21 |
| స్వాతి | 27 | 29 | 17 | 12 | 16 | 27 | 27 | 26 | 26 | 28 | 28 | 15 | 13 | 25 | 25 | 25 | 27 | 21 |
| విశాఖ3 | 22 | 22 | 20 | 15 | 10 | 18 | 19 | 21 | 21 | 22 | 21 | 19 | 17 | 19 | 18 | 17 | 18 | 27 |
| విశాఖ1 | 16 | 16 | 14 | 19 | 14 | 22 | 13 | 14 | 14 | 19 | 18 | 15 | 21 | 23 | 21 | 13 | 19 | 28 |
| అనూ | 24 | 14 | 19 | 24 | 27 | 20 | 11 | 16 | 21 | 26 | 18 | 21 | 24 | 20 | 29 | 26 | 27 | 12 |
| జ్యేష్ఠ | 12 | 18 | 24 | 29 | 22 | 22 | 13 | 3 | 6 | 10 | 20 | 26 | 31 | 23 | 16 | 13 | 12 | 25 |
| మూల | 12 | 20 | 24 | 19 | 13 | 14 | 21 | 15 | 12 | 8 | 17 | 24 | 25 | 19 | 9 | 13 | 13 | 27 |
| పూ॥షా | 27 | 20 | 19 | 13 | 20 | 12 | 18 | 26 | 26 | 23 | 13 | 17 | 21 | 19 | 27 | 27 | 26 | 11 |
| ఉ॥షా 1 | 25 | 27 | 14 | 8 | 11 | 18 | 24 | 26 | 26 | 23 | 24 | 9 | 11 | 26 | 28 | 28 | 27 | 20 |
| ఉ॥షా3 | 28 | 29 | 16 | 14 | 17 | 22 | 20 | 22 | 22 | 27 | 28 | 13 | 6 | 22 | 23 | 26 | 25 | 17 |
| శ్రవ | 27 | 26 | 13 | 10 | 17 | 26 | 23 | 21 | 23 | 28 | 26 | 15 | 17 | 18 | 20 | 23 | 25 | 18 |
| ధనిష్ఠ2 | 20 | 10 | 26 | 23 | 20 | 12 | 8 | 17 | 17 | 22 | 13 | 28 | 18 | 5 | 12 | 16 | 18 | 16 |
| ధనిష్ఠ 2 | 20 | 11 | 26 | 30 | 27 | 19 | 10 | 19 | 19 | 14 | 5 | 20 | 25 | 11 | 19 | 17 | 21 | 18 |
| శతభిషం | 15 | 21 | 28 | 32 | 25 | 25 | 18 | 10 | 10 | 7 | 15 | 20 | 26 | 20 | 13 | 11 | 8 | 26 |
| పూ॥భా3 | 18 | 25 | 20 | 24 | 31 | 31 | 24 | 17 | 17 | 13 | 20 | 24 | 19 | 25 | 17 | 15 | 17 | 18 |
| పూ॥భా1 | 14 | 21 | 16 | 19 | 26 | 26 | 25 | 18 | 18 | 18 | 25 | 18 | 16 | 22 | 14 | 16 | 18 | 19 |
| ఉ॥భా | 24 | 15 | 18 | 21 | 25 | 17 | 16 | 25 | 27 | 26 | 19 | 20 | 17 | 15 | 25 | 27 | 26 | 9 |
| రేవతి | 25 | 24 | 11 | 14 | 17 | 26 | 25 | 24 | 25 | 24 | 27 | 13 | 12 | 22 | 22 | 24 | 26 | 20 |

బ్రాహ్మణులకు గ్రహమైత్రియును, క్షత్రియులకు గణకూటమును, వైశ్యులకు రాశి లేక స్త్రీ దీర్ఘ కూటము.

# వధూవర గుణ మేళన చక్రము (వరుని నక్షత్రము)

| చి 2 | స్వా | వి 3 | వి 1 | అనూ | జ్యే 2 | మూ | పూ | ఉషా 1 | ఉషా 3 | శ్ర | ధ 2 | ధ 2 | శత | పూభా 3 | పూభా 1 | ఉభా | రే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 22 | 26 | 22 | 19 | 26 | 15 | 13 | 27 | 24 | 26 | 24 | 21 | 21 | 15 | 16 | 14 | 24 | 26 |
| 14 | 29 | 22 | 19 | 17 | 19 | 21 | 20 | 27 | 28 | 26 | 19 | 10 | 20 | 14 | 22 | 16 | 28 |
| 27 | 15 | 19 | 16 | 20 | 26 | 24 | 19 | 14 | 15 | 10 | 25 | 25 | 27 | 19 | 17 | 19 | 11 |
| 22 | 10 | 14 | 21 | 25 | 31 | 20 | 13 | 9 | 14 | 10 | 23 | 29 | 31 | 23 | 20 | 22 | 14 |
| 19 | 15 | 9 | 16 | 30 | 24 | 14 | 20 | 11 | 17 | 18 | 20 | 26 | 24 | 30 | 27 | 26 | 19 |
| 10 | 25 | 17 | 23 | 22 | 25 | 15 | 11 | 18 | 21 | 24 | 13 | 19 | 27 | 29 | 26 | 17 | 27 |
| 14 | 27 | 19 | 14 | 11 | 13 | 23 | 18 | 24 | 20 | 25 | 12 | 13 | 21 | 23 | 27 | 17 | 27 |
| 20 | 27 | 20 | 13 | 17 | 4 | 16 | 27 | 27 | 22 | 22 | 17 | 18 | 11 | 16 | 19 | 27 | 27 |
| 18 | 27 | 21 | 13 | 20 | 5 | 13 | 26 | 27 | 27 | 23 | 17 | 18 | 11 | 17 | 19 | 27 | 28 |
| 20 | 27 | 20 | 19 | 26 | 10 | 8 | 20 | 21 | 28 | 27 | 21 | 12 | 7 | 11 | 17 | 25 | 25 |
| 11 | 26 | 11 | 20 | 19 | 22 | 17 | 11 | 22 | 26 | 25 | 13 | 4 | 14 | 18 | 24 | 18 | 27 |
| 25 | 11 | 16 | 15 | 20 | 26 | 22 | 16 | 8 | 12 | 13 | 27 | 18 | 18 | 12 | 18 | 20 | 12 |
| 25 | 11 | 17 | 24 | 26 | 34 | 24 | 21 | 11 | 5 | 4 | 18 | 24 | 25 | 18 | 17 | 18 | 12 |
| 11 | 25 | 19 | 26 | 24 | 24 | 19 | 19 | 27 | 21 | 18 | 4 | 11 | 19 | 24 | 23 | 16 | 24 |
| 17 | 26 | 17 | 24 | 32 | 19 | 10 | 27 | 28 | 22 | 20 | 11 | 18 | 12 | 16 | 15 | 26 | 24 |
| 16 | 25 | 16 | 18 | 27 | 13 | 15 | 28 | 29 | 26 | 25 | 16 | 10 | 14 | 14 | 18 | 29 | 27 |
| 19 | 36 | 17 | 19 | 36 | 12 | 14 | 26 | 27 | 23 | 24 | 19 | 19 | 7 | 14 | 19 | 27 | 27 |
| 20 | 19 | 26 | 28 | 11 | 25 | 28 | 13 | 21 | 17 | 19 | 18 | 18 | 24 | 18 | 22 | 11 | 21 |
| 28 | 27 | 34 | 24 | 7 | 21 | 28 | 13 | 21 | 25 | 27 | 26 | 20 | 26 | 20 | 15 | 4 | 13 |
| 28 | 28 | 20 | 10 | 23 | 18 | 23 | 26 | 18 | 22 | 23 | 27 | 21 | 20 | 25 | 19 | 20 | 13 |
| 34 | 18 | 28 | 18 | 17 | 21 | 28 | 21 | 13 | 17 | 17 | 32 | 26 | 26 | 22 | 16 | 13 | 5 |
| 23 | 8 | 17 | 28 | 27 | 31 | 23 | 17 | 9 | 12 | 12 | 27 | 27 | 26 | 22 | 21 | 18 | 9 |
| 7 | 22 | 17 | 28 | 28 | 31 | 16 | 14 | 22 | 25 | 26 | 12 | 12 | 22 | 24 | 24 | 18 | 27 |
| 20 | 17 | 20 | 31 | 30 | 28 | 15 | 17 | 17 | 20 | 20 | 25 | 25 | 18 | 11 | 9 | 21 | 21 |
| 27 | 21 | 27 | 24 | 26 | 16 | 28 | 27 | 25 | 15 | 15 | 21 | 25 | 11 | 11 | 17 | 25 | 27 |
| 11 | 26 | 19 | 18 | 18 | 19 | 27 | 28 | 34 | 24 | 23 | 8 | 15 | 22 | 29 | 32 | 23 | 32 |
| 20 | 19 | 12 | 11 | 25 | 19 | 25 | 34 | 28 | 18 | 15 | 15 | 22 | 22 | 28 | 31 | 32 | 23 |
| 24 | 23 | 16 | 14 | 28 | 22 | 16 | 25 | 19 | 28 | 25 | 25 | 17 | 17 | 23 | 30 | 32 | 23 |
| 25 | 23 | 16 | 14 | 28 | 23 | 17 | 25 | 15 | 24 | 28 | 30 | 20 | 18 | 23 | 32 | 31 | 24 |
| 24 | 26 | 30 | 28 | 14 | 28 | 21 | 9 | 16 | 25 | 21 | 28 | 18 | 23 | 21 | 26 | 15 | 22 |
| 19 | 22 | 25 | 28 | 12 | 26 | 29 | 16 | 13 | 18 | 21 | 20 | 28 | 33 | 28 | 18 | 7 | 14 |
| 26 | 19 | 26 | 26 | 21 | 19 | 22 | 23 | 23 | 18 | 18 | 25 | 33 | 28 | 19 | 9 | 17 | 16 |
| 19 | 28 | 21 | 21 | 27 | 12 | 15 | 30 | 29 | 24 | 25 | 20 | 27 | 19 | 28 | 18 | 23 | 20 |
| 12 | 20 | 14 | 21 | 27 | 11 | 15 | 31 | 30 | 28 | 30 | 25 | 17 | 7 | 16 | 28 | 33 | 30 |
| 3 | 19 | 12 | 19 | 20 | 22 | 24 | 22 | 31 | 29 | 29 | 14 | 6 | 16 | 21 | 33 | 28 | 34 |
| 13 | 11 | 5 | 12 | 27 | 22 | 27 | 30 | 21 | 19 | 22 | 22 | 14 | 16 | 18 | 29 | 33 | 28 |

శూద్రులకు యోని పొంతనము శుభ యుక్తమై ఉండి 10 గుణములకు పైన వచ్చిన వివాహమునకు శుభము.

## ఏల్నాటి శని ప్రభావము




జన్మరాశికి – 12, 1, 2 రాశులలో శని సంచరించుటనే ఏల్నాటి శని యందురు. ఒక్కొక్కరాశిలో 2 $\frac{1}{2}$ సం॥రముల చొప్పున మొత్తం 7 సం॥రములు దోషమగును. 12వ రాశిలోనికి రాగానే ధనవ్యయముపై దెబ్బతీయును. దరిద్రము, ఇంటిపోరు, కష్టములు, మానహాని, వ్యవహార చిక్కులు కలుగును. జన్మ (1) రాశిలోనికి రాగానే గతంలో మిగిలిన దేమైనా వుంటే అది కూడా ఖర్చు చేయించి శరీరమును బాధించును. బంధు అరిష్టము, కళత్రపీడ, గుర్తించలేని వ్యాధులు, మతి భ్రమణం, కళాకాంతులు లేకపోవుట కలిగించును. 2వ రాశికి రాగానే – ఎనలేని ఆశలు కల్పించును. కాని నిందలుపడుట, నిత్యదుఃఖము కలుగును. మానసికముగా క్రుంగదీయును. 3వ రాశిలోనికి ప్రవేశించగానే సర్వ శుభములూ కలిగించును. 12, 1, 2 రాశులలో శని సంచారమిట్లుండును.

| | సం॥ | నె | రో |
|---|---|---|---|
| 1. | 0 | 3 | 10 |
| 2. | 1 | 1 | 00 |
| 3. | 1 | 8 | 10 |
| 4. | 1 | 4 | 20 |
| 5. | 1 | 1 | 10 |
| 6. | 0 | 10 | 00 |
| 7. | 0 | 6 | 20 |
| 8. | 0 | 6 | 20 |
| | 7 | 6 | 00 |

ముఖమునందు – హాని, పీడ
దక్షిణభుజము – జయం, లాభం
పాదములు – త్రిప్పట, బెంగ, అశాంతి
హృదయస్థానం – ధనప్రాప్తి, గౌరవం
వామభుజం – రోగము, దుఃఖము
శిరోభాగం – సంతోషం, లాభం
కన్నులు – మర్యాద, మన్నన, సంతోషం
గుదము – గొప్ప దుఃఖం, మానహాని

మొత్తంమీద శని సంచారవేళ 'గురుబలం' కొంత ఉపయుక్తమౌతుంది. ఏది యేమైనా ఈ 7 $\frac{1}{2}$ సంవత్సరాలు, శనిస్తోత్రం, జపం, దాన, ధ్యాన – శాంత్యాదులు, మృత్యుంజయ మంత్రజపం చేయాలి. శని పీడా పరిహారార్థమై తూ ॥ గో ॥ జిల్లా – కొత్త పేట తాలూకా – 'మందపల్లి' గ్రామమందు వెలసియున్న శ్రీ శనీశ్వరస్వామి వారికి తైలాభిషేకము, హోమాదులు జరుపుట శ్రేయస్కరం.

మరీ చిక్కులు పడేవారు తంత్ర శాస్త్రం ప్రకారం కాలిమట్టి, పాతమేకు, గ్రహించి నల్లగుడ్డలో శనీశ్వరమంత్రం లిఖించి అచ్చట కాల్వలో విడువవలెను. నల్ల బ్రాహ్మణునిచే నువ్వులు, నూనె, బెల్లము, నవధాన్యాలు మున్నగు పదార్థాలు అభిషేకమునకు వినియోగించవలయును.

## అమృతాది యోగములు

| నక్షత్రము | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | అమృ | అమృ | సిద్ధ |
| భరణి | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| కృత్తిక | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ | అమృ |
| రోహిణి | సిద్ధ | అమృ | అమృ | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృ |
| మృగశిర | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | సిద్ధ |
| ఆర్ద్రా | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | సిద్ధ | సిద్ధ |
| పునర్వసు | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ |
| పుష్యమి | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ |
| ఆశ్లేష | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | అమృ |
| మఖ | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | అమృ | మృత్యు | అమృ |
| పూ.ఫల్గుణి | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| ఉ.ఫల్గుణి | అమృ | సిద్ధ | అమృ | అమృ | మృత్యు | సిద్ధ | మృత్యు |
| హస్త | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | మృత్యు |
| చిత్త | సిద్ధ | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| స్వాతి | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | అమృ |
| విశాఖ | మృత్యు | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| అనూరాధ | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| జ్యేష్ఠ | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | ప్రబ | మృత్యు | సిద్ధ |
| మూల | అమృ | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ | అమృ | సిద్ధ |
| పూ.షాఢ | సిద్ధ | ప్రబ | సిద్ధ | అమృ | సిద్ధ | ప్రబ | సిద్ధ |
| ఉ.షాఢ | అమృ | మృత్యు | ప్రబ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శ్రవణం | అమృ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ |
| ధనిష్ఠ | మృత్యు | సిద్ధ | సిద్ధ | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శతభిషం | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ |
| పూ.భాద్ర | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| ఉ.భాద్ర | అమృ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| రేవతి | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | ప్రబ |

అమృ - అమృతయోగము    సిద్ధ - సిద్ధ యోగము
ప్రబ - ప్రబలారిష్టము    మృత - మృత్యుయోగము

## శాంతి నక్షత్రములు



అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, అశ్లేష, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, పూ.షాఢ, పూ.భాద్ర, రేవతి. ఈ 18 శాంతి తారలు. వీనిలో జ్యేష్ఠ, మూల మిక్కిలి దోషతారలు. జ్యేష్ఠ చివరి 4 ఘ॥లు, మూల ప్రారంభమందలి 4 ఘడియలు అత్యంత దోషము. పుష్యమి 2వ పాదం కర్కాటక లగ్నం - పూర్వాషాఢ 3వ పాదం ధనుర్లగ్నం - చిత్త 2వ పాదం కన్యాలగ్నం, ఉత్తర 1వ పాదం సింహలగ్న మందు పగలు పుత్రజననం తండ్రికి, రాత్రి బాలికాజననం తల్లికి గండము.

మరియు, బహుళ చతుర్దశి, అమావాస్య, సంధ్యాకాలం, గ్రహణ సమయం వర్జ్యదుర్ముహూర్తము లందు - తల్లీ తండ్రీ సోదరులు - వీరి నక్షత్రములందు జననమైన మిక్కిలి దోషము, తప్పక శాంతులు జరపాలి.

## నవవిధ శాంతులు

దుష్టనక్షత్రములందు స్త్రీలు రజస్వలలైనప్పుడు, గండ నక్షత్రములలో శిశుజననమైనప్పుడు జరుపవల్సిన శాంతి 9 విధములు. అవి దిగువనిస్తున్నాము. శాంతికిగాను తొమ్మిది పనులు చేయాలి.

1. **తైలావలోకనం :** కంచు లేదా మట్టిపాత్రలో తగినంత మంచినూనెపోసి అందులో పగడం - ముత్యం వుంచాలి. ఒకచోట ఉప్పు గుట్టగా పోసి - ఈ పాత్రను దానిపై వుంచి, ముందుగా గణపతిని పూజించి, అనంతరం తైలపాత్రను పూజించాలి. తదనంతరం - ఆ తైలంలో ఒకరి ముఖం ఒకరు చూసుకోవాలి.

2. **రుద్రాభిషేకం :** నక్షత్రం యొక్క దోష బలాన్ని బట్టి ఈ తంతు జరపాలి. అలాగని అతి ఖర్చులకు పోనవసరం లేదు. శక్తిమేరకు ముగ్గురుగాని, అయిదుగురుగాని, ఏడుగురుగాని, తొమ్మండుగురుగాని, పదకొండుగురుగాని, బ్రాహ్మణులను, యథాశక్తి నియమించి రుద్రన్యాసయుక్తముగా 11 పర్యాయములు శివాభిషేకము పూజ చేయించాలి. తదుపరి ఆ బ్రాహ్మణులను భోజన, తాంబూల, దక్షిణలచే సంతోషింపజేసి వారి ఆశీస్సులను పొందాలి.

3. **సూర్యనమస్కారములు:** ఒంటికాలిపై నిలిచి - అరుణ మంత్రమును 108 పర్యాయములు జపించుచు చేయు నమస్కారమునకు సూర్య నమస్కారమని పేరు. దీనికి ఒకరుగాని, ముగ్గురుగాని, 5గురుగాని బ్రాహ్మణులను నియమించాలి.

4. **మృత్యుంజయ జపం :** దీనినే అపమృత్యుహరం అంటారు. యథాశక్తి బ్రాహ్మణులను నియమించి - లక్షసార్లు మృత్యుంజయ మంత్రజపం చేయించటం సాంప్రదాయం. తద్వారా అన్ని విధములైన అపమృత్యదోషాలు తొలగిపోతాయి.

5. **నక్షత్ర జపం :** 27 గురు బ్రాహ్మణులను నియమించి - ఒక్కొక్క నక్షత్రమునకు 108 నుండి 1008 పర్యాయములు శాంతి మంత్రము జపించాలి.

6. **నవగ్రహ జపం :** నవగ్రహములకు 9 మంది విప్రులచే ఆయా శాంతి నిర్ణీత మంత్రములను జపించాలి.

7. **హోమము :** నవగ్రహముల పేరిట తగు హోమము (అగ్నిపూర్వకంగా) చేయించాలి.

8. **సువాసినీ పూజ :** శక్తిననుసరించి, తగినంత మంది ముత్తైదువలకు భోజన తాంబూలాదులిచ్చి పువ్వులు, పండ్లను సమర్పించి, నమస్కరించి వారి ఆశీస్సులు పొందాలి.

9. **ఈ ఎనిమిదింటి అనంతరం :** తగుమంది బ్రాహ్మణులకు సమారాధన చేయాలి. ఈ తొమ్మిది అంగములతో చేసినదీ - శాంతియనబడును. తద్వారా సర్వనక్షత్ర, గ్రహదోషములు - అపమృత్యు భయములు తొలగి సుఖశాంతులు లభిస్తాయి.

## మాసాధిపతులు - దైవనామాలు

| మాసము | మగ శిశువు | ఆడశిశువు |
|---|---|---|
| 1. చైత్రము | కృష్ణ | భూదేవి |
| 2. వైశాఖము | అనంత | కళ్యాణి |
| 3. జ్యేష్ఠము | అచ్యుత | సత్యభామ |
| 4. ఆషాఢము | చక్రి | పుణ్యవతి |
| 5. శ్రావణము | వైకుంఠ | రూపవతి |
| 6. భాద్రపదము | జనార్ధన | ఇందుమతి |
| 7. ఆశ్వయుజము | ఉపేంద్ర | ఇంద్రావతి |
| 8. కార్తీకము | యజ్ఞేశ్వర | లక్ష్మి |
| 9. మార్గశిరము | వాసుదేవ | వాగ్దేవి |
| 10. పుష్యమి | హరనాథ | పద్మావతి |
| 11. మాఘము | గోవింద | శ్రీదేవి |
| 12. ఫాల్గుణము | పుండరీకాక్ష | సావిత్రి |

## ప్రయాణమునకు శుభసమయములు



**శుభతారలు :** అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ఠ, రేవతీ నక్షత్రములు శ్రేష్ఠములు. రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శతభిషం మధ్యమములు. తక్కిన తారలు నిషిద్ధములు. మంచి నక్షత్రములందు వార శూలలూ, ఆనందాదియోగములూ చూచుకొని ప్రయాణించాలి. ఉభయ నక్షత్రములందలి 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు మరియు కృష్ణ 1 మంచివి.

**శుభవారములు :** తూర్పునకు మంగళవారం, దక్షిణమునకు సోమ, శనివారాలు, పడమరకు బుధ, గురువారాలు, ఉత్తరమునకు ఆది, శుక్రవారాలు మంచివి.

## ప్రయాణమునకు కూడని తిథి వార శూలలు

| దిక్కు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు |
|---|---|---|---|---|
| తూర్పు | 1-9 | శని-సోమ | జ్యేష్ఠ-ధనిష్ఠ | తుల-కుంభం |
| ఆగ్నేయం | 3-11 | శని-గురు | ....... | మకరం |
| దక్షిణం | 5-13 | గురు | శ్రవణం-అశ్విని | మీనం-వృశ్చికం |
| నైఋతి | 4-12 | సోమ-శుక్ర | ... | కర్కాటకం |
| పడమర | 6-14 | ఆది-శుక్ర | రోహిణి-పుష్యమి | ధనుస్సు-సింహం |
| వాయవ్యం | 7-15 | ఆది-మంగళ | .......... | మేషం |
| ఉత్తరం | 2-10 | బుధ-మంగళ | పుబ్బ-హస్త | కన్య, వృషభం |
| ఈశాన్యం | 8-30 | బుధ | ...... | మిథునం |

పై చక్రమందు చెప్పబడిన శూలలలో ప్రయాణము చేయరాదు. మరియు ఏకాదశీ సోమవారం, ద్వాదశి శనివారం, షష్ఠీ గురువారం, తదియ బుధవారం, అష్టమీ శుక్రవారం, నవమి ఆదివారం, పంచమీ మంగళవారం - ఇవి దగ్ధయోగములు. కావున ఈ రోజులలో అస్సలు ప్రయాణము చేయరాదు.

## కొత్తకాపురం

ఆడపిల్లలను క్రొత్తగా కాపురమునకు పంపుటకు ఆది, మంగళ, శుక్ర వారములు పనికిరావు. పునర్వసు నక్షత్రము దోష భూయిష్టము.

## నిర్ఘ విషయములు

నిషిద్ధకాలములందు తప్పనిసరి ప్రయాణమైనచో ఆదివారం బంగారమును, సోమ-వస్త్రం, మంగళ-ఆయుధం, బుధ-పుస్తకం, గురు-గొడుగు-టోపీ-తలపాగాలలో ఒకటి, శుక్ర-చెప్పులు లేదా వాహనం, శని - కంఠమున ధరించు వస్తువును ప్రయాణ మార్గములో ఎవరి ఇంటనైనా నిర్ఘ్యముంచుకొని-అవసరవేళ శుభ శకునమున ప్రయాణమై వెళ్ళవచ్చు.



## మహిళలకు శుభాశుభ ముహూర్తములు

### ప్రథమ రజస్వలా విషయములు

1. **శుభతారలు :** ఈ విషయములో నక్షత్ర బలమునకు పట్టు ఎక్కువ. దోష నక్షత్రమైనచో అధికశాంతి చేయించాలి. అశ్వి, రో, మృ, ఆర్ద్ర, పుష్య, ఉత్తరాత్రయ, చి, స్వా, వి, అనూ, మూ, శ్ర, ధ, శత, రేవతి మంచివి. భర్త యొక్క జన్మనక్షత్రము అమితహాని. వివాహాలకు వరుని జన్మతారను, వధువు ప్రథమ రజస్వలా తారనూ పరిశీలించి తీరాలి.
2. **శుభతిథులు :** 3, 5, 7, 10, 11, 13, 15 శుభం. తక్కిన వాటికి శాంతి.
3. **శుభవారములు :** గురు, శుక్ర మంచివి. సోమ, బుధ, సామాన్య శాంతి. ఆది, మంగళ, శనివారములు అధిక శాంతి.
4. **శుభలగ్నములు :** వృష, మిథు, కర్కాటక, కన్యా, తులా, ధనూ, మీనలగ్నములు మంచివి. తక్కినవి చెడ్డవి. అయినప్పటికినీ లగ్నము శుభబలయుతమైనచో సామాన్య శాంతి చాలును.
5. **వేళావిశేషములు :** ప్రాతః కాల చిరసౌభాగ్యం, ఉషర్వేళ సౌభాగ్యలోపం, పుర్వాహ్ణం పుణ్యక్షేత్ర దర్శనం, మధ్యాహ్నం ధనవతి, పుత్రవతి, సాయంత్రం జారగుణం - సంధ్యలు చెడుప్రవర్తన, అర్ధరాత్రి బాల్యవైధవ్యం, సమయాన్ని బట్టి శాంతులు జరపాలి.
6. **రాత్రి శంక :** రాత్రివేళ రజస్వలయైనచో ఆ రాత్రిని 3 భాగాలు చేయగా తొలి రెండు భాగములు పూర్వ దినము, మలిభాగము పరదినము.
7. **దుస్తులు :** చిరుగుల్లేనివీ, మంచివీ, శుభ్రమైనవీ, గట్టివీయైన వస్త్రాల్లో ప్రథమ రజస్వలయగుట క్షేమం. దుస్తుల రంగులను బట్టి ఫలితములు వేరుగా ఉంటాయి. తెల్లటి వస్త్రములు సర్వశుభప్రదములు.



8. **నూతన వస్త్రాభరణములు ధరించుట :** సోమ, బుధ, గురు, శుక్రవారములు మంచివి. మంగళవారము కీడు, అశ్వి, హ, చి, స్వా, వి, అనూ, ధనిష్ఠ, శ్రవ, రేవతి తారలు మంచివి. ఉత్తరాత్రయం, పుష్య, పున తారలు చెడ్డవి, చెడ్డ నక్షత్రాలున్న రోజున, మంగళవారం నాడు - కొత్తబట్టలూ, నగలూ ధరించకూడదు.
9. **కన్యలు ముక్కు కుట్టించుకొనుటకు :** అశ్వి, మృగ, పుష్య, ఉత్తరాత్రయం, హ, చి, స్వా, శ్ర, ధ, రేవతీ తారలందు - శుక్లపక్ష 2, 3, 5, 7, 10 తిథులలో సోమ, బుధ, గురు శుక్రవారములందు ఉదయం క్షేమం.
10. **క్రొత్తగా కాటుక వాడుటకు :** ఆది, శుక్ర, శనివారములును అశ్వి, చి, స్వా, వి, అనూ, ధని, రేవతీ తారలును మంచివి.

## శుభకార్యములకు శుభసమయములు



1. **వివాహనిశ్చయ తాంబూలములకు :** శుక్లపక్షంలో 11, 13, 15 తిథులు, ఉభయ పక్షములలోనూ 2, 3, 5, 7, 10 తిథులు, - ఆది బుధ, గురు, శనివారములును మంచివి. అశ్విని, పుష్యమి, హస్త, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం - ఈ నక్షత్రాలలో లగ్నమునకు 5 - 9 స్థానములలో పాపగ్రహములు లేనప్పుడు నిశ్చయ తాంబూలములు పుచ్చుకొనవలెను.

**2. పెండ్లికొడుకు, పెండ్లికుమార్తెను చేయుటకు :** మంచి తిథులతో కూడిన ఆ, బు,గు, శని వారములును పున, పుష్య, అశ్వి, అనూ, హ, చి, స్వా, శ్రవ, ధనిష్ఠ మంచివి. లగ్నాత్తు 5 – 9 స్థానములు శుద్ధిగా యుండవలెను.





**3. వివాహమునకు శుభవేళలు :** మాఘ, ఫాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠ మాసములు శ్రేష్ఠం. మార్గశిర, కార్తీక మాసములు మధ్యమం. చైత్ర, ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, పుష్యమాసములు అధమములు.

శుక్లపక్షంలో 2, 3, 5, 7, 9, 10, 13, 14, 15 తిథులు, బహుళపక్షంలో 1, 2, 5, 7, 9, 10 తిథులు బుధ, గురు, శుక్రవారములు మంచివి. రోహిణి, మృగశిర, మఖ, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూరాధ, మూల, రేవతీ నక్షత్రములూ – మేష, వృషభ, మిథున, సింహ, కన్య, తుల, ధనుర్మీన లగ్నములు శుభప్రదములు. మిగిలిన లగ్నములలో చేయరాదు. సప్తమశుద్ధి ప్రధానము. ముందుగా కుమారునకు ఉపనయనము చేయవలెను. పిదప కుమార్తెకు పెండ్లి చేయవలెను. ఏకోదరులకు ఆరునెలలలో పునః వివాహము చేయరాదు. కాని ఫాల్గుణ మందు ఒకరికిని, మీనేతర చైత్రమాస మందొకరికిని పెండ్లిచేయవచ్చును. అష్టమ శుద్ధిని కూడా చూడవలెను. కూతురుకు, కొడుకుకు ఒకే లగ్నంలో పెండ్లి చేయకూడదు.

$\frac{1}{2}$

**4. పెండ్లిపీట :** 5'' వెడల్పు, 6''ఎత్తు, 37'' పొడవు వుండాలి.



**5. గర్భాదానం :** ఈ తంతు రాత్రే జరపాలి. లగ్నంలో కాని, అష్టమంలో గాని గ్రహాలు వుండకూడదు. గురు చంద్ర శుక్రులు బలంగా వుండాలి. పంచపర్వాలు, శ్రాద్ధదినాలు పనికిరావు. వృషభ, కర్కాటక, కన్యా, తులా ధనుర్మీనలగ్నాలు మంచివి. సోమ, బుధ, గురు, శుక్రవారములు – 2, 3, 5, 7, 10, 13 తిథులు మంచివి. రో, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, ధని, శతభిష తారలు మంచివి. కానీ అవి వధూవరులలో ఏ ఒక్కరికి నైధనతార కాకూడదు.

**6. నిషేకం :** 2, 3, 5, 7, 10 తిథులు సోమ, బుధ, గురు, శుక్రవారాలు లగ్నశుద్ధి గల వృషభ, మిథున, కన్యా, తులా, ధనుర్మీన లగ్నాలు – అశ్వి, రోహి, ఉత్తరాత్రయం, హస్త, స్వా, అనూ, శ్రవ, శతభిషా తారలు శ్రేష్ఠం. సంధ్యావ్రత, శ్రాద్ధ పర్వదినములు, పగటి వేళలు పనికిరావు.

**7. వివాహానికి మృతాశౌచ శంక :** జ్ఞాతులు మరణించిన 1, సోదరులును పుత్రులు గాని మరణించిన 1 , భార్య మరణించినచో 3, తల్లి మరణించిన 6 నెలలు, తండ్రి గతించిన 12 నెలలూ వదలి పెండ్లాడవచ్చును.



**8. నవవధువు గృహప్రవేశం :** పెండ్లి అయిన ఆరవ రోజు నుండి 16వ రోజు లోపల గృహప్రవేశము చేసేవారికి తిథివార నక్షత్రాలతో పనిలేదు. అనంతరమైనచో విషమ వర్షమాసాదులు చూసుకోవాలి.

వృషభ, మిథున, కర్కాటక, సింహ, వృశ్చిక, ధనూ, కుంభ, మీనలగ్నములు మంచివి. ద్వాదశ శుద్ధి చూడాలి. బుధ, గురు, శుక్రవారములు – అశ్వి, రో, మృగ, పుష్య, ఉత్తరాత్రయం, హ, చి, స్వా, అనూ, శ్ర, మఖ, మూ, పున, జ్యే, ధని, రేవతీ తారలు – 2, 3, 5, 7, 10 తిథులు మంచివి.

**9. నవ వధువు అత్తవారింట ఉండదగనివి :** వివాహమైన మొదటి సంవత్సరం క్రొత్త పెండ్లికూతురు అత్తవారింట జ్యేష్ఠంలో వుంటే బావగారికి, పుష్య, ఆషాఢాలలో వుంటే మామగారికి – అధికమాసంలో భర్తకు, క్షయ మాసంలో వధువుకు కీడు.

**10. నవవధువు పుట్టింట వుండదగనివి :** పెండ్లి అయిన పిదప వచ్చిన తొలి చైత్రమాసంలో క్రొత్త పెండ్లికూతురు పుట్టింట వుండకూడదు. ఉంటే, తండ్రికి కాని, కుటుంబ యజమానికి గాని హాని.

**11. గాజులు పెట్టుటకు :** 5వ నెలలోగాని, 7వ నెలలోగాని (బేసి నెలలలో) పెట్టవలెను.

**12. పుంసవన సీమంతములు :** 2, 3, 5, 7, 10, 13, 15 తిథులు – బుధ, గురు, శుక్రవారములు – రో, హ, చి, స్వా, పుష్య, ఉత్తరాత్రయం, పున, అనూ, శ్ర, ధని, శత, రేవతీ, తారలు – మేష, మిథున, ధనూ, కుంభ లగ్నములు మంచివి. 3వ మాసము పుంసవనము చేయుటకు, సీమంత మునకు 4, 6, 8 నెలలు మంచివి.



## పురిటి విషయములు



1. **పురిటికి తెచ్చుటకు :** 7 లేదా 9వ నెలలో తేవాలి.
2. **పురిటి విధి :** తొలి రెండు పురుళ్ళు పుట్టింట, 3వ పురుడు అత్తింట పోయవలెను. 3వ పురుడు పుట్టింట పోసినచో శిశుహాని.
3. **బాలెంతరాలి పథ్యమునకు :** 2, 3, 5, 7, 9, 10, 11, 13, 15, తిథులు – రో, మృ, పున, పుష్య, అనూ, శ్ర, ధ, శత, రే, ఉత్తరాత్రయతారలు – బుధ, గురు, శుక్రవారములూ మంచివి. పథ్యలగ్నాత్తు పదవయింట పాపగ్రహముకాని, వీక్షణగాని లేకుండా చూడాలి.
4. **బాలెంత స్నానం :** పురుడయిన 11వ నాడే చేయించాలి. ఒకవేళ అట్లు కుదరని యెడల ఆది, మంగళ, గురువారములు అశ్వి, రోహిణి, మృగ, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూ, రేవతీ తారలు మంచివి.
5. **బాలెంతరాలు నీళ్ళు తోడుటకు :** పురుడైన 21, 23, 25, 27, 29 రోజులలో 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు – మృ, పున, హ, అనూ, మూ, శ్రవణ తారలూ కలిసివచ్చిన – సోమ, బుధ, గురువారాలలో అనూ, మూ, శ్రవణ తారలూ కలిసి వచ్చిన – సోమ, బుధ, గురువారాలలో ఏదోనాడు జలపూజ చేయించి, నూతిలో చేదవేయించి నీళ్ళు తోడించాలి.
6. **శిశువునకు మొలత్రాడు కట్టుటకు :** పురిటి శుద్ధినాడే కట్టుట శుభము. కుదరని ఎడల, మంచి తిథిలో అశ్వి, రో, మృ, పుష్య, ఉత్తరాత్రయము, హ, అనూ, మూ, రేవతీ తారలతో కూడిన మంగళవారమునాడు మొలత్రాడు కట్టుట మంచిది. ఈ తంతు 5వ మాసమందు చేయుట మంచిదని కొందరి మతము. వెండి, బంగారు తాడులుగాని, పసుపు,

తెలుపు త్రాడులుగాని కట్టవలెను. మొలత్రాడునకు నల్లపూసలు, రాగి కాని, పురిటివేళ తీసిన శిశువు బొడ్డుగాని కట్టినచో గాలీ ధూళీ దోషములు సోకకుండా ఉంటుంది.



7. **ఉయ్యాలలో వేయుటకు :** జననాది 1, 3, 5 నెలల్లో వర్జ్య దుర్ముహూర్తములు లేనివేళ, అష్టమశుద్ధి గల వృష, మి, కర్కాటక, కన్యా, తు, ధ, మీన లగ్నములలో శిశువు యొక్క శిరస్సు తూర్పు దిశగా ఉండు నట్లుగా తొట్టెలో పరుండబెట్టవలెను. ఇందుకు సో, బు, గు, శుక్ర వారములు 2, 3, 5, 7, 10, 13 తిథులు, అశ్వి, రో, మృ, పున, పుష్య, హ, చి, అనూ, రే, ఉత్తరాత్రయ తారలు మేలు.

8. **పురిటి శిశువు గృహాంతరము చేర్చుటకు :** 1, 2, 3, 5, 7, 10, 11, 12, 13, 15 తిథులలో అశ్వి, మృ, పున, పుష్య, హ,చి, అనూ, రేవతీ తారలలో చంద్రబలము బాగుగా ఉన్నపుడు బుధ, గురు, శుక్ర వారములలో శుభగ్రహ వీక్షణములలో నున్న కన్య, కుం, తు, మ, వృశ్చిక లగ్నములు శుభము.

## బిడ్డల విషయమై శుభాశుభములు

1. **నామకరణమునకు :** సో, బు, గు, శుక్రవారములు 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు – అశ్వి, రో, మృ, పున, పుష్య, మ, హ, స్వా, చి, అనూ, శత, ఉత్తరాత్రయ తారలు – అష్టమ శుద్ధిగల వృష, సిం, వృశ్చి, కుంభలగ్నములు మంచివి. బిడ్డ పుట్టిన 11, 21, 29 దినములలో గాని, 3వ నెలలో గాని పేరు పెట్టాలి.

2. **కేశ ఖండనం :** 2, 3, 5, 7, 10, 13 తిథులూ సో, బు, గు, శుక్రవారములు అశ్వి, మృ, పున, పుష్య, శ్ర, ధ, శతభిషా తారలూ మంచివి. స్త్రీ శిశువులకు బేసి మాసము, మగబిడ్డలకు సరిసమాసము మేలు.

3. **ముక్కు, చెవులు కుట్టుటకు :** 6, 7, 8 నెలల్లో – శుక్లపక్షములో – అష్టమశుద్ధీ గురుబలమూ వున్న వృష, మి, కర్కాటక, కన్య, ధ, మీనలగ్నములలో పగటిపూట జరపాలి. భ, కృ, ఆరు, ఆశ్లేష, మఖ, పూర్వాత్రయం, వి.జ్యే, మూలా అనే 11 తారలూ తప్ప తక్కినవన్నీ మంచివే. సో, బు, గు, శుక్రవారములూ 2, 3, 5 7, 10, 13 తిథులు శ్రేష్ఠమైనవి.



4. **అన్నప్రాశనము :** మగబిడ్డలకు 6, 8, 10, 12 నెలల్లోనూ – స్త్రీ శిశువులకు 7, 9, 11 నెలల్లోనూ లగ్న శుద్ధీ, దశమ శుద్ధీ కలిగిన వృష, మి, కట, కన్యా, ధ, మీన లగ్నములలోనూ మాత్రమే చేయాలి. అశ్వి, రో, పున, పుష్య, హ, చి, స్వా, అనూ, శ్ర, ధ, శత, రే ఉత్తరాత్రయం – ఈ 15 తారలు మాత్రమే మంచివి. 2, 3, 5, 7, 10, 13 తిథులు – సో, బు, గు, శుక్రవారములు శ్రేష్ఠములు. ఈ తంతు మధ్యాహ్నం 12 గంటల లోపలనే జరిపించాలి.



5. **ఉపనయనము :** మూఢము, దక్షిణాయనం పనికిరావు. అనాధ్యయన రహితమైన 2, 3, 5, 7, 10 తిథులు అశ్వి, రో, మృ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హ, స్వా, అనూ, శ, ధ, శత, రేవతీ తారలు మంచివి.

తల్లిదండ్రులకు తారాబలం చంద్రబలం ప్రధానంగా చూడాలి. లగ్నానికి కేంద్రంలోపాపులుగాని, చతుర్థంలో రవిగాని అస్సలు పనికిరాదు. అష్టమశుద్ధి వుండితీరాలి.

6. **దత్తత స్వీకారం :** 2, 3, 5, 7, 10 తిథులు శుక్లపక్ష 11, 13 మంచివి. బుధ, గురు, శుక్రవారములు శ్రేష్ఠం. రో. పున, ఉత్తరాత్రయం, హ, స్వా, అనూ, శ్ర, ధ, రేవతీ తారలు మంచివి. లగ్నంలో శుభగ్రహాలు వుండాలి. లగ్నం శుద్ధిగా వుండి శుభగ్రహ వీక్షణలుండాలి. ముఖ్యంగా లగ్నాత్ పంచమంలో పాప గ్రహాలు కాని, వారి వీక్షణ గాని ఉండకూడదు.



## విద్యా శుభ విషయములు

1. **అక్షరాభ్యాసము :** బిడ్డ 5 సం॥రాల (5 నెలల 5 రో॥లు) వయసులోవుండగా, ఉత్తరాయణంలో గురు, శుక్రమౌఢ్యములు లేనప్పుడు అనాధ్యాయ రహితంగా చూసి, అష్టమశుద్ధి గల మేష కటక, తులా, మకర లగ్నాలలో పగటి పూటనే జరిపించాలి. 2, 3, 5, 7, 10 తిథులు సోమ, బుధ, గురు, శుక్రవారములు అశ్వి, పున, పుష్య, హ, చి, స్వా, అనూ, రేవతీ, తారలూ మంచివి. (కొందరు ఆరుద్ర, జ్యేష్ఠ, మూల కూడా మంచివేనంటున్నారు.

2. **వేదవిద్యారంభమునకు :** 4, 8, 9, 14, 15 తిథులు పనికిరావు. 7, 13 మధ్యమము. తక్కిన తిథులలో గురుపాదులు నిర్ణయించిన తిథినాడు అశ్వి, రో, ఆరు, పున, పుష్య, ఉత్తరాత్రయం, హ, చి, స్వా, అనూ, మూ, శ్ర, రేవతీ తారలున్నప్పుడు ద్విస్వభావరాశులు లగ్నమైతే శుభం.

3. **గణిత విద్యాభ్యాసం :** రో, ఆరు, పుష్య, హ, అనూ, శత, పూర్వాభాద్ర, రేవతీ తారలు, బుధ, గురువారములు మంచివి.

4. **భాషా విద్యాభ్యాసం :** 2, 3, 5, 7, 10 తిథులు ఆది, మంగళ, శనివారములు. భ, ఋ, ఆరు, మఖ, పుబ్బ, వి, జ్యే, పూ. షాఢ, ఉ.షాఢ, శత, పూ. భాద్ర, రేవతీ తారలు మంచివి. చంద్రయుక్తమైన స్థిరలగ్నం క్షేమం.

5. **వ్యాకరణము నేర్చుటకు :** 2, 3, 5, 7, 10 తిథులలో అశ్వి, రో, మృ, ఆరు, పున, పుష్య, హ, చి, స్వా, వి, అనూరాధ నక్షత్రములలో సోమ, బుధ, గురు, శుక్రవారములలో ఈ విద్యాభ్యాసారంభము శుభము.

6. **ధర్మశాస్త్ర పురాణాది ఆర్షవిద్యలకు :** అశ్వి, మృ, పుష్య, హ, చి, స్వా, వి, అనూ, ధ, శత, రేవతీ నక్షత్రములు మంచివి.

7. **న్యాయశాస్త్ర విద్యారంభమునకు :** అశ్వి, రో, పున, పుష్య, స్వా, శ్ర, హ, శత, ఉత్తరాత్రయం – ఈ తారలు మంచివి.

8. **వైద్య విద్యారంభము :** 2, 5, 7, 10 తిథులు – ఆది, సోమ, మంగళవారములు మంచివి. భ, కృ, రో, మఖ, పూర్వాత్రయం, విశాఖాతారలు విడచి తక్కిన నక్షత్రాలన్నీ మంచివే.

9. **సంగీత నాట్యములకు :** సోమ, బుధ, గురు, శుక్రవారములు ఉత్తరాత్రయం. అనూ, పుష్య, హస్త, జ్యేష్ఠ, శత, ఆర్ద్ర, ధని, రేవతీ తారలు మంచివి.

10. **తంత్రీ (వీణ వగైరా) వాయిద్యములకు:** 5, 10, 13, 15 తిథులు బుధ, గురు, శుక్రవారములు – రో, మృ, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, అనూ, ధని, శత, రేవతీ తారలు ఉత్తమములు.

11. **తబలా మొ॥గు వాయిద్యములకు :** అశ్వి, మృ, పున, పుష్య, హ, చి, స్వా, అనూ, శ్ర, ధ, శత, రేవతీ తారలును – బుధ, గురు, శుక్రవారములును 5, 10, 15, 3, 8, 13 తిథులును మంచివి.



## వ్యాపారములకు శుభాశుభములు

**1. సాధారణముగా వర్తకమునకు :** 4, 9, 14 తిథులు మంగళ వారం, కుంభలగ్నం పనికిరావు. అశ్వి, రో, మృగ, పుష్య ఉత్తరాత్రయం, హ, చిత్త, అనూ, రేవతీ నక్షత్రములు శుక్రవారం చంద్రుడు లగ్నాధిపతిగా వుండి 3 – 11 స్థానాలలో పాప గ్రహాలూ పాపవీక్షణలు లేని లగ్నంలో ప్రారంభించాలి. కాని కొన్ని కొన్ని వ్యాపారాలకు కొన్ని కొన్ని ప్రత్యేక శుభవేళలుంటాయి. అవి దిగువ యిస్తున్నాము.

**2. బట్టల షాపులు :** 2, 3, 5, 7, 10 తిథులు – ఆది, మంగ, గురు, శుక్రవారములు – అశ్వి, రో, పున, ఉత్తరాత్రయం, హ, చి, స్వా, అనూ, శ్రవ, ధనిష్ఠా శత, రేవతీ తారలును శ్రేష్ఠము.

**3. బట్టలకు రంగులు వేయు వ్యాపారమునకు :** 2, 3, 5, 7, 10 తిథులును ఆది, మంగ, గురు, శుక్రవారములును – అశ్వి, పుష్య, పున, హ, చి, స్వా, వి, అనూ, శ్రవ, ధనిష్ఠా తారలును శ్రేష్ఠము.

**4. పండ్ల వ్యాపారమునకు :** 2, 3, 5, 7, 10 తిథులు సోమ, బుధ, గురు, శుక్రవారములు రో, మృగ, పున, పుష్య, ఉత్తర, హ, చి, స్వా, శ్ర, ధ, పూ॥భాద్ర, ఉ॥భాద్ర రేవతీ తారలును ఉత్తమము.

**5. వెండి, బంగారు షాపులకు :** 2, 3, 5, 7, 10 తిథులు సోమ, బుధ, గురు, శుక్రవారములు – అశ్వి, రో, పున, పుష్య, హ,చి, స్వా, ఉత్తరాత్రయం, అనూ, శ్ర, ధ, శత, రేవతీ తారలును శ్రేయస్కరములు.

**6. ఇనుము, స్టీలు :** 2, 3, 5, 7, 10 తిథులును, బుధ, శనివారములు, అశ్వి, రో, మృగ, పుష్య, అనూ, స్వా, ఉ॥భాద్ర మంచివి.

**7. విస్కీ బ్రాంది వంటి మత్తు పానీయ వ్యాపారములకు :** 2, 3, 5, 7, 10, 11, 15 తిథులును మంగళ, శని, ఆదివారములును భరణి, ఆరుద్ర, ఆశ్లేష, మఖ, పూర్వాత్రయం, జ్యేష్ఠ, మూల శతభిషా తారలును తులా, ధనుర్మకర, కుంభ, మీన, మేష, వృషభ లగ్నములును మంచివి.

**8. టి.వి., రేడియో ఎలక్ట్రానిక్స్ :** 2, 3, 5, 7 తిథులును సోమ, బుధ, శని వారములును మృగ, హ, చి, స్వా, అనూ, ఉ॥షా, శ్ర, ఉ॥భా నక్షత్రములు మంచివి.

**9. ఫ్యాన్సీ దుకాణములకు :** 2, 3, 5, 7 తిథులును సో, బు, శుక్రవారములు రో, మృ, పుష్య, హ, చి, శ్ర, ధనిష్ఠాతారలు యోగ్యమైనవి.

**10. జోళ్ళ షాపులకు :** కృ. మృగ, ఆర్ద్ర, ఆశ్లేష, మఖ, పూర్వాత్రయం.

**11. ఎలక్ట్రికల్ సామాను, గాజు సామాను వ్యాపారములకు :** 2, 3, 5, 7, 10, 15 తిథులు, సోమ, మంగళ వారములును రో, మృగ, పుష్య, హ, చి, అనూ, ధ, ఉ॥భాద్ర తారలును శ్రేష్ఠములు.

**12. పుస్తకములు స్టేషనరీ :** 2, 3, 5, 7, 10 తిథులను సో, బు, గు, శుక్రవారములును – రో, మృగ, హ, స్వా, అనూ, ఉ॥షాఢ, శ్ర, శత, పూ॥భాద్ర, ఉ॥భాద్ర, రేవతీ తారలు ఉత్తమోత్తమములు.

**13. మందుల దుకాణము :** మంగళ, బుధ, ఆదివారములును, రో, మృగ, ఉత్తర, చి, స్వా, అనూ, ఉ॥షాఢ, శ్ర, ధనిష్ఠ తారలును శ్రేష్ఠములు. మృగ, ఉత్తర, చి, స్వా, అనూ, శ్ర, ధ, శత, ఉత్తరాత్రయ రేవతి తారలు మంచివి.

**14. కిరాణా కొట్టుకు :** సోమ, బుధ, గురు, శుక్రవారములును రో, మృగ, హ, చి, స్వా, అనూ, శ్ర, ధ, శత, రేవతీ తారలును బాగుండును.

**15. వీణ, తబల వంటి అన్నిరకాల వాయిద్యములకు :** 3, 5, 8, 10, 13, 15 తిథులును బుధ, గురు, శుక్రవారములును – అశ్వి, మృగ, పున, పుష్య, హ, చి, స్వా, అనూ, శ్ర, ధ, శత, రేవతీ తారలును బాగుండును.

**16. ఫర్నీచర్ షాపులకు :** 2, 3, 5, 7, 10 తిథులును సోమ, బుధ, గురు, శుక్రవారములును రో, మృగ, పుష్య, ఉత్తరాత్రయం, హ,చి,స్వా, అనూ, శ్ర, శత, రేవతీ తారలును యోగ్యములు.

**17. పేకాట క్లబ్బు (జూదగృహాలకు) :** 2, 7, 8, 10, 12, 15 తిథులు. ఆది, మంగళ, శనివారములు – అశ్వి, మృగ, ఆర్ద్ర, పున, పుష్య, ఆశ్లేష, హ, చి, స్వా, అనూ, మూ, శ్ర, ధ, శతభిష తారలు మేష, సింహ, వృశ్చిక, మకర, కుంభలగ్నములు మంచివి.

**18. రైసు మిల్లులకు :** 2, 3, 5, 7, 10, 11 తిథులు సో, బు, గు, శుక్ర వారములు – అశ్వి, రో, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, చి, స్వాతి, అనూ, శ్ర, రేవతీ తారలు చతుర్థాష్టమ శుద్ధి గల స్థిరలగ్నములూ లాభం.

**19. హోటల్సుకు :** 2, 3, 5, 7, 10 తిథులు సో, బు, గు, శుక్రవారములు. అశ్వి, రో, మృ, పున, పుష్య, మఖ, ఉత్తరాత్రయం, హ, స్వా, అనూ, మూల, శ్ర, ధ, శత, రేవతి తారలు తృతీయ శుద్ధిగల శుభలగ్నమూ ఉత్తమం.

**20. చిట్‌ఫండ్స్‌కు :** 2, 5, 7, 10, 11 తిథులు బుధ, గురువారములు అశ్వి, రో, మృ, ఉత్తరాత్రయం,స్వా,అనూ,శ్ర,రేవతీ తారలు సప్తమమందు బలీయమైన శుభగ్రహమున్న వృష, మిధు, కర్కాటక, తులా, ధను, మీనలగ్నాలు శ్రేష్ఠం.

**21. సినిమా వ్యాపారములకు (ప్రొడక్షన్ & డిస్ట్రిబ్యూషన్) :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులు – సో, బు, గు, శుక్రవారములు అశ్వి, రో, మృ, పున, పుష్య, ఉత్తర, స్వా, అనూ, ఉ॥భాద్ర, రేవతీ తారలునూ సప్తమ శుద్ధి కలిగి, శుక్రుడు బలముగా వున్న లగ్నమందును లాభము. శని బలముగా వుండవలెనని మరికొందరి అభిప్రాయం.

**22. మోటారు వాహనాల వ్యాపారమునకు :** 2, 3, 5, 7, 10 తిథులు సో, బు, గు, శుక్రవారములు అశ్వి, రో, మృ, పున, పుష్య, మఖ, ఉత్తరాత్రయం, హ, స్వా, అనూ, మూ, శ్ర, ధ, శత, రేవతీ తారలూ – యజమానికి శుభలగ్నములు చూడవలెను.

## పశు మరియు మత్స్య సంబంధ ముహూర్తములు



**1. పశుశాల వేయుటకు :** 2,3,5,7, 10,11,13 తిథులు – సోమ, బుధ, గురు శుక్రవారములూ అశ్వ, మృగశిర, పుష్యమి, హస్త, మూల, పూర్వాభాద్ర నక్షత్రములును మంచివి. పుష్యమీ నక్షత్రమున్న గురువారమునాడు వృషభలగ్నమందలి, వృషభ నవాంశలో పశువులశాల వేసినచో విశేష శ్రేయస్సు కలుగుతుంది.

**2. పశువులను కొనుటకు :** బుధ, గురు, శుక్ర వారములును, అశ్విని, పున, పుష్య, హ, విశా, జ్యే, పూ.షా, ధని, పూ.భా, రేవతీ తారలు మంచివి.

**3. పశువులను క్రొత్తగా ఇంటికి తెచ్చుటకు :** ఆది, మంగ, శనివారములును భ, కృ, మృగ, ఆ, పున, మ, చి, స్వా, అనూ, మూలా తారలు మంచివి.

4. **పశువులను కట్టుటకు :** అశ్విని, మృగశిర, పుష్యమి, హస్త, మూల, పూర్వాభాద్ర నక్షత్రములు మంచివి.
5. **పశువులకు బంధము వేయుటకు :** ఆది, గురు, శుక్రవారములును, అశ్విని, మృగశిర, పుష్యమి, పుబ్బ, మూల, రేవతీ తారలును శ్రేష్ఠములు.
6. **పశువులను అమ్ముటకు :** అశ్విని, మృగశిర, ఆశ్లేష, మఖ, పూర్వాత్రయం, విశాఖ, జ్యేష్ఠ, ధనిష్ఠ, రేవతీ తారలు సోమ, బుధ, గురు, శనివారములు క్షేమము.
7. **పడవల తయారీకి :** 2,3,5,7,10,13 తిథులూ, బుధ, గురు, శుక్రవారములు, అశ్వి, రో, మృ, పున, పుష్య, హస్త, చిత్త, ఉత్తరాత్రయం, శ్రవ, అనూ, రేవతీ తారలును, వృష, మిథు, క, కన్యా, తులా, ధనుర్మీనములు మంచివి.
8. **పడవ నీటిలో దింపుటకు :** 2,3,5,7,10,11,13 బహుళ పాడ్యమీ తిథులును, సోమ, బుధ, గురు, శుక్రవారములును, అశ్వి, మృగ, హ, చి, స్వా, మూ, ఆశ్రే, మఖ, పూర్వాత్రయం, రే, విశాఖ తారలునూ, మేష, మిథున, కర్కాటక, తులా, మకర, మీన లగ్నములును యోగ్యములు.
9. **గాలము ముహూర్తము :** 1,2,3,4,5,7,10,13,15 తిథులు రో, మృగ, ఆరు, పున, పుష్య, పూర్వాత్రయం, ఉత్తరాత్రయం, హ, చి, స్వా, వి, అనూ, శ్ర, ధ, శత, రేవతీ తారలు వృషభ, మిథున, కర్కాటక, తులా, మకర, మీన, కుంభములు శుభం.
10. **వలను నీటిలో తడుపుటకు :** 1,5,7,10,11,15 తిథులు, సోమ, బుధ, వారములు అశ్వి, రో, స్వా, శ్ర, అనూ, పుష్య, జ్యే, హ, పున, ఉత్తర, శత, మూల తారలు లాభకరమైనవి.
11. **వల ముడుచుటకు :** సోమ, బుధ, గురు, శుక్రవారములు రో, పుష్యం, ఉత్తరాత్రయం, ఆర్ద్ర, శ్ర, ధ, శతభిష తారలు శ్రేష్ఠం.

## గృహవాస్తు సాంప్రదాయములు

### వాస్తు పురుష స్థితి

వాస్తు పురుషుడు - భాద్రపద, అశ్వయుజ, కార్తీక మాసములలో తూర్పు శిరస్సుగను - మార్గశిర, పుష్య, మాఘములలో దక్షిణమున శిరస్సు పెట్టి కాళ్ళు ఉత్తరమున బెట్టియు - ఫాల్గుణ, చైత్ర, వైశాఖములలో పడమర శిరస్సును, తూర్పున కాళ్లను బెట్టియు, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణములలో ఉత్తరమున శిరస్సు బెట్టియు - ప్రక్కకు ఒదిగి తల క్రింద చేయిపెట్టి పరుండును. కాన, ఆ మాసములలో వాస్తు పురుషుని దృష్టికి ఎదురుగను పాదములున్న దిక్కులందును గృహం నిర్మించరాదు.

### గృహ నిర్మాణమునకు మాసములు

చైత్రమున భయము - వైశాఖము సంపద - జ్యేష్ఠము మృత్యుప్రదము - ఆషాఢమున సిరిసంపదలు నశించును - శ్రావణమున శుభము - భాద్రపదమున రోగభయము - ఆశ్వయుజమున కలహములు - కార్తీకమున ధనయోగము - మార్గశిరమున కష్టములు - పుష్యమి చోర, అగ్ని, ప్రమాదముల భయం - మాఘం వంశాభివృద్ధి - ఫాల్గుణం ధనలాభం. ఈ విషయములో గ్రంథ భేదములు గలవు.

### శంఖుస్థాపన

కుటుంబములో వివాహము జరిగిన సంవత్సరము లోపలను, భార్య గర్భవతిగ యున్నప్పుడు ఆరు మాసముల తరువాత గృహ నిర్మాణము చేయరాదు. దేవుని పూజా మందిరము ఈశాన్యములో తూర్పు గోడకు చేర్చి యుంచ వలయును. అనగా పూజ చేయుటకు కూర్చుండువారి ముఖము తూర్పు దిక్కుగ ఉండవలయును. వంట ఆగ్నేయములో తూర్పు గోడకు చేర్చి, వంట చేయువారి ముఖము తూర్పున చూచునట్లుండ వలయును. మరుగుదొడ్లు ఆగ్నేయ, నైరుతి వాయువ్యములలో వీలుబట్టి యేర్పరచుకొనవలెను.

ధాన్యపుగాదులు ఉత్తరదిక్కున ఉండవలయును. వాటి ప్రవేశ ద్వారములు దక్షిణమును చూచునట్లుండవలయును. ఈశాన్యములో మరుగుదొడ్డి పెట్టరాదు. ఏ స్థలమునకైనను ఉత్తర, ఈశాన్య, తూర్పుల నుండి నీరు బయటకు పోవునట్లు తూములుపెట్టుకొనుట మంచిది. ఆ విధముగా వీలులేనప్పుడు ఆగ్నేయ, వాయవ్య మూలల నుండి నీరు బయటకు పోవునట్లు పెట్టుకొనుట మంచిది.

గృహము నిర్మించు స్థలము చతురస్రముగా గాని, దీర్ఘ చతుస్రముగా గాని యుండవలయును. చతురస్రములో నాలుగు దిక్కుల కొలతలు సమానముగా యుండును. దీర్ఘ చతురస్రములో ఎదుటి భుజములు మాత్రమే సమానమైన కొలతలు కలిగియుండును.

నైరుతిమూల నుండి నీరు బయటకు పోవునట్లు తూములు పెట్టరాదు. నీటి వాటములు స్థలములకు మాత్రమే చెప్పబడినవి. ఇండ్లలో యీ విధులు పాటించనవసరము లేదు. యింటిలో యుండు గదులను బట్టి నీటి వాటములు యేర్పరచుకొనవచ్చును.

సింహద్వారమునకు రెండు వైపుల కిటికీలు ఉండవలయును. ఇంటి ద్వారములు మూయునప్పుడు తెరచునప్పుడు ధ్వని కలుగరాదు. ఎత్తు తక్కువ యిల్లు కుబ్జ గృహమనబడును. అందు నివసించరాదు.

గృహము కట్టదలచిన స్థలము తూర్పు, ఉత్తరములలో, ఎత్తుగయుండి, పశ్చిమ, దక్షిణములు పల్లముగా యున్నచో "ఉచ్ఛవేధ" వచ్చును. ఇది శుభ ప్రదము కాదు. దక్షిణ, పశ్చిమములు ఎత్తుగా యుండట మంచిది.

కిటికీలు లేని గృహము "అంధకవేధ" కలదియగును. రేగు, అరటి, దానిమ్మ చెట్లు ఉన్న గృహము సర్వదా వృద్ధి పొందుచుండును.

పశ్చిమ, ఉత్తర దిక్కులకు శిరస్సు పెట్టి నిద్రించరాదు. దిగంబరుడుగా శయనించరాదు. దిగంబరుడుగ సంభోగము చేయరాదు. తడికాళ్ళతో శయనించరాదు.

అన్నదమ్ములు ఒక గృహమును పంచుకొని, అందు నివసించునప్పుడు పెద్దవారు దక్షిణ, పశ్చిమ దిశలలోను. చిన్నవారు తూర్పు ఉత్తర భాగములలోను యుండుట శుభము. ఇందు కుడి, ఎడమ భేదములు కూడా గలవు.

**భోజనము :** తూర్పు లేక ఉత్తర దిశలను చూచుచు కూర్చుండి భోజనము చేయుట శుభప్రదము.

**వసారాలు :** వసారాలు కట్టదలచినచో దక్షిణపు గోడ మీద ఎత్తు ఉంచి, చూరు ఉత్తరదిశకు దిగునట్లు కట్టవలయును. పడమర దిశలో వసారా వేయునప్పుడు, తూర్పునకు వాలు పెట్టి కట్టవలయును.

తన గృహమునకు చేర్చి తూర్పు, ఉత్తర ఈశాన్యములలోయున్న స్థలములనుకొని, తన స్థలమునకు కలుపుకొనరాదు. తన గృహమునకు ఈశాన్యములో మట్టిదిబ్బలు, గుట్టలు, పేడ కుప్పలు, మరుగుదొడ్లు ఉండరాదు. అట్లున్నచో కష్టనష్టములు కలుగుచుండును.

వాస్తు పురుషునకు సింహద్వారము ముఖము అగును. సింహద్వారము బట్టి ఆ యిల్లు తూర్పు యిల్లు. దక్షిణము యిల్లు, పడమర యిల్లు, ఉత్తరము యిల్లు అని చెప్పబడును.

1. తూర్పు యిల్లు – పడమర ద్వారము పెట్టి, ముఖము తూర్పుగ పెట్టి లోనికి ప్రవేశించునది. ఇది తూర్పు యిల్లు అగును. కార్తీక, మాఘ మాసములలో కట్టుకొనవలయును. అ–క–చ వర్గుల వారికి అర్వణము.

2. దక్షిణపు యిల్లు – ఉత్తరమున సింహద్వారము పెట్టి, దక్షిణముగ ముఖము పెట్టి లోనికి ప్రవేశించుచున్నచో, అది దక్షిణపు యిల్లు అనబడును. చ–ట–త–ప వర్గుల వారికి అర్వణము. మాఘ, ఫాల్గుణ, వైశాఖములలో కట్టవలయును.

3. పడమర యిల్లు – తూర్పున సింహద్వారము పెట్టి, పడమరదిశగ ముఖము పెట్టి లోనికి ప్రవేశించునది. పడమర యిల్లు, ఫాల్గుణ, వైశాఖ, శ్రావణ మాసములలో నిర్మించుట శుభప్రదము. ట–త–ప వర్గుల వారికి అర్వణము.

4. ఉత్తరపు యిల్లు – దక్షిణమున సింహద్వారము పెట్టి, ఉత్తర ముఖముగ లోనికి ప్రవేశించునది. ఉత్తరపు యిల్లు, శ్రావణ, కార్తీక మాసములలో కట్టవలయును. ట–త–చ వర్గుల వారికి అర్వణము.

గృహము కట్టువారి పేరులో మొదటి అక్షరము అ, క, చ, ట, త, ప, య, శ అను ఎనిమిది వర్గులలో ఏ వర్గునకు చెందినచో ఆ వర్గు స్వస్థానమగును. దాని 5వ వర్గ శత్రుస్థానమగును. ఆ శత్రు స్థానములో గృహ నిర్మాణము చేయరాదు. అర్వణము కాని వర్గులకు సంబంధించిన స్థలములలో గృహ నిర్మాణము చేసి, అందు నివసించినచో, సదా కష్టనష్టములు కలుగుచుండును.

తూర్పు యిల్లునకు, ఆగ్నేయములో వంటగది ఉండుట మంచిది. దక్షిణము యిల్లునకు ఆగ్నేయములో గాని, నైరుతిలో గాని వంటగది పెట్టుట మంచిది. పడమర యిల్లునకు నైరుతిలో వంటగది మంచిది. ఉత్తర గృహములకు నైరుతిలో వంట చేసుకొనుట మంచిది.

గృహనిర్మాణము చేయు స్థలములో దక్షిణ, పడమర దిక్కులలో ఉన్న స్థలము మాత్రమే కొంచెము ఎత్తుగ నుండవలయును. ఈ విధముగ శాస్త్రములో చెప్పియున్నది. ఆ సాంప్రదాయము గృహమునకు వర్తింపజేయరాదు. గృహములో దక్షిణ, పశ్చిమ దిక్కుల ఉన్న వసారాలు, గదులు కూడ తూర్పు ఉత్తరములలో ఉన్న వసారాలు, గదులకంటె ఎత్తుగ ఉండవలయునని కొందరు ఆధునిక శాస్త్రజ్ఞులు చెప్పుచు ఆ విధముగా గృహ నిర్మాణములు కూడ చేయించుచున్నారు. అది స్థలమునకు చెప్పబడెను గాని, గృహ నిర్మాణ విషయములో కాదు. గృహనిర్మాణములో ఆ పద్ధతిగ కట్టినచో విపరీత ఫలములు కలుగుటకు అవకాశము కలదు. ఇది శాస్త్ర విరుద్ధము, సాంప్రదాయ వివేకము.

**సింహద్వారము :** సింహద్వారము యింటి మధ్యలో పెట్టరాదు. ఇంటి పొడవును 9 భాగములు చేసి 4వ భాగములో సింహద్వారము పెట్టవలయునని మానసారాది వాస్తుశాస్త్ర గ్రంథంలో చెప్పబడియున్నది.

గృహనిర్మాణములో కలుగు వాస్తు దోషములు, మానసార, మయమత, విశ్వకర్మ ప్రవేశిక, శిల్పరత్న, అపరాజితపృచ్ఛ, సమరాంగణ సూత్రధారాది గ్రంథములలో చెప్పబడియున్నది.

## మృత విషయమై గృహవర్జన

1-2-3-6-9-12-14-30 తిథులు ఆది - మంగళ - శుక్ర వారములు దోషములు, చిత్త, మృగశిరా నక్షత్రములందలి మృతి విషయమై 3 నెలలు, కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ, విశాఖ పునర్వసులందైనచో 4 నెలలు; రోహిణి, మఘ, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతులందైనచో 6 నెలలు; భరణి నక్షత్రమైన 1 నెల - ఆ గృహమును విసర్జించవలెను. చెడుతిథి, చెడు వారము అయి నక్షత్రము బాగున్నచో అర్థదోషమగును. తిథి వారములతో నక్షత్రము కలిసినచో పూర్ణదోషము. తిథికంటే వారదోషము ఎక్కువ. శుక్రవారము కంటె మంగళవారము కీడు కల్గించును. ఈ వారములతో ద్వి - త్రిపాద - ధనిష్ఠా పంచక నక్షత్రములు కల్సినచో ఒక మరణముతో మరొక మరణము సంభవించు సూచన కలదు. కనుక గృహమును విసర్జించుట మంచిది.



## వ్యవసాయ విషయ శుభవేళలు

1. **క్రొత్త భూమిలో వ్యవసాయమునకు ప్రవేశించుటకు :** ఆది, మంగ, బుధ, శుక్రవారములు శ్రేష్ఠము. సోమవారం మధ్యమము. అశ్వి, రో, మఖ, ఉత్తరాత్రయం, హ, చి, స్వా, అనూ, మూల, ధ, రేవతీ తారలు మంచివి.

2. **ఎడ్లను కాడికి పూన్చుట :** రేవతి, శతభిషం, జ్యేష్ఠ, విశాఖ, హస్త, పునర్వసు, రోహిణి, భర, అశ్విని తారలు - ఆది, గురువారములు మంచివి.



3. **ఏరువాకకు దుక్కిదున్నుట :** శుభతిథులు ఆది, మంగళ, గురు, శుక్రవారాలు శ్రేష్ఠము. అశ్వి, రోహి, మృగ, పున, పుష్య, మఖ, హస్త, చిత్త, స్వా, విశా, అనూ, మూల, ఉ.షాఢ, శ్రవ, ధని, శత, ఉ.భా, రేవతీ తారలూ - వృష, మిథు, కన్యా, ధనుస్సు, వృశ్చిక లగ్నములూ మంచివి. మేష, కర్కాటక, సింహ, తులా, మకర, కుంభములు హాని.



4. **విత్తనములు చల్లుటకు :** చల్లబోయెడి విత్తనముల రంగునుబట్టి ఆ రంగు ఏ గ్రహముదో ఆ గ్రహవారములో చల్లుట మంచిది. మొత్తము మీద అన్ని విత్తనములకునూ భరణి, కృత్తిక, ఆరుద్ర, పునర్వసు, ఆశ్లేష, పూర్వాత్రయ, విశాఖ, జ్యేష్ఠా తారలు తప్ప తక్కిన నక్షత్రములతో కూడిన బుధ, గురు, శుక్రవారములు శ్రేష్ఠము. వీనికి కూడా ఏరువాక లగ్నములే మంచివి.

5. **పొల పెట్టుటకు :** 3,5,8,10,13,15 తిథులు - ఆది, గురు, శుక్రవారములు అశ్వి, రోహి, పున, పుష్య, మఖ, హస్త, చిత్త, స్వాతి, అనూ, మూల, రేవతీ తారలునూ మంచివి.

**6. వరి ఆకు ఊడ్చుటకు :** మొలకపైరు ఊడ్చుటకు 4-9-14 తిథులు, రేవ, ధని, మూ, అనూ, స్వా, చి, హ, ఉత్తర, మఖ, పుష్య, మృగ, రో, అశ్వినీ, తారలు సోమ, బుధ, గురు, శుక్రవారాలు శ్రేష్ఠం.

**7. కుప్ప వేయుటకు, నూర్చుటకు :** మూల, ఉత్తరాత్రయం, శ్రవణం, మృగశిర, పున, ధని, రేవ, రోహి, అనూ, మూల, స్వాతీ, తారలునూ, స్థిరలగ్నములును, బుధ, గురు, శుక్రవారములునూ మంచివి.

**8. ప్రత్తి చేను వేయుటకు :** అశ్వి, భర, మృగ, పున, పుష్య, హస్త, చిత్త, స్వాతి, మూల, రేవతీ తారలు - ఆది, గురువారములు కన్యా, మీన, కర్కాటక లగ్నములు మంచివి.

**9. ధాన్యము, అపరాలు మొదలైనవి రాశి కొలతలు :** గురు, శుక్రవారములు శ్రేష్ఠము, తక్కినవి చెడ్డవి.

**10. అన్ని జాతుల విత్తనాలు భద్రపరచుటకు :** మూ, ఉత్తరాత్రయం, శ్ర, మృ, పున, ధని, రో, రే, స్వా, అనూరాధ తారలు - సోమ, బు, గు, శుక్రవారములు - 1, 3, 5, 6, 7, 10, 11, 12, 1,3, 15 తిథులు - 3,6 స్థానాల్లో శుభులున్న కర్కాటక - సిం, మకర, మీన లగ్నములు మంచివి.

**11. పొలము నుండి క్రొత్తధాన్యం తెచ్చుటకు :** రో, చిత్త, రేవ, మృగ, అనూ, పుష్య, హస్త అను 7 నక్షత్రములందును - సోమ, గురు, శుక్ర వారములందును - తారబలం చంద్ర బలముల - వర్జ్య దుర్ముహూర్తములు లేని శుభవేళలో తెచ్చుకొనవలెను.



**12. పొగాకు తోటకు :** అశ్వి, భర, మృగ, ఆరుద్ర, పుష్య, స్వాతీ తారలు - ఆది, మంగళ, గురువారములు మంచివి.

**13. శనగ, కంది, గోధుమ విత్తులు జల్లుటకు :** రో, పున, ఉత్తరాత్రయం, స్వాతీ, అనూ, మూల, శ్రవ, ధని, రేవతీ తారలు బుధ, గురు, శుక్రవారములు - కర్కాటక, ధనూ, తులా, వృషభ, సింహ, వృశ్చికరాశులు మంచివి.

**14. ఉల్లి, కంది తోటలకు :** రేవ, అశ్వి, అనూ, స్వా, శత, పున, జ్యే, శ్ర పుష్య, మూ, హ, ఉత్తర, మృగశిర తారలు - ఆది, సోమ, బుధ, గురు, శుక్ర వారములలో సూర్యోదయమందు పైరు పెట్టవలెను.

**15. ఖర్జూర, పోక, కొబ్బరి తోటలకు :** అశ్వి, మృగ, పుష్య, హస్త, అనూ, మూలా తారలు - బుధ, గురు, శుక్రవారాలు - శుభతిథులు, స్థిర లగ్నాలు.

**16. అరటి, మామిడి తోటలకు :** అశ్వి, పుష్య, ఉత్తరాత్రయం, అనూ, రేవతీ తారలు - 3, 5, 8, 10, 13, 15 తిథులు బుధ, గురు, శుక్రవారములలో - మేష, వృశ్చిక కన్యా, వృషభ లగ్నములు మంచివి.

**17. చెఱకు తోటకు :** రో, మృగ, ఉత్తరాత్రయం, చిత్త, అనూ, శ్ర, ధ, శత, రేవతీ మరియు కర్తరీ దోషములేని పుష్యమీ తారలును - సోమ, బుధ, గురు, శుక్రవారములును, శుక్ల పక్షమందలి 5 - 7-10 తిథులును - ధనుస్సు, తులా, మీన, వృశ్చిక, మిధున లగ్నములును మంచివి.

**18. గింజలు పాతరలో పోయుటకు :** భ, కృ, ఆర్ద్ర, ఆశ్రే, మఖ, పూర్వాత్రయం, జ్యేష్ఠాతారలూ, తప్ప తక్కినవి మంచివి. సోమ, బుధ, గురు, శుక్రవారములు వృష, మిధు, సింహ, కన్యా, వృశ్చి, ధనుస్సు, మీనం మంచివి.

**19. పొలము కాపలా కాయుటకు :** అశ్వి, కృ, చిత్త, మూ, ధనిష్ఠా, తారలు - బుధ, గురు, శుక్రవారములు మంచివి.

**20. పొలంలో చేపల చెరువు త్రవ్వించుటకు :** శుభతిథులు వారములు - అనూ, మఖ, హ, రే, ఉత్తరాత్రయం, రో, ధని, పూ.షాఢ, శత, పుష్యమీ తారలును శుభమాసములును మంచివి.

## గృహోపయోగ విషయ శుభాశుభములు

1. **బంగారం, వెండి, స్టీలు పాత్రలు వాడుటకు :** బుధ, గురు, శుక్ర వారములు – అశ్వి, రో, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం. హ, చి, స్వా, అనూ, శ్ర, శత, రేవతి తారలుండగా – అమృతయోగ ఘడియలలో భుజించుట ఆరంభించవలెను.
2. **క్రొత్త వాహనములు వాడుట ప్రారంభించుటకు :** 2, 3, 5, 7, 10, శు – 11, 13, తిథులును, సో, బు, గు, శుక్రవారాలు – రో, పున, పుష్య, ఉత్తరాయణం, హ, చి, స్వా, అనూ, జ్యే, శ్ర, రేవతి తారలు – అష్టమ శుద్ధిగల వృష, మిథు, కట, కన్యా, తులా, ధనుస్సు, మీన లగ్నాలు మంచివి.
3. **మంచములు, కుర్చీలు వగైరా ఫర్నిచర్ వాడుటకు :** 1, 2, 3, 4, 7, 10 తిథులు – బు, గు, శుక్రవారాలు అశ్వి, రో, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హ, చి. అనూ, శ్ర, రేవతి తారలు శ్రేష్ఠము.

**తలంటు, నేత, నూతన వస్త్రధారణకు వార ఫలములు**

| వారములు | తలంటు | మంచం నేత | వస్త్రధారణ |
|---|---|---|---|
| ఆదివారము | సంతానం | ధనలాభం | చిరుగుట |
| సోమవారము | శాంతి | సౌఖ్యం | చింతన |
| మంగళవారము | అల్పాయువు | దుఃఖం | శుభహాని |
| బుధవారము | ధనలాభం | పీడ | ధనప్రాప్తి |
| గురువారము | ధననష్టం | సౌఖ్యం | జ్ఞానవృద్ధి |
| శుక్రవారము | సౌఖ్యహాని | రాజ్యలాభం | మిత్రప్రాప్తి |
| శనివారము | సర్వలాభం | నాశనం | మాలిన్యత |

4. **క్రొత్త జోళ్ళు కొనుట, వాడుటకు :** ఆర్ద్ర, మృ, మఖ, ఆశ్రే, చి, వి, జ్యే, మూ, పూర్వాత్రయ, రేవతి తారలు – బు, శ, ఆదివారాలు మంచివి.
5. **క్రొత్త స్టీలు పాత్రలు, కంచములు వాడుటకు :** శుభ తిథులు, సో, బు, గు, శుక్రవారాలు అశ్వి, రో, మృ (ఆర్ద్ర), పున, పుష్య, ఉత్తర, హ, చి, (స్వాతి), అనూరాధ, (రే), తారలు – శుభలగ్నములు మంచివి.
6. **గాస్ స్టౌ, ఫ్రిజ్, మిక్సీలవంటి ఆధునిక పరికరాల వాడకం మొదలుపెట్టుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులూ మం, బు, గు, శుక్ర వారములు వర్జ్య, దుర్ముహూర్తాలు లేని కుజహోరలో మంచివి.
7. **పరామర్శకు :** ద్విపాద, త్రిపాద తారలు, ధనిష్ఠా పంచకం పనికిరావు. సంఘటించినదాది సంవత్సరం లోపల ఏదో ఒక బేసినెల.
8. **ఇండ్లు, స్థలములు, భూమి కొనుటకు, అమ్ముటకు :** 1, 5, 6, 10, 11 తిథులు మృగ, పున, ఆశ్రే, మఖ, పుర్వాత్రయం, విశా, అనూ, మూల, రేవతి తారలు మంచివి. పూర్ణ తిథులగుట మంచిది. కొనుటకు గురు, శుక్రవారములు అమ్ముటకు బుధ, గురువారములు మంచివి.
9. **ఇతర వస్తువులు కొనుటకు :** అశ్వి, చి, స్వా, శ్ర, శత, రేవతి ఈ నక్షత్రములతో కూడిన గురువారం సర్వశ్రేష్ఠం. ఇతర తారలు ఆశ్రేయాలు.
10. **అమ్ముటకు :** మంచి తిథి, వారం కలిసొచ్చినవి – కృ, ఆశ్రే, భ, పూర్వాత్రయ నక్షత్రాలు లాభసాటివి.
11. **యజ్ఞోపవీతధారణ :** శ్రావణ పౌర్ణమి, గ్రహణ మోక్షం, జాతామృతాశౌచానంతరాన క్రొత్త జందెం ధరించాలి.

## శకున ప్రకరణం

**1. మంచి శకునములు :** ముత్తయిదువ, వేశ్య, కన్య, పెండ్లి ఊరేగింపు, ఇద్దరు బ్రాహ్మణులు, దండధరుడగు శూద్రుడు, మంగళ వాయిద్యము, పండ్లు, పువ్వులు, ఛత్రము, చామరం, గుర్రము, ఏనుగు, పూర్ణకుంభము, చెరుకు, అన్నము, పాలు, పెరుగు, బోదుగులు, బియ్యము, ఆవు, కల్లుకుండ, మాంసము, పొగలేని అగ్ని, తేనె, చలువ చేసిన వస్త్రములు, అక్షతలు, వీణ, మృదంగం, శంఖం, భ్రమరము, నల్లకోతి, కల్లు, తెల్లని వస్తువులు, కుక్కచెవి విదుల్చుట, వధూవరులు, ఘంటానాదం, జయ శబ్ధము, మంగళ వస్తువులు, ఎదురుగా మృదువైన శీతల వాయువులు వీచుట, లేదా వెనుకనుండి ప్రయాణానుకూలమైన గాలులు వీచుట, మూపువంకరలేని ఎద్దు - అద్దము మున్నగునవి ఎదురగుట, శుభవార్తలు వినుట, కోడి, ఆడకుక్క, నెమలి మొ॥నవి - ఎడమ ప్రక్కనుండి వెళ్ళుట మంచిది.

**2. దుశ్శకునములు** : సకేశ, వికేశ వితంతువులు, ఒంటి బ్రాహ్మణుడు, ముగ్గురు వైశ్యులు, కాషాయబట్టలు కట్టినవారు, పాము, కొత్తకుండ, కట్టెలమోపు, నూనె, ముష్టివాడు, కుంటికుక్క, ముక్కులేనివాడు, రోగి, అంధుడు, కుంటివాడు, రజస్వల, గర్భిణిస్త్రీ, ఉప్పు, బొగ్గులు, రాళ్ళు, అమేధ్యం, నువ్వులు, మినుములు, గొర్రెలు, నపుంసకులు, పిల్లి, పంది, మజ్జిగ, దూది, బూడిద, కురూపి, చెడు జంతువులు, ఆయుధధారులు, విరోధి, ఒకేతుమ్ము, ఏడ్పు వినబడుట, అకాలవర్షం, అపానవాయువు నిడచుట, ముక్కుచీదుట, బల్లిపడుట, ఊక, కలహము, చెడుమాట, వెళ్ళవద్దని కోరుట, భోజనము చేయుమని అడుగుట, సిద్ధవస్తువులు జారుట, దెబ్బతగులుట, తొట్రుపడుట, మనసు కీడు శంకించుట, ఆరోగ్యము లేకుండుట - గుడ్లగూబ కూయుట, కోతి ఎదురగుట - ఇవన్నియూ దుశ్శకునములు.

దుశ్శకునములు ఎదురైన వెంటనే ఇంటిలోనికి వెళ్ళి - కాళ్ళూ, చేతులూ కడుగుకొనవలెను. పన్నెండుసార్లు నీళ్ళు పుక్కిలించి వూయవలెను. తలపై నీరు చల్లుకొని, కండ్లు నీళ్ళతో తుడుచుకొని - కూర్చొని - గుక్కెడు నీరు సేవించి - ఇష్ట దైవమును ప్రార్థించి అప్పుడు మరో మంచి శకునమును చూసుకొని ప్రయాణము చేయవలెను. ప్రయాణమునకు బయలుదేరునప్పుడు "ఎక్కడకు?" అనిగాని, "ఎప్పుడు వస్తావు?" అని కాని - ఎవరునూ అడుగరాదు. ప్రయాణమై వెళ్ళిన వెంటనే ఇల్లు కడుగుట - ఇల్లాలు తలస్నానము చేయుట దరిద్ర హేతువులు.

## జాతాశౌచాదిక విషయములు

**1, నెల పురుడు :** మగశిశు జననం మొదలు 30 రో॥ స్త్రీ శిశు జననం మొదలు 40 రో॥ నెల పురుడు పట్టవలెను. శిశువుకు దంతములు రాకుండానే మృతిచెందితే తల్లితండ్రులకి ఒకనెల అశౌచం. జ్ఞాతులకి స్నానంతో శుద్ధి, దంతములు వచ్చిన తర్వాత 3 సం॥ల లోపున మరణిస్తే తల్లిదండ్రులకు 30 రోజులు, జ్ఞాతులకు 1 రోజు అశౌచం. తదాది విప్రులలో ఉపనయనమయ్యేలోపు గాని – ఇతరులలో బిడ్డ గడికట్టే లోపలగాని అశుభం జరిగితే అందరికీ 3 రో॥లే అశౌచం. ఉపనయనమైన పిదప మరణిస్తే పక్షిణీదార్లకు స్నానమాత్ర శుద్ధి, తల్లితండ్రులకూ జ్ఞాతులకూ 1 రో॥ అశౌచం. (తల్లిదండ్రులకు, తల్లితండ్రులు, పినతండ్రి, పెత్తండ్రి, పినతల్లి, పెత్తల్లి, అత్తమామలు, మేనత్తలు, అన్నదమ్ములు, బావా మరుదులు, కూతురు, కూతురి సంతతి, తల్లితండ్రులు – వారి వారి సంతతి – వీళ్ళంతా పక్షిణీదారులు. దత్తునికి కన్నవారూ – కన్నవారికి దత్తుడూ కూడా పక్షిణీదారులే. రజస్వల కాని బాలిక మరణిస్తే కేవలం స్నానశుద్ధి. వివాహితయైన స్త్రీ మరణిస్తే పక్షిణీదారులు కూడా మైలపట్టి తీరాలి.

**2. పక్షిణ్యాశౌచం :** మృతి మొదలు – ఎప్పుడు తెలిసినా – పక్షిణీదారులకు త్రిరాత్ర శేషానశుద్ధి. మూడు రోజులపై బడి, పది రోజుల లోపల వింటే, విన్నది మొదలు 36 గంటలు మైల. పదిరోజుల పైబడి తెలిస్తే కేవలం స్నానమాత్ర శుద్ధి.

**3. ఏకజాతీయాశౌచము :** ముందుగా వినిన అశౌచముతో తరువాత వినిన అశౌచము కలసిపోవును. కాని 10 రో॥ పట్టవలసిన అశౌచము – 3 రో॥ అశౌచములో కలవదు.

**4. స్వీయజాతా శౌచము :** తల్లితండ్రుల మృతాశౌచము విధిగా పాటించవలెను. ఇది ఎందులోనూ లీనమవదు. ఈ అశౌచము ముందు సర్వాశౌచములూ నశించిపోవును.

**5. తర్పణ క్రమం :** ముందుగా తల్లితండ్రులకీ, సవతి తల్లి, తల్లి తండ్రి, తండ్రి తండ్రి, ముత్తాతలు, భార్య పుత్రులు, పినతండ్రీ, పెత్తండ్రులు, మేనమామ, కూతురు, బావలు, మరుదులు, అత్తమామలు, విద్యాగురువు, సద్గురువు, ప్రభువు, స్నేహితుడు – ఈ క్రమంలో తర్పణ లీయాలి. మాతామహ్యాదులను పితామహ్యాదులతో కలపక విడిగా తర్పణము లీయాలి. భార్యలు పోయినవారికి సభార్యానాం అనియు, బిడ్డలు పోయినవారికి సంతతే అని – భర్తృహీనులకు సభర్తృణం అనియు సగోత్రముగా తర్పణమీయవలెను. (సవతి తల్లికి వలెనే – సాపత్న్య సోదరులకు కూడా)

**6. సూతకాదుల ప్రారంభ నిర్ణయము :** జాతాశౌచ, మృతాశౌచ, రజస్వలాదులు రాత్రి జరిగినచో – రాత్రి కాలమును 3 భా॥ చేసి – తొలి 2 భా॥ లందైన పూర్వదినముగను – 3 భా ॥ యందైన పరదినముగనూ గణించవలెను. తల్లిదండ్రుల మృతికి 1 సం॥ము సూతకము. తానే కర్తయైన – సవతి తల్లి మృతికి 6 నెలలు సూతకము. స్వభార్య మృతికి 3 నెలలు సూతకము. ఇతరుల మృతియందు సూతకము సూచించబడలేదు.

## మరణ సంబంధ విషయములు

రోహిణి, మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందును పాడ్యమి, విదియ, షష్ఠి, అష్టమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, అమావాస్య తిథులందునూ, ఆది, మంగళ, శుక్ర, శనివారములందును మరణం కలిగిన దోషము. మంచిదికాదు. కేవలం తిథి వలన అర్ధదోషము వార, నక్షత్రము వలన ప్రతిపాద దోషము తిథి వార నక్షత్రముల వలన సంపూర్ణ దోషము.

రోహిణి, మృగశిర, మఖ, చిత్త నక్షత్రములందు మరణించిన 3 మాసములు, కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాఢ నక్షత్రములందు మరణించిన 6 మాసములు, గృహమునందు మరణించినచో ఆ గృహము విడవవలెను. తదుపరి ఉదక శాంతి యిత్యాది శాంతులు చేసుకొని ఆ యింటిలో ప్రవేశించవలెను.

**ఈ విషయము గురించి మృతకాల చక్రానుసారము నడిచేది**

మరణం రోజున రవి ఏ నక్షత్రము నందుండెనో అది మొదలు ఈశాన్య దిక్కు నుండి తూర్పుదిశగా మూల దిక్కులందు మూడు నక్షత్రములునూ 4 దిక్కులందు నాల్గేసి నక్షత్రము లందునూ ఆరోహణావరోహణ క్రమంలో వ్రాయవలెను. రవి లగాయతు లెక్కింపగా మృతకాల నక్షత్రము చక్రమునకు మధ్యన ఉంటే ఆ గృహము 45 రోజులు విడవవలెను. దాని చుట్టూ ఉన్న 8వ గదిలో ఉన్నచో 30 రోజులు వదలివేయవలెను. దానికి చుట్టూ ఉన్న ప్రహరీలో ఉన్న యింటివారికి దోషము లేదు. దోషనక్షత్రములందు మరణం కలిగిననూ ఆ యిల్లు ఖాళీ చేయనవసరం లేదు. యింటిలోగాక, యింటియొక్క ఖాళీ స్థలములోనూ బయట ప్రదేశములందునూ చెడు తిథి, నక్షత్రవారములందు కలిగిననూ గృహం ఖాళీ చేయనవసరం లేదు.

కృ | ఆశ్లేష | మ
రో | పుష్య | పు
మృ | పున | ఉ
ఆర్ద్ర
భ | అశ్వ | రేవ | ఉ భా | మృత కాల చక్రం | హ | చి | స్వా | వి
పూ. షా
పూ.భా | ఉ.షా | మూ
శత | అభి | జ్యే
ధని | శ్రవ | అనూ

ఓమ్

## శ్రీ కృష్ణా పుష్కర మాహాత్మ్యము

### ప్రార్థన

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం

ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

వ్యాసం వశిష్ట నప్తారం శక్తేః పౌత్ర మకల్మషం

పరాశరాత్మజం వందే శుకతారం తపోనిధిం ॥



ప్రకాశం బ్యారేజి

### శ్రీకృష్ణవేణీ నదీ పుష్కర మాహాత్మ్య పుణ్యకాలం

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ దుర్ముఖి నామ సంవత్సర శ్రావణ శుద్ధ నవమి గురువారం 11-8-2016, రాత్రి 9 గంటల 28 నిమిషముల నుండి 22-8-2016 వరకు శ్రీ కృష్ణవేణీ పుష్కర మహా పుణ్యాకాలము.

## కృష్ణానదీ పుష్కర స్నాన విధానమ్

శ్లో॥ శంఖచక్రధరాం దేవీం నీలోత్పల దళప్రభావం
విష్ణురూపాంకితాం దేవీం కృష్ణవేణీం నమామ్యహమ్ ॥

## స్నాన సంకల్పాదికము

ఆచమ్య; ప్రాణా నాయామ్య ఏవంగుణ ... విశేషణ విశిష్టాయాం శుభతిథౌ అస్మత్పిత్రాదీనాం అక్షయ పుణ్యలోక ఫల ప్రాప్త్యర్థం కన్యాగతే దేవగురౌ సార్ధ త్రికోటి తీర్థసహిత పుష్కర ప్రయుక్త మహాపర్వణి పుణ్యకాలే శరీర శుద్ధ్యర్థ్యం కేశవపనం కారయిష్యే యితి సంకల్ప్య:

శ్లో॥ **మేరు మందర తుల్యాని పాపాని వివిధాని చ**
**కేశానాశ్రిత్య తిష్ఠంతి తస్మాత్కేశా న్వపామ్యహమ్ ॥**
**ఆత్మన శుద్ధికామోహం పితౄణాం ముక్తహేతవే**
**వపనం కారయామ్యద్య కృష్ణవేణీ నదీతటే ॥**

అన్ని పాపాలు వెంట్రుకలను ఆశ్రయించి ఉంటాయి. అందువల్ల వెంట్రుకలను తీసివేస్తున్నాను అని భావం.

ఇత్యుచ్చార్య క్షౌరం కారయిత్వా, స్నాత్వా, ఆచమ్య ప్రాణానాయమ్య, పూర్వోక్తైవం గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ, అనార్యవిద్యావాసనయా అస్మిన్ సంసారే విచిత్రాసు యోనిషు పునఃపునరేనకధా జనిత్వా కేనవా కర్మ విశేషేణేదానీం .. గోత్రే జాతస్య ..... (శర్మణః) నామధేయస్య మమ జన్మాభ్యాసా జ్జన్మ ప్రభృతి ఏతత్షణ పర్యంతం బాల్య యౌవన కౌమార్య వృద్ధత్వేషు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాసు మనోవాక్కాయేంద్రియ వ్యాపార్త్యైః జ్ఞానతః అజ్ఞానతశ్చ మయాకృతానాం, బహూనాం బహు విధానాం మహాపాతకానాం అపాత్రీకారణానాం, సంకలీ కారణానాం, మలినీ కారణానాం, జాతిభ్రంశ కారణాం, అవకర్ణకానాం, ప్రకర్ణకానాం సర్వేషాం పాపానాం అనోదనార్థం కన్యాగతే దేవగతే దేవగురౌ సార్ధత్రికోటి తీర్థసహిత పుష్కర ప్రయుక్త మహాపర్వణి పుణ్యకాలే కృష్ణవేణీ నదీ స్నాన మహం కరిష్యే.

స్నానాంగత్వేన చతుర్ముఖాధీనాం తర్పణాని కరిష్యే
చతుర్ముఖ జగత్స్రష్టః సర్వలోక గతావ్యయ ।
సర్వస్వత్యాచసహిత అర్ఘ్యం కన్యాగతే గురౌ ॥
**చతుర్ముఖాయనమః ఇదమర్ఘ్యం సమర్పయామి**
పుష్కరాక్ష జగన్నాథ లక్ష్మ్యాసహ జనార్ధన ।
అర్ఘ్యందదామి హే కృష్ణ ! తవకన్యాగతే గురౌ ॥
**విష్ణవేనమః ఇదమర్ఘ్యం సమర్పయామి.**
అష్టమూర్తే । మహేశాన । గంగాధరః కృపానిధే ।
గౌర్యసహ గృహాణార్ఘ్యం సతికన్యాగతే గురౌ ॥
**అష్టమూర్తఱ యేనమః ఇదమర్ఘ్యం సమర్పయామి.**
ఇంద్రాద్యా వసవోరుద్రా స్సాధ్యా విశ్వే తథాశ్వినౌ ।
సానుగాశ్చ సురాస్సర్వే అర్ఘ్యం కన్యాగతే గురౌ ॥
**ఇంద్రాది దేవతాభ్యోనమః ఇదమర్ఘ్యం సమర్పయామి.**
మునయో వాలఖిల్యాద్యాస్సప్తచైవ మహర్షయః ।
తే గృహ్ణంతు మయాదత్త మర్ఘ్యం కన్యాగతే గురౌ ॥
**వాలఖ్యాది మునిభ్యోనమః ఇదమర్ఘ్యం సమర్పయామి.**
అగ్ని ష్వాత్తా బరివాషదో నాగ్నయ స్సాగ్నయస్తథా ।
ఆజ్యపాః పితరశ్చార్ఘ్యం గృహ్ణంత్వపిచ సోమపాః ॥
**అగ్నిష్వాత్తాది పితృభ్యోనమః ఇదమర్ఘ్యం సమర్పయామి.**

బృహస్పతే ! సురాధ్యక్ష ! సర్వ దేవ సమస్కృత ।
కన్యాగతే సురాచార్యే । గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥
**బృహస్పతయేనమః ఇదమర్ఘ్యం సమర్పయామి.**
త్వంరాజా సర్వతీర్థానాం సర్వతీర్థ ఫలప్రద ।
గృహాణార్ఘ్యం మయాదత్తం పుష్కరాజ నమోస్తుతే ॥
**పుష్కరాక్షాయనమః ఇదమర్ఘ్యం సమర్పయామి.**
గంగాద్యాశ్చ మహానద్యో యాశ్చపుణ్యా సమాగతా ।
ఇదమర్ఘ్యం ప్రదాస్యామి యూయం గృహ్ణంతు సన్నిధౌ ॥
***గంగానదీ దేవతాభ్యోనమః ఇదమర్ఘ్యం సమర్పయామి.***
కృష్ణవేణీ నమస్తుభ్యం సర్వపాప ప్రణాశినీ ।
భక్త్యాదత్తం మయాదేవి । గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥
**కృష్ణవేణ్యై ఇదమర్ఘ్యం సమర్పయామి.**
భార్యాపతి విహీనాశ్చ అగ్నిసంస్కార వర్జితా
సహితాః ప్రేతరూపేణ అంతరిక్షే ప్రలంబితాః
అగ్నినా భృగుపాతేన ఉద్బంధేన జలేనవా
దంష్ట్రిభి ర్దంతిభిశ్చైవ శస్త్రేణ గరళేనవా
చోరాంత్య జాతిభిశ్చైవ అన్యైశ్చాపి హతాశ్చయే
కులద్వయే మదీయే చ యేచాన్యే గతివర్జితాః
తేషాముద్ధరణార్థాయ కన్యాయుక్తే బృహస్పతే
కృష్ణవేణ్యా మహాపుణ్యజలే నార్ఘ్యం మయార్పతమ్
ఇత్యర్ఘ్యాణి దత్వాస్నానతర్పణాని కుర్యాత్ ॥

## కృష్ణవేణీ దేవతా పూజావిధిః

ఆచమ్య. ప్రణానాయమ్య ఏవంగుణ తిథౌ సార్థ త్రికోటి తీర్థ సహిత పుష్కర మహా పర్వణి శ్రీకృష్ణవేణీ నదీ దేవతా పూజ్యాం కరిష్యే.

కలశ పూజాం, గణాధిప పూజాం చకృత్వా శ్రీ కృష్ణవేణీ దేవతాం ధ్యాయేత్.

పద్మాశ్యాం పద్మపత్రాక్షీం పద్మగర్భ స్వరూపిణీమ్ ।
చింతయే త్పద్మ చరణాం పద్మాసన నివేశనీమ్
చతుర్భుజాం చంద్ర చూడాం వరదాం పద్మధారిణీం ।
త్రైలోక్యపావనీం దేవీం దివ్యపుష్పోడ శోభితాం ॥

శ్రీ కృష్ణవేణీ నదీ దేవతాయైనమః ధ్యాయామి, ఆవాహయామి, రత్న సింహాసనం సమర్పయామి, పాద్యం సమర్పయామి, అర్ఘ్యం సమర్పయామి, పంచామృతస్నానం సమర్పయామి, శుద్ధోదక స్నానం సమర్పయామి, వస్త్రం సమర్పయామి, కంచుకం సమర్పయామి, హరిద్రాం సమర్పయామి, కుంకుమం సమర్పయామి, పుష్పాణి సమర్పయామి, అక్షతాన్ సమర్పయామి, ఆభరణాని సమర్పయామి.

ఓం శ్రీకృష్ణాయై నమః, ఓం శ్రీ మహాదేవ్యై నమః, ఓం సహ్యాద్రి ప్రభూతాయైనమః, ఓం నదీ మాతృకాయై నమః, ఓం పాపవినాశిన్యై నమః, శ్రీ మద్గిరిపరాయై నమః, ఓం సమస్తమౌని సంసేవ్యాయైనమః, ఓం సర్వాభీష్ట ఫలప్రదాయై నమః, ఓం బ్రహ్మహత్యాది పాపౌఘ వినాశిన్యై నమః, ఓం సకలాగమ సంవేద్యాయై నమః, ఓం శ్రీ కృష్ణవేణీ నదీ దేవతాయై నమః, నానావిధ పరిమళ పత్ర పుష్పాక్షితాన్ సమర్పయామి, దూపమాఘ్రాపయామి, దీపం దర్శయామి,

ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి, నైవేద్యం దద్యాత్, ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, తాంబూలం సమర్పయామి, కర్పూరనీరాజనం సమర్పయామి, మంత్రపుష్పం సమర్పయామి, ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

## ప్రసన్నార్ఘ్య మంత్రము

గంధపుష్పాక్షతైర్యుక్తం కుంకుమాన్విత ముత్తమమ్ ప్రసన్నార్ఘ్యం మాయాదత్తం సగృహాణ సరిద్వరే ।

శ్రీ కృష్ణవేణీ నదీ దేవతాయైనమః ప్రసన్నార్ఘ్యం సమర్పయామి.

## సువాసిన్యై శూర్పవాయనదానమ్

సువస్త్రం కంచుకోపేతం ఫలాదివ్యంజనా న్వితమ్

శూర్పదానం కరిష్యామి త్వత్ప్రీత్యై పరమేశ్వరీ !

ఇతిశూర్ప పాయనం సువాసిన్యైదద్యాత్ ! అనయాధ్యానా వాహనాది సర్వోపచార పూజయా భగవతీ ! సర్వాత్మికా ! కృష్ణవేణీ దేవతా సుప్రీతా సుప్రసన్నా వరదాభవతు.

## తీర్థశ్రార్ధ సంకల్పః

"ఏవంగుణ ....... శుభతిథౌ మమ పితౄణాం శాశ్వత బ్రహ్మలోకనివాస సిద్ధ్యర్థం ........ పితృ పితామహ ప్రపితా మహానాం ........ గోత్రాణాం ...... శర్మణాం వసురుద్రా దిత్య రూపాణాం మాతృ ....... గురోః, ధూర్విలోచన సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాంచ ప్రీత్యర్థం కన్యాగతే దేవగురౌ సార్ధత్రికోటి తీర్థసహిత పుష్కరమహాపర్వ ప్రయుక్త కృష్ణవేణీ తీర్థ శ్రాద్ధం అన్నేనహవిషా సద్దైవమధ్య కరిష్యే" అని సంకల్పించి తీర్థ శ్రార్థ ప్రయోగమును సక్రమముగా చేయవలయును.

## అథ పిండ ప్రదాన క్రమశ్లోకాః

ఆథౌపితా తథామాతా సాపత్నీ జననీ తథా । మాతా మహాస్సపత్నీకా ఆత్మ పత్నీత దైవచ । సుతభ్రాతృ పితృవ్యాశ్చ మాతులాశ్చ సభార్యకాః । దుహితాభగినీ చైవదౌహిత్రో భాగినేయకః । పితృష్వసా మాతృష్వసా జామాతా భావుకస్స్నుషా ।" శ్వశు రస్స్యాలకశ్చైవ స్వామినో గురురిక్థినః ।

## పితృవర్గ వివరము

1. పితా; 2. పితామహః, 3. ప్రపితామః, 4. మాతాఃసాపత్నీ మాతా (సవతి తల్లి); 5. పితామహీ; 6. ప్రపితామహీ; 7. మతామహ; 8. మాతుఃపితామహీ; 9. మాతుప్రపితామహః, 10. మాతామహీ; 11. మాతుః పితామహీ; 12. మాతుః ప్రపితామహీ; 13. ఆత్మపత్నీ (భార్య); 14. సుతః; 15. భ్రాతా; 16. పితృవ్యః (పెద తండ్రి లేక పిన తండ్రి); 17. మాతులః (మేనమామ); 18. దుహితా (కుమార్తె); 19. భగినీ (తోడబుట్టినది); 20. దౌహితకః (కుమార్తె వలన కలిగిన మనుమడు); 21. భాగనేయకః (మేనల్లుడు); 22. పితృష్వసా (మేనత్తలు); 23. మాతృష్వసా (తల్లి తోబుట్టువులు); 24. జామాతా (అల్లుడు); 25. భావుకః (తోబుట్టువు యొక్క పెనిమిటి); 26. స్నుషా (కోడలు); 27. స్యాలకః (బావమరిది); 28. స్వామినః (మతగురువు); 29. గురుః (ఉపనయనము చేసిన వారు); 30. రిక్థినః (తన చేత యుత్తమ గతిని పొందవలసిన వారు).

## పిండముల నుంచవలసిన క్రమము

పితృవర్గ వివరమునందు చూపిన సంఖ్య లెవరివో చూచుకొని ఆయా ప్రదేశములలో ఆయా పిండముల నుంచవలెను.

దక్షిణము

పశ్చిమము

| | | | | |
|---|---|---|---|---|
| | | 31 | | |
| | | 30 | | |
| | | 29 | 26 | |
| | 27-28 | 27 | 22-22 క | 23-3 క |
| | | 25 | 21-21 క | |
| | | 24 | 18-29 | |
| 9 | | 12 | 3-16 | 6 |
| 8 | 17-17 క+ | 11 | 2-15 | 5 |
| 7 | | 10 | 1-14 | 4-4 క+14 |
| | | | 13 | |

తూర్పు

ఉత్తరము

ఇంతకు ముందు చెప్పిన పితృవర్గ వివరమునందు యెవరికి యేయే సంఖ్యలు గుర్తు చూపుచున్నవో ఆయా సంఖ్యల ననుసరించి యీ చక్రములలో వారి పేరులందు పిండము లుంచవలయును. "క" యని యున్న చోటులలో వారి యొక భర్తగారి పిండము లేక భార్య పిండములుంచవలయును.

ఒక పిండమున కొక పిండము తగులకుండా అంగుళము దూరములలో నుంచవలయును. స్వగోత్ర యితర గోత్ర స్త్రీ, పురుషులకు వేఱు వేఱుగ తర్పణ పిండముల నీయవలయును. ఆ విధమును పాటించని క్రియలన్నియు వ్యర్థములగును.

చక్రమునందు చూపిన వానిలో 1 మొదలు 31 వరకు గల పిండములకు సంకల్పమునందు చెప్పబడిన మొదటి యిరవై యైదు సంఖ్యను కలవారికి అందుచెప్పబడిన విధముననే చేసి పిండప్రదానాదు లొనరింపవలయును. మొదటి యిరవది రెండు సంఖ్యలు కలవారికి వర్గము చెప్పకుండగనే శ్లోకములు చదువవలయును. 32 నుండి 53 సంఖ్యలు గలవారికి చిన్నచిన్న పిండములుంచవలయును.

1. శ్లో॥ అస్మత్కుల మృతాయేచ గతిర్యేషాం న విద్యతే
అవాహయిష్యే తాన్సర్వా స్కుశవృష్ఠే తిలోదకైః ॥
2. శ్లో॥ మాతామహికులే యేచ గతిర్యేషాం నవిద్యతే
అవాహయిష్యే త్సానర్వాన్కుశ పృష్ఠే తిలోదకైః ॥
3. శ్లో॥ బంధువర్గకులే యేచ గతిర్యేషాం నవిద్యతే
అవాహయిష్యే తాన్సర్వా స్కుశవృష్ఠే తిలోదకైః ॥

**32 నుండి 53 సంఖ్యలు గలవారికిట్లు చెప్పవలయును.**

1. శ్లో॥ అస్మత్కులే మృతాయేచ గతిర్యేషాం నవిద్యతే
తేషా ముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహమ్ ।
2. శ్లో॥ మాతా మహాకులే యేచ గతిర్యేషాం నవిద్యతే
తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహమ్ ।
3. శ్లో॥ బంధువర్గకులే యేచగతి ర్యేషాం నవిద్యతే
తేషాముద్ధరణార్థాయ ఇమం పిండ దదామ్యహమ్॥
4. శ్లో॥ అజాత దంతాయే కేచి ద్యేచగర్భే ప్రప్రీడితాః
తేషాముద్ధరణార్థాయ యిమం పిండం దదామ్యహమ్ ॥
5. శ్లో॥ అగ్ని దగ్ధాశ్చయే కేచి న్నాగ్ని దగ్ధాస్తథాపరే
విద్యుచ్ఛోర హతాయేచ తేభ్యః పిండం దదామ్యహమ్ ॥
6. శ్లో॥ దావదా హేమృతాయేచ సింహవ్యాఘ్ర హతాశ్చయే
దంష్ట్రిభి శ్శృంగి భిర్వాపి తేభ్యః పిండం దదామ్యహమ్ ॥
7. శ్లో॥ ఉద్బంభన మృతాయేచ విష శస్త్ర హతాశ్చయే
ఆత్మనోఘాతిన్మో యేచ తేభ్యః పిండం దదామ్యహమ్ ॥
8. శ్లో॥ అరణ్యే వర్మన్యేక్షుధయా తృష్ణయా హతాః
భూతప్రేత పిశాచాశ్చతేభ్యః పిండం దదామ్యహమ్ ॥

9. శ్లో॥ రౌరవే చాంధతామిస్రే కాలసూ త్రేచయే గతాః
తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహమ్ ।

10. శ్లో॥ అసిపత్ర వనే ఘోరే కుంభీపాకేచ యేగతాః
తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహమ్ ।

11. శ్లో॥ అనేక యాతనా సంస్థాః ప్రేతలోకంచయే గతాః
తేషాముద్ధరణార్థాయ తేభ్యః పిండం దదామ్యహమ్ ।

12. శ్లో॥ అసంఖ్య యాతనా సంస్థా యేనీతా యమశాసనైః
తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహమ్ ॥

13. శ్లో॥ నరకేషు సమస్తేషు యాతనాయాంచ సంస్థితాః
తేషాముద్ధరణార్థాయ ఇమం పిండం దదామ్యహమ్ ।

14. శ్లో॥ పశుయోని ఇతాయేచ పక్షి కీట సరీసృపాః
అథవా వృక్షయోని స్థానేభ్యః పిండం దదామ్యహమ్ ।

15. శ్లో॥ జాత్యంతర సహస్రేషు భ్రమంతః స్వేన కర్మణా
మానుష్యం దుర్లభం యేహాంతేభ్యః పిండం దదామ్యహమ్ ।

16. శ్లో॥ దివ్యంతరిక్ష భూమిస్థాః పితరో బాంధవాదయః
అపంస్కృతమృతాయేచ తేభ్యః పిండం దదామ్యహమ్ ।

17. శ్లో॥ యేకేచి త్ప్రేతరూపేణ వర్తంతే పితరో మమ
తేసర్వే తృప్తి మయాంతు పిండదానేన శాశ్వతమ్ ।

18. శ్లో॥ యేఽ బాంధవాబాంధవా వా యేఽ న్యజన్మని బాంధవాః
తేషాం పిండోమయాదత్తో హ్యక్షయ్య ముపతిష్ఠతు ।

19. శ్లో॥ విద్యుద్భిర్థం ష్ట్రిభిశ్చైవ విషవారి దవాగ్నిభిః
శస్త్రాస్త్ర దండ పాషాణై ర్నఖిభిః శృంగిభిర్గ్రహైః
కుష్ఠా పస్మార వాతాది భగందర జలోదరైః
గండమాలాభిః పాండు క్షయ వ్యాధిభిరర్థితాః
చండాతాద్వైకతాశ్చాన్యే ఆశౌచేశయనే మృతాః ।
అబ్రహ్మ స్వహరణా యేచ సురపాస్ప ర్థహారిణః
గురుదార రతామూఢాః వరదారీ రతాశ్చయే ।
బ్రహ్మభ్రూణ నధోపేతా యేపిచాత్మహా నోజనాః ।
కుచాశ్చ మూకా బధిరాః పితృమాతృకు లోద్భవాః ।
జాయావంశ సముద్భూతాః బాల వృద్ధాశ్చ సూతికాః ।
యువానో గర్భ సంస్థాశ్చ మిత్రాణి సుహృధస్తథా ।
తిర్యగ్యోనిషు సంభూతా ఇహచాప్యన్య జన్మని ।
తేషాంపిండో మయాదత్తో హ్యక్షయ్య ముపతిష్ఠతు ।

20. శ్లో॥ పితృవంశే చ్యుతాయేచ మాతృవంశేత థైవచ ।
గురుశ్వశుర బంధూనాం యేచన్యే గతీవర్జితాః ।

## బాంధవాయః

యేమే కులే లుప్త పిండః పుత్ర దాద వివర్జితాః ।
క్రియాలోప హతాశ్చైవ జాత్యంధాః పంగవస్తథా ।
విరూపా అమగర్భాశ్చ జాతాజ్ఞాతః కులే మమ ।
తేషాం పిండో మయాదత్తో హ్యక్షయ్య ముపతిష్ఠతు ।

21. శ్లో॥ ఆ బ్రహ్మణ్యాయే పితృవంశజాతా మాతుస్థా ।
వంశభవా మనేయాం వంశద్వయే ఉ స్మిన్ మమ
దానభూత భృత్యాస్తథైవా శ్రిత దేవరాశ్చ సేవకాశ్చ ।

22. శ్లో॥ మిత్రాణి సఖ్యః వశవశ్చ త్రాస్తాస్పృష్టాశ్చ
వృక్షా దృష్టాశ్చ కృతోపకారాహః జన్మాంతరే యే మమ సంగతాశ్చ
తేభ్యస్స్వ పిండమహం దదామి ॥

## కృష్ణానదీ పుష్కర కాలమున 12 దినములలో చేయవలసిన దానములు

1. **11-8-2016 గురువారము :** బంగారము, వెండి, ధాన్యములను దానం చేసిన మంచిది.

2. **12-8-2016 శుక్రవారము :** ఆవు, వస్త్రములు, ఉప్పు, రత్నములను దానము చేయవలెను.

3. **13-8-2016 శనివారము :** కూరలు, ఫలములు, బెల్లము, గుఱ్ఱము (వెండి లేక బంగారము) దానము చేయవలెను.

4. **14-8-2016 ఆదివారము :** నెయ్యి, నూనె, తేనె, పాలు దానము చేయవలెను.

5. **15-8-2016 సోమవారము :** ధాన్యం, బండి, గేదెలు, పోతులు దానము చేయవలెను.

6. **16-8-2016 మంగళవారము :** మంచి గంధము చెక్క, కర్పూరము, కస్తూరి దానము చేయవలెను.

7. **17-8-2016 బుధవారము :** ఇల్లు, వాహనములు, ఆసనము, శయ్య దానము చేయవలెను.

8. **18-8-2016 గురువారము :** గంధపు చెక్కలు, పువ్వులు, కందమూల ఫలాదులు దానం చేసిన మంచిది.

9. **19-8-2016 శుక్రవారము :** కన్యాదానము, సేవకా, తీర్థ పిండపు దానములచే సకలైశ్వర్యములు పొందగలరు.

10. **20-8-2016 శనివారము :** శాకదానం, సాలగ్రామ దానం, పుస్తకము, ముత్యములు, వెండి, పుష్పములచే అక్షయ పుణ్యలోకప్రాప్తి కలుగును.

**11. 21-8-2016 ఆదివారము :** అశ్వము, ఏనుగు దానముచే వైకుంఠము పొందగలరు.

**12. 22-8-2016 సోమవారము :** తిల దానము చేసిన సర్వారిష్టములు తొలగును.

**షోడశ మహా దానములు :** అనగా ఆవు, బంగారము, వెండి, గేదె, రత్నములు, పుస్తకము, ప్రత్తి, ఏనుగు, గుఱ్ఱము, దాసి, త్రాసు, ఇల్లు, తేనె, మేక, శయ్య, కన్యాదానము మొదలగునవి.

పుష్కరం ప్రథమ దినమున హిరణ్యశ్రాద్ధము, 9వ దినమున అన్నశ్రాద్ధము, 12వ దినమున ఆరు శ్రాద్ధములు ముఖ్యముగా ఆచరించవలెను.

పై దానములు చేయుటకు, వీలుకుదరనిచో ఏదో ఒకచోటనైన తీర్థశ్రాద్ధము, హిరణ్యశ్రాద్ధములు ఆచరించవలెను.

పుష్కరకాలంలో సకల దేవతలు కృష్ణానదిలో ఉంటారు. కాబట్టి ఆ కాలంలో చేసే పూజ, అర్చన, నామజపం విశేష ఫలితాలిస్తాయి. ఏ విధమైన మంత్రాలు తెలియకపోయినా, మీ ఇష్టదైవాన్ని తలచుకొంటే విశేష పుణ్యం సంపాదించవచ్చు. ఈ పుష్కర కాలంలో చేసే దానాలు అమిత ఫలాన్నిస్తాయి.

